# మనవి

కొన్నేళ్ళ క్రితం తిరుమల–తిరుపతి దేవస్థానం వారి నిర్వహణలో, తిరుపతిలోని 'మహతి' సభాప్రాంగణంలో మూడు రోజులు చేసిన ప్రవచనానికి పుస్తకరూపమిది.

ఇది సమగ్ర స్వరూపం – అనలేను కానీ, రేఖామాత్రంగా హిందూమతం గురించి ఒక అవగాహనను కలిగించడానికి సహకరిస్తుందని మాత్రం చెప్పగలను. వివిధ అరోపణలకు, అవగాహనా లోపాలకు ఇందులో కొంతమేరకు సమాధానాలున్నాయి.

ఈ దేశానికి, ధర్మానికి ఉన్న అవినాభావ సంబంధం కూడా నేటి యువత గ్రహించే అవకాశం ఉంది. మన ధర్మం నుండి పక్కకు వెళ్ళకుండా, మనది మనం పాటిస్తూ ఇతరులను గౌరవించాలి. ఈ సర్వజనీన సత్యాన్ని సమాజం గుర్తు పెట్టుకోవాలి. మన ధర్మం ఏమిటో తెలియజేసేందుకు **ఋషిపీఠం** సంస్థ 'భారత ఋషిపీఠం' మాసపత్రికను వెలువరిస్తూనే, ఎన్నో గ్రంథాలను ప్రకటిస్తోంది. ఇంటింటా ధర్మ విజ్ఞాన గ్రంథాలయంగా భద్రపరచి, అధ్యయనం చేసి, అందుకుని అందించవలసిన ఈ ప్రచురణలను సహృదయులు స్వీకరింతురు గాక!

ఋషిపీఠంకి ఎంతో ఆప్తులైన **డా॥ కొండా మాధురి – శ్రీ కొండా హరిహరమూర్తి దంపతులు** ఈ పుస్తక ముద్రణకు ఆర్థిక సహకారం అందించారు. వారికి పరమేశ్వరుని ఆశీస్సులు లభించాలని ఆశిస్తున్నాను.

బుధజనవిధేయుడు

**సామవేదం షణ్ముఖశర్మ**

# హిందూధర్మం

## స్వరూపం - స్వభావం - ప్రభావం

ఎన్నో కల్పాల చరిత్ర కలిగిన హిందూధర్మం గురించి చెప్పాలంటే అది హిందూ మహాసముద్రం అంత ఉంటుంది. సృష్టి ఎంత ప్రాచీనమో, హిందూధర్మం అంత ప్రాచీనమైనది. మన ధర్మానికి మతగ్రంథం ఏదైనా ఉందా...! అంటే ఇతర మతస్థులకు ఉంది కనుక మనం ఏదో పేరు చెప్పుకోవాలి కానీ... గ్రంథాల మీద ఆధారపడి వచ్చింది కాదు హిందూధర్మం.

హిందూధర్మం మీద అవగాహన లేనివారికి, ఈ దేశంలో పుట్టనివారికి, ఈ దేశపు సంప్రదాయం తెలియనివారికి హిందూధర్మం అంటే ఏమిటో చెప్పి, వారి చేత ఆ ధర్మమునకు నమస్కరింపజేశారు స్వామి వివేకానంద.

స్వాతంత్ర్యం రాకముందు 'వందేమాతరం' అనడానికి భయపడేవారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 'హిందూ' శబ్దం అనడానికి భయపడే పరిస్థితిలో ఉన్నారు.

## హిందూమతం - పుట్టుపూర్వోత్తరాలు

'హిందూ' అనే శబ్దం చాలా విశేషమైనది. 'హిందూ' శబ్దం ఈ మతం పుట్టినప్పటి నుండే ఉందా? కాదు. సనాతన ధర్మము, ఆర్షధర్మము, భారతీయధర్మము, వైదికధర్మము - ఇవి హిందూధర్మమునకు ఉన్న పేర్లు. ఈ పేర్లకు అర్థం తెలుసుకుంటే హిందూధర్మం స్వరూపం, స్వభావం అర్థం అవుతుంది. దాని వల్ల ఏర్పడే ప్రభావం తరువాత పరిశీలించవచ్చు.

**సనాతనం** - సనాతనం అనే మాటకు 'శాశ్వతం' అని అర్థం. ఇది మార్పు చెందేది కాదు. నిన్ననో, మొన్ననో పుట్టినది కాదు. శాశ్వత శబ్దానికి ఆంగ్లంలో Eternal(ఎటర్నల్) అని అర్థం. సూర్యుడు, చంద్రుడు, ప్రకృతి ఎంత శాశ్వతమో,

అంత శాశ్వతమైనది హిందూధర్మం. ఎక్కడా దీనికి మతం అనే శబ్దం వాడబడ లేదు. 'మతం' అంటే అభిప్రాయం(Opinion). 'ధర్మము' అంటే మనలను పట్టి నడిపించేది, పట్టి ఉంచేది.

**"ధారణాత్ ధర్మమిత్యాహుః" – "ధరతి ఇతి ధర్మః"** – ధర్మ అనే శబ్దానికి అనేక నిర్వచనాలు చెప్పింది శాస్త్రం. ఏదైతే మనలను పట్టి ఉంచుతుందో దాని పేరు ధర్మం. ఇది ఎలాంటిది అంటే – ఒక రైలు నడుస్తూ ఉంటే దాని నడక చాలా అద్భుతంగా వెళుతోందని చూస్తాం. కానీ ఆ రైలుబండిని పట్టి ఉంచేవి రెండు పట్టాలు. అలా మన జీవితగమనాన్ని పట్టి ఉంచే దాని పేరే ధర్మం.

**పట్టాలు తప్పితే రైలుకు ఎంత ప్రమాదమో, ధర్మం తప్పితే మన జీవితానికి అంత ప్రమాదం.**

ధర్మం మనలను పట్టి నడిపిస్తుంది. హిందూధర్మము ఏదో ఒకరి అభిప్రాయం వల్ల వచ్చింది కాదు. ఒకరికి అద్భుతమైన దర్శనం జరిగి – ఒక పుస్తకం వ్రాయగానే, ఆ పుస్తకం పట్టుకుని పదిమంది దానిని పారాయణలు చేసుకుంటూ అదే పవిత్రగ్రంథం అని చెప్పుకుంటూ తయారైన ధర్మం కాదు.

## హిందూధర్మానికి ఆధార గ్రంథాలు

హిందూధర్మము యొక్క అపారమైన జ్ఞానసంపదను ఆవిష్కరించడానికి ఋషుల కృప, గురువుల అనుగ్రహంతో అందినంత చెప్పుకుందాం. కొండను అద్దంలో చూపించడం, సముద్రాన్ని గుప్పెటలో పట్టి చూపించడం వంటి ఒక మహాప్రయత్నం ఇది.

ఎంతో అపార పరంపర కలిగిన హిందూధర్మానికి ఆధారం ఒక గ్రంథం కాదు. ఒకానొక ప్రవక్త కాదు. హిందూ ధర్మానికి ఆధారాలు – 1.గ్రంథరాశి, 2.క్షేత్రములు, 3.మహాత్ములు. ఈ మూడింటి వల్ల హిందూధర్మం పరంపరగా కొనసాగుతూ మన వరకు వచ్చింది.

**"వేదోఽఖిల ధర్మమూలం"**– వేదాలు, తరువాత వచ్చినవి పద్దెనిమిది పురాణాలు, ఇతిహాసాలు. అటుపై మంత్రశాస్త్రాలు, ధర్మశాస్త్రాలు – ఈ అయిదింటిని

ఆధారం చేసుకుని హిందూధర్మం విస్తరించి ఉంది.

వేదాలలో చెప్పిన దానినే పురాణాలు, ఇతిహాసాలు విస్తరించాయి. అంతేకాని పురాణమతం, వేదమతం అని విభజించడానికి లేదు. ఇతిహాసాన్ని, పురాణాన్ని, మంత్రశాస్త్రాన్ని అంగీకరించే వారంతా కూడా హిందువులనే చెప్పబడుతున్నారు.

**శాస్త్రాల బలం కలిగిన ఒకే ఒక్క మతం హిందూమతం** – ఈ మాట హిందూధర్మానికి మరొక అద్భుతమైన నిర్వచనంలా చెప్పుకోవచ్చు.

కృష్ణపరమాత్మ భగవద్గీతలో అనేక చోట్ల శాస్త్రం అంటే ఏమిటో చెప్పాడు.

**'తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ'**

**'యత్ శాస్త్ర విధిముత్సృజ్య వర్తతే కామ కారత ః**

**న చ సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిమ్'**

హిందూమతం భగవద్గీతతో, కృష్ణునితో, రామునితో ప్రారంభం కాలేదు. రాముడు, కృష్ణుడు కూడా హిందూమతస్థులే. వారు అప్పటివరకూ వచ్చిన ఒక సనాతనధర్మాన్నే తిరిగి ప్రపంచీకరించి, విస్తరించి తెలియజేశారే తప్ప అది వారితో మొదలు కాలేదు. ఒక వ్యక్తితో ప్రారంభమైనది కాదు హిందూమతం.

శాస్త్రం ప్రమాణం – అని కృష్ణపరమాత్మ చెప్తున్నాడు. కృష్ణుని దృష్టిలో శాస్త్రం అంటే వేదం. భగవద్గీత భారతంలో ఒక భాగం. భారతం ఇతిహాసం. ఇతిహాసంలో భాగమైన భగవద్గీతలో 'శాస్త్రం' అని చెప్తున్నారు. ప్రమాణంగా తీసుకోదగిన శాస్త్రం ఒకటుంది. ఆ శాస్త్రమే వేదం. ఆ మాటను మళ్ళీ పరమాత్మే చెప్తూ..."**వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః వేదాంతకృత్ వేదవిదేవ చాహం**" – "వేదాలన్నిటి చేత తెలియబడే ఏ పరతత్త్వం ఉందో అది నేను. ఆ వేదాంత జ్ఞానాన్ని అందించేవానిని నేను" అని పదిహేనవ అధ్యాయంలో స్పష్టంగా చెప్పాడు.

వేదం చాలా అద్భుతమైన గ్రంథం. అది సామాన్యమైన పాఠ్యగ్రంథం(Text book) లాంటిది కాదు. అదే అయ్యుంటే దానికి ఇంత గొప్పతనం వచ్చి ఉండేది కాదు. వేదంలో పదాలకు మామూలుగా లౌకికమైన అర్థాలు చెప్పలేం.

లోకంలో ఒక మేధావి ఆలోచనా స్థాయికి, ఒక సామాన్యుని ఆలోచనా స్థాయికి భేదం ఉంటుంది. అతను చెప్పేది సామాన్యునికి అర్థం కాదు. తపస్సమాధిలో అతీంద్రియమైన ప్రజ్ఞ కలిగిన మహర్షి తాను ఒక సత్యాన్ని దర్శించి చెప్తే, సామాన్యులకు అది ఎలా అర్థం అవుతుంది?

వేదము అనే శబ్దానికి అర్థం – జ్ఞానం. 'విద్' అనే ధాతువు నుంచి 'వేద' అనే శబ్దం ఉత్పన్నమైంది. ఆ వేదం ఋషుల వల్ల వచ్చింది... ఋషి వల్ల కాదు. నాలుగు వేదాలలో ఎంతో మంది మహర్షుల పేర్లు ఉన్నాయి. మహర్షులెవరూ కూడా 'నేను ఇది చెప్తున్నాను' అని చెప్పలేదు. అదీ వారి గొప్పతనం.

వేదమంత్రాలకు స్రష్టలు ఉండరు, ద్రష్టలు ఉంటారు. స్రష్ట అంటే తయారు చేసేవారు. ద్రష్ట అంటే చూసినవారు. చూసినవారు ఉన్నదానిని చూశారే తప్ప కొత్త దానిని తయారుచెయ్యలేదు. **"ఋషయో మంత్ర ద్రష్టారః"**. నిరంతర తపస్సు, సాధన చేత ఋషి యొక్క ప్రజ్ఞ మేల్కొంటుంది. దాని పేరు ఋతంభర ప్రజ్ఞ.

సాధారణంగా మనం చూసే ప్రపంచంలో ఎవరికి తోచిన సిద్ధాంతం వారు చెప్తూ ఉంటారు. మన కంటే విజ్ఞానవేత్తలు ఇంకా గొప్పవారు కనుక వారు ఒక సిద్ధాంతం చెప్తారు. ఆ విజ్ఞానవేత్తల కంటే గొప్పవారు మరొకరు ఉంటారు. మన కంటే గొప్పది సైన్సు. సైన్సు కంటే గొప్పది సూపర్ సైన్సు. ఆ సూపర్ సైన్సు పేరే 'అధ్యాత్మికం' అని చెప్పుకోవచ్చు. అది అతీంద్రియ ప్రజ్ఞ.

సైన్సు కూడా ఇంద్రియాలకు అందుతుంది. ఇంద్రియాలకు అందని ఒకానొక 'సత్యం' ఉంటుంది. అది తెలియాలంటే మన దృష్టి కూడా ఇంద్రియాలను దాటిపోవాలి. అలా ఇంద్రియాలను దాటిన ఒకానొక అతీంద్రియదృష్టికి గోచరించిన శాశ్వత సత్యాన్ని వేదం అంటారు. **వేదం అనగా – 'ఋషులు తపశ్శక్తితో దర్శించిన శాశ్వత సత్యాల సమాహారం'**. దాని పేరే హైందవధర్మం. ఈ నిర్వచనం అలాగే గుర్తు పెట్టుకోవాలి.

వేదము అంటే అనేకమంది మహర్షుల ద్వారా వచ్చిన జ్ఞానం. ఆ జ్ఞానం

ఒకదానికొకటి విరుద్ధం కాదు. ఒక దానితో మరొక దానికి అనుబంధం ఉంది. ఒక దానితో ఒకటి పరస్పరం పరిపూరకం.

అవతలివాడు మతం మార్చడానికి మన దగ్గరకు వచ్చినప్పుడు వారు ముందు "మా గ్రంథం మీకు ఇస్తాం...చదవండి" అనగానే వెంటనే తీసేసుకుంటారు. ఇంటికి వచ్చిన అతిథిని గౌరవించడం హిందూమత ధర్మం కనుక వారిని గౌరవించవచ్చు. కానీ తరువాత వారు పుస్తకం ఇస్తూ ఉంటే మాత్రం "ఉండండి, నేను కూడా ఇస్తాను" అని మీరు కూడా ఇవ్వాలి. మనం ఆ పని ఎందుకు చెయ్యలేకపోతున్నాం?

వారికి ఇవ్వడానికి ఒకే పుస్తకం ఉంది. మనం తిరిగి వారికి వెయ్యి పుస్తకాలు ఇవ్వవచ్చు. రామాయణం, భారతం, భాగవతం, భగవద్గీత, శివపురాణం, లలితా సహస్రం, వేదం, ఉపనిషత్తులు – వీటిలో ఏదైనా వారికి ఇవ్వవచ్చు.

సృష్ట్యాది నుంచి ఉన్న మహర్షులు దర్శించి ఇచ్చిన శాశ్వత సత్యాల సమాహారమంతా వేదరూపంలో లభిస్తూ ఉంటే, ఆ వేదాలలో చెప్పిన దానిని సామాన్యజనులకు అందించాలని ప్రయత్నం చేసిన మహానుభావుడు వేదవ్యాసమహర్షి.

హిందూధర్మమునకు ప్రవక్తలు లేరు. ప్రవక్త అని చెప్పుకోవాలంటే వ్యాసులవారినే చెప్పుకోవాలి. ఆయన కూడా కొత్తదేమీ సృష్టించలేదు. కొత్తవి ఏవైనా... కొంపలు ముంచుతాయి అని గుర్తు పెట్టుకోవాలి. మనకు కొత్తవి వద్దు. శాశ్వతమైన ధర్మం కావాలి. ఆ శాశ్వతధర్మం సనాతనధర్మం. సనాతనం అంటే నిత్యనూతనం.

## సనాతనం నిత్యనూతనం ఎలా అవుతుంది?

**సూర్యుడు ఎప్పటి నుంచో ఉదయిస్తున్నాడు. కాని ఎప్పటికప్పుడు కొత్తే. అలాంటిదే సనాతనధర్మం.** ఈ సూర్యుడు ఎంత అందమో, సనాతనధర్మం అంత అందం. ప్రకృతి ఎంత అందమో, సనాతనధర్మం అంత అందం.

ఇది ఋషులు అందించారు కాబట్టి దీనికి 'ఆర్షధర్మం' అని పేరు. ఆర్ష అంటే

ఋషి సంబంధమైనది.

హిందూధర్మానికి మరొక పేరు **భారతీయధర్మం.** మన దేశం పేరు భారతదేశం. ఈ దేశానికి సంబంధించిన ధర్మం పేరు అది. హిందూ అనేది దేశవాచక శబ్దం. ఒక వ్యక్తి పేరుతో వచ్చినది కాదు.

పాశ్చాత్యులు భారతదేశంలో ఉన్న సమస్త విజ్ఞానికి 'హిందూ' అని పేరు పెట్టారు. కొందరు ఛాదస్తులం అనుకునేవారు 'మన మతం పేరు హిందూధర్మం కాదు, సనాతనధర్మం' అని అంటుంటారు. హిందూధర్మం అని కూడా అనడంలో తప్పేమీ లేదు. మన దేశం అసలు పేరు భారతదేశం. కానీ ఇప్పుడు ఇండియా అని పేరు పెట్టారు.

ఇతరులు మన దేశం మీద దాడికి వచ్చేటప్పటికే ఇక్కడ నాగరికత, సంస్కృతి, విజ్ఞానం, పరంపర, జీవన విధానం, కళలు – అన్నీ ఉన్నాయి. వీటన్నిటినీ కలిపి 'హిందూ' అని పేరు పెట్టారు.

అలా మన దేశంలో పుట్టిన సమస్త విజ్ఞానాన్ని కలిపి హిందూ అనాలి. మనం విదేశాలకు వెళితే, "మీరు ఏ మతం వారు" అని అడిగితే "హిందూ" అని చెప్పగానే, "భారతదేశం నుండి వచ్చారా?" అని అడుగుతారు. కానీ ప్రపంచంలో ఇంక ఏ మతంవారైనా వారి పేరు చెప్పినా వారు ఏ దేశం నుంచి వచ్చారు అని అడుగుతారు. హిందూమతానికి, భారతదేశానికి అవిభాజ్య సంబంధం ఉంది.

## భారతదేశమే హిందూమతం, హిందూమతమే భారతీయత

భారతదేశంలో పుట్టిన వారందరూ కూడా ఈ హైందవ విజ్ఞానానికి వారసులు. భారతదేశాన్ని శత్రువుగా చూసే వారైనా సరే భారతదేశాన్ని హిందుస్థాన్ అనక తప్పదు. భారతదేశంలో పుట్టినవాటన్నిటికీ హిందూధర్మం అని కట్ట కట్టేస్తే అసలు పొసగుతుందా? దేని దారి దానిది అంటే అదే ఆశ్చర్యకరమైన అంశం.

హిందూధర్మంలో చెప్పుకునే గొప్పతనం అంతా ఒక దానితో ఒకటి అనుబంధం ఉంది. హిందూధర్మం శాస్త్రాల బలం కలిగిన మతం అని చెప్పుకున్నాం.

హైందవధర్మంలో విజ్ఞానశాస్త్రం కావలసినంత ఉంది. ఇప్పుడు ప్రపంచ విజ్ఞాన శాస్త్రవేత్తలు కూడా అంగీకరించిన విషయం ఇది.

భారతదేశాన్ని ఇతరులు పాలిస్తున్న రోజుల్లోనే ఈ దేశానికి వచ్చి ఈ మతాన్ని అవహేళన చేయడానికే దీన్ని చదివినవారు కూడా దీనిలో గొప్పతనాన్ని గ్రహించి హిందూమతానికి దండం పెట్టారు. వారు "ప్రపంచంలో విజ్ఞాన దేశాలు అభివృద్ధి చెందాయి. కానీ వైజ్ఞానిక శాస్త్రం కూడా ఆవిష్కరించిన సత్యాలు హిందూధర్మ గ్రంథాలలో కనబడుతున్నాయి" అన్నారు.

"రోజు రోజుకీ విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందుతూ ఉంటే, కేవలం విశ్వాసాల మీద ఆధారపడ్డ అనేక మతాలు దెబ్బ తింటాయి. కానీ విజ్ఞానశాస్త్రం పెరుగుతున్న కొద్దీ ఆ విజ్ఞానశాస్త్రం విసురుతున్న సవాళ్ళకు తట్టుకుని నిలబడ గలిగే శక్తి హిందూధర్మానికి మాత్రమే ఉంది. మిగిలినవి పింగాణీ కప్పుల్లా పగిలిపోతాయి" అని స్వామి వివేకానంద చెప్పారు. దానికి అనేకానేక తార్కాణాలు నేడు కూడా కనిపిస్తున్నాయి.

**అంతరిక్ష విజ్ఞానం** – ఇటీవల పాశ్చాత్యులు వ్రాసిన గ్రంథంలో కాస్మోస్ అంటే అంతరిక్ష విజ్ఞానం, అంతరిక్షంలో జరుగుతున్న అద్భుతాలు, విశ్వచైతన్యం యొక్క విశేషాలు – ఇవి సృష్టిలో మొట్టమొదట చెప్పిన జాతి భారతజాతి. వేద, పురాణాలలోనే అది కనబడుతోందని చెప్పారు.

## కాలం

కాలం గురించి చెప్పిన లెక్కలో కనురెప్పపాటు కంటే సూక్ష్మకాలం మొదలుకుని కల్పకాలం వరకూ, అతి సూక్ష్మకాలం నుంచి మహాకాలం వరకూ వైజ్ఞానికంగా కాలాన్ని గణన చేసిన ప్రథమజాతి భారతజాతి అని గ్రీకుదేశానికి సంబంధించిన కీరో అనే ఒక గణిత శాస్త్రవేత్త చెప్పాడు.

గ్లెన్ ఆర్. స్మిత్ అనే విదేశీయుడు రచించిన 'బియాండ్ సిక్స్ థౌజండ్ ఇయర్స్ బారియర్' (Beyond Six Thousand Years Barrier) అనే పుస్తకంలో చెప్పిన అంశాలు భారతీయ పురాణంలో చెప్పిన కాల గణనాన్ని ఆధారం చేసుకుని

చెప్పినవే. హైందవధర్మంలో విజ్ఞానశాస్త్రం కావలసినంత ఉన్నది.

## హైందవ వాఙ్మయం - అనంతం

కేవలం సంస్కృత వాఙ్మయంలోనే కాకుండా భారతదేశంలో ఉన్న అన్ని రాష్ట్రాలలో... అన్ని భాషలలో విస్తారమైన, అత్యద్భుతమైన వాఙ్మయం ఉన్నది. ఆ వాఙ్మయం అంతా కూడా హైందవ వాఙ్మయమే. ఏదో ఒక పుస్తకానికి పరిమితమైన ధర్మం కాకుండా ప్రపంచంలో/మన దేశంలో ఉన్న సర్వభాషలలోను కూడా అత్యద్భుతమైన ధార్మిక సాహిత్యం ఉన్నది. ఇవి అన్నీ కూడా మన సనాతనధర్మానికి ఆధార గ్రంథాలే.

అన్నమయ్య, త్యాగయ్య మొదలైనవారు అందించిన సంకీర్తనలు, మహాకవులు ఇచ్చిన వాఙ్మయం తెలుగువారికి ఎలా ఉందో అదృష్టవశాత్తు భారతదేశంలో ప్రతి భాషలో కూడా అటువంటి వాఙ్మయం ఉంది. ఇదంతా కలిపి చూస్తే హిందూమతం మహాసముద్రం లాంటి ఎంత వాఙ్మయాన్ని కలిగి ఉందో తెలుస్తుంది..

పైగా జ్యోతిషశాస్త్ర, మంత్రశాస్త్ర, యోగశాస్త్ర, విజ్ఞానశాస్త్ర, యజ్ఞశాస్త్ర... ఇలా అనేక రకాల శాస్త్రబలం కలది హిందూమతం. అదేవిధంగా అంతరిక్షానికి సంబంధించిన విశ్వచైతన్యం - దీన్నే కాస్మిక్ అనుకోవచ్చు. కాస్మిక్ ఎనర్జీ ఇత్యాది విషయాలు చెప్పిన మతం ఇది. ఒక దానితో ఒకటి అనుబంధం కలిగిన మతం.

**జ్యోతిష విజ్ఞానం** – హిందూమతం శాస్త్రాలలో జ్యోతిషశాస్త్రం ఒకటి. భారతీయ హైందవధర్మంలో ఒక శాస్త్రంతో మరొక శాస్త్రానికి అనుబంధం ఉంది. ఒకటి విజ్ఞానశాస్త్రమైతే, రెండవది జ్యోతిషశాస్త్రం - అంతరిక్షవిజ్ఞానం. రాశులు, గ్రహాలు, నక్షత్రాలు... ఇవి హిందూధర్మంలో అనివార్యమైన భాగాలు. వేంకటేశ్వరస్వామికి ఏదైనా ఉత్సవం చెయ్యాలంటే మాసం ఏంటో చూస్తారు – కన్యారాశి, శ్రవణా నక్షత్రం, భాద్రపదం అనగానే అంతరిక్షానికి సంబంధించిన నక్షత్రాలు, రాశిచక్రాలు, గ్రహాలుపై ఆధారపడి గణనం చేసుకుంటున్నారు.

**యోగ విజ్ఞానం** – ఇప్పుడు ప్రపంచంలో అందరూ యోగాను అంగీకరించగానే మన దేశం వారికి కూడా గౌరవం పెరిగింది. బాధాకరమైన అంశం ఏమిటంటే ఈ మధ్యకాలంలో యోగా అనేది కూడా హిందువులది కాదు, అది ఏ మతం వారికైనా సంబంధించినదే అని ప్రచారం చేసే ఒక దుష్ప్రయత్నం జరుగుతోంది.

సూర్య నమస్కారాలు వ్యాయామానికి మంచిది కానీ అందులో చెప్పబడే **'మిత్రాయ నమః', 'రవయే నమః'** మొదలైన మంత్రాలు ఉంటే అది హిందూ మతమైపోతుంది కనుక ఆ నామాలు తీసేసి వ్యాయామం చెయ్యండి అంటున్నారు. ఆ వ్యాయామం ఏ శాస్త్రంలో పుట్టిందో వారు ఆ నామాలు చెప్పినప్పుడు వాటిని తీసెయ్యడానికి వీళ్ళు ఎవరు? పతంజలి యోగశాస్త్రం అనగానే ప్రపంచంలో ఎవరైనా నమస్కరించవలసిందే.

విదేశాలలో వీధి వీధికి యోగాకేంద్రాలు తయారయ్యాయి. కాని యోగా అంటే పతంజలి యోగానే, మరొకటి కాదు. "ఈశ్వరుని తెలియచేసేది ప్రణవం(ఓంకారం)" అని పతంజలి చెప్పాడు. ఓంకారం హిందువులది. యోగాలో అది చెయ్యాలి అని చెప్పినప్పుడు – ఓంకారం అనే దానిని యోగప్రక్రియలో చేస్తే ఆరోగ్యం బాగుంటుంది అని పతంజలి చెప్తే, దానిని తీసివెయ్యడానికి మనమెవరం? ఆ సంస్థలకి పేరు మాత్రం పతంజలి అని పెట్టుకుంటున్నారు.

ఓంకారాన్ని ఉంచి యోగశాస్త్రాన్ని చెప్తే ఆ యోగం హిందువులదే అవుతుంది. **'ప్రపంచానికి ఆరోగ్యం కలిగించగలిగే శక్తి కలిగిన యోగం హిందువులదే'** అని తెలుసుకోవాలి. యోగా కూడా దేనికి పనికి రానిది... ఊరికే మతాలు వేసుకుంటారు... అని ఒకప్పుడు హిందువులను వెక్కిరించినవారే ఇప్పుడు దానిని నెత్తికెత్తుకుంటున్నారు.

**ఆయుర్వేద విజ్ఞానం** – ఒకప్పుడు ఆయుర్వేదాన్ని కేవలం నాటు వైద్యం, నమ్మకాల వైద్యం అని అవహేళన చేసినవారు ఈ రోజులలో అధునాతన వైద్యవిధానం కంటే ఆయుర్వేద వైద్యవిధానం గొప్పది అని నమస్కరిస్తున్నారు.

అది నూటికి నూరు పాళ్ళు హిందూధర్మానికి సంబంధించినదే.

ఆయుర్వేదం భారతదేశంలో ఒక వైద్యశాస్త్రం. అది హిందువులది ఎందుకు కాదో, ఎందుకు అవునో... రెండూ పరిశీలించాలి. ఎందుకు కాదు! అనడానికి ఆధారం లేదు. ఎందుకు మనది అవుతుందో చెప్పవచ్చు. ఉదాహరణకు ఆయుర్వేదం అనగానే గుర్తుకొచ్చేవారు చరకుడు, సుశ్రుతుడు. ఈ సత్యాలను యువత గ్రహించగలిగితే మన భారతదేశం గొప్పతనం తెలుస్తుంది.

ఇప్పుడు ఆయుర్వేదంలో చెప్పిన విధానాలు గమనిస్తే–చరకుడు, సుశ్రుతుడు పేర్లు తెలుసుంటే... మొట్టమొదట భూమి మీద శస్త్రచికిత్స పుట్టింది భారతదేశంలోనే అని అర్థమౌతుంది. ఆ శస్త్రచికిత్సను అందించినవాడు సుశ్రుతుడు. ఇలా ఎంతో మంది వైద్యులు ఉన్నారు. ఉద్భటుడు మొదలైన వాళ్ళందరూ కూడా అద్భుతమైన వైద్యులు.

అదేవిధంగా యోగశాస్త్రం కూడా ఆరోగ్యానికి సంబంధించినదే. అద్భుతమైన జీవనవిధానానికి, మన ఆయుష్షు పెంచడానికి పనికి వచ్చేవి – అటు యోగా, ఇటు ఆయుర్వేదం. ఈ రెండిటి గురించి చరకుడు, సుశ్రుతుడు ఆరోగ్యం బాగుపడడానికి కొన్ని శ్లోకాలలో చెప్పారు. ఒకానొక రోగం పోవాలంటే ఒక ఔషధం వాడాలి, ఒక మంత్రం జపం చెయ్యాలని చెప్పారు.

ఉదాహరణకు చరకుడు ఒక గ్రంథంలో రోగం పోవడానికి ఒక ఔషధం చెప్తూ, ఆ రోగం శాంతించాలంటే పురుషసూక్త పారాయణం లేదా విష్ణుసహస్రనామ పారాయణం చెయ్యాలని వ్రాశాడు. ఆరోగ్యం బాగుపడాలంటే మణి, మంత్ర, ఔషధులు మూడింటి సహాయం కావాలని ఆయుర్వేద విధానం చెప్తోంది. మంత్రం మళ్ళీ వేదం నుంచి వచ్చిందే. విష్ణువో, శివుడో, గ్రహశాంతులో వీటికి సంబంధించినవే కదా!

**మంత్రవిజ్ఞానం** – మనం పరిశీలిస్తే విజ్ఞానశాస్త్రం, జ్యోతిషశాస్త్రం, ఆయుర్వేదశాస్త్రం, యోగశాస్త్రం, తరువాత మంత్ర శాస్త్రం. మంత్రశాస్త్రం అంటే ఏవో మంత్రాలు, యంత్రాలు – ఇవన్నీ నమ్మకాలు అంటారు. కానీ అది

నమ్మకమో, విజ్ఞానమో తేల్చడానికి దాని మీద ఏం పరిశోధన చేశారు? అవేం పరిశీలించకుండానే ఒకప్పుడు పాశ్చాత్యులు ఈ దేశాన్ని పాలించినప్పుడు హిందువుల యంత్రాలు, విగ్రహాలు, మంత్రాలు – ఇవన్నీ మూఢ నమ్మకాలు అన్నారు.

పాశ్చాత్య దేశానికి చెందిన జాన్ వుడ్రాఫ్ అనే శాస్త్రవేత్త 17వ శతాబ్దం మధ్యభాగంలో భారతీయమైన యోగాను, మంత్రశక్తిని, కుండలినీశక్తిని పరిశోధించి 'ది సర్పెంట్ పవర్', 'ది గార్లెండ్ ఆఫ్ లెటర్స్';(The serpent power and The Garland of Letters), 'ది వర్డ్ పవర్' (The Word Power) అనే పుస్తకాలు వ్రాసి మంత్రానికి, యంత్రానికి ఉన్న మహిమని ఋజువు చేశాడు. ఇప్పుడు వాటిని విజ్ఞానశాస్త్రవేత్తలు కూడా నమస్కరిస్తున్నారు.

పడమటి దేశాలలో చదువుకున్నవారు, తెలివైనవారు, ఆలోచించేవారు హిందూధర్మాన్ని స్వాగతిస్తూ హిందూధర్మంలోకి వస్తూ ఉంటే ఏ ఆలోచనా లేనివారు, మూర్ఖులు, ప్రలోభాలకు లోనైన మనవారు హిందూధర్మం లోంచి బయటకు వెళుతున్నారు.

**తత్త్వశాస్త్రం** – హిందూధర్మం అంటే ఏమిటో ముందు అవగాహన పొందాలి. ఇప్పటివరకు చెప్పుకున్న దానిలో హిందూధర్మం అంటే శాస్త్రాల బలం కలిగిన మతం. ఇందులో యోగ, జ్యోతిష, ఆయుర్వేద, మంత్ర, విజ్ఞానశాస్త్రాలతో పాటు అద్భుతమైన తత్త్వశాస్త్రం ఉంది. దీనినే వేదాంతశాస్త్రం(philosophy) అని కూడా అంటున్నారు.

వేదాంతం అంటే వేదాల చివరి భాగం. మన దేశంలో ఒక వ్యవహారం ఉంది – ఎవరైనా ఏదైనా మాట్లాడితే 'వేదాంతం చెప్తున్నాడు' అంటారు. అలా అనేవారికి అసలు వేదాంతం అంటే అర్థం తెలుసా? వేదాంతం అంటే వేదాల

## సకలశాస్త్ర సమన్వయం

ఇన్ని శాస్త్రాల బలం కలిగిన హిందూధర్మానికి ఆ పేరు ఎందువల్ల వచ్చింది?

ఈ దేశంలో పుట్టిన సమస్త విజ్ఞానాన్ని కలిపి, వాటికి పేరు పెట్టడం కాదు. ఈ దేశంలో అలా కలిసి ఉన్నాయి.

యోగశాస్త్రంలో కూడా వైదిక శబ్దాలు చాలా ఉంటాయి. వేదంలో విషయాలే దానిలో చెప్పారు. ఆయుర్వేద శాస్త్రానికి – హిందూధర్మానికి, జ్యోతిష శాస్త్రానికి – హిందూధర్మానికి సంబంధం ఉంది. అవి విడివిడి శాస్త్రాలు కావు. ఒక శాస్త్రంతో ఒకటి అనుబంధం కలిగి ఉన్న ధర్మం – హిందూధర్మం.

అక్షరజ్ఞానం లేనివారు కూడా విదేశాల నుంచి వచ్చిన నిధుల కోసం ఆశపడి, ఒక పుస్తకాన్ని చంకనేసుకుని ప్రచారాలకు బయలుదేరిపోతూ ఉంటే, ఇంత జ్ఞానబలం కలిగిన మన ధర్మాన్ని ప్రచారం చెయ్యడంలో వెనకడుగు ఎందుకు వెయ్యాలి? ముందుకే వెళదాం. హిందూధర్మం గొప్పతనాన్ని ప్రపంచానికి తెలియజేద్దాం.

ఈ దేశపు సహజమైన, నైసర్గికమైన ధర్మమే హిందూధర్మం. ఈ దేశం నేటివ్ రెలిజియన్ హిందూమతం. ఈ దేశంలో మీరు, నేను ఎలా పుట్టామో హిందూధర్మం అలా పుట్టింది. మీకు, నాకు ఇక్కడ బ్రతికే హక్కు ఎలా ఉందో హిందూధర్మానికి కూడా అలానే ఉంది. భారతీయతే హిందూధర్మం. సింధూ నుంచి హిందూ వచ్చింది, హిందూ నుంచి ఇండస్, ఇండియా వచ్చింది. ఇలా హిందూ శబ్దం నుంచే ఇండియా పుట్టింది.

కొందరు మేధావుల అభిప్రాయం ప్రకారం– పర్షియన్ల ప్రాచీన **అవెస్తా** గ్రంథంలో 'సప్తసింధువు'ను 'హప్తసింధువు'గా పేర్కొన్నారు. 'స'కారం 'హ'కారంగా వ్యవహరింపబడింది. ఋగ్వేదమంత్రంలో సప్తసింధువు(నదులు)లను పేర్కొన్నారు. కేవలం సింధునది మాత్రమే కాదు. సింధువు–అనే మాటకే నదీప్రవాహమని ప్రధానార్థం.

**"ఇమం మే గంగే యమునే సరస్వతి శుతుద్రి**
**స్తోమం స చ తా పరుష్ణియా అశిక్న్యా మరుద్వృధే**
**వితస్థయార్జీకీయే ఋణోహ్యాసుషోమయా"**

–అనే ఋజ్మంత్రంలో గంగ, యమున, సరస్వతి, శుతుద్రి, మరుద్వృధ, ఆర్జికియ, సుషోమ – అనే ఏడు నదులు పేర్కొన్నారు.

అలాగే – **గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి। నర్మదే సింధు కావేరి జలేఽ స్మిన్ సన్నిధిం కురు॥**

– అని సప్తనదులను నిత్యం సంకల్పంలో స్మరించడం సనాతన సంప్రదాయం. ఆ పుణ్యనదుల తీరాలలో విలసిల్లిన ధర్మం 'సింధుధర్మం' – హిందూధర్మం – అనవచ్చు.

కొన్ని శతాబ్దాల క్రితం నుండే వృద్ధస్మృతి, బార్హస్పత్యశాస్త్రం మొదలైన గ్రంథాలలో హిందూధర్మ శబ్దం సనాతనధర్మానికి పర్యాయంగా వాడబడింది.

## భారత శబ్దార్థం

భారత శబ్దం ఎక్కడి నుంచి వచ్చింది? భారత అనే శబ్దం కూడా వేదాలలో కనబడుతుంది. **'అగ్నిమిచ్ఛధ్వం భారతాః'** – 'ఓ భారతులారా! మనందరం అగ్నిని ఆశ్రయించుదాం' అని ఒక మంత్రం. అంతే కాదు... భరత అనే శబ్దం వేదాలలో ఉంది. మన దేశం పేరు భారతదేశం. 'భరత వర్షే, భరత ఖండే...' అని యుగాల నుంచి చెప్తున్నాం.

## భరత అనే పేరు ఎలా వచ్చింది?

'భరతుడు పాలించడం వల్ల భరత అని వచ్చింది' అని కొందరు చెప్తారు. ఏ భరతుడు? మళ్ళీ ప్రశ్న. రాముని తమ్ముడా!... దుష్యంతుని కొడుకా!... వీళ్ళిద్దరి కంటే ముందే ఉన్న జడభరతుడా! ఏ భరతుని వల్ల వచ్చింది? దుష్యంతుని కొడుకు అని ఒకరు చేప్తే, 'కాదు... జడభరతుని వల్ల వచ్చింది' అని మరొకరు అంటారు.

భరత శబ్దానికి నిర్వచనం పరిశీలిస్తే – భారతీయత, హిందూమతం అనే శబ్దాలు విడదీయలేనివిగా కనిపిస్తాయి. **'భరత్వ రమణత్వాత్ భరతః'** – భరత్వ, రమణత్వములు చేయువాడు భరతుడు అని భరత అనే శబ్దానికి వేదం అర్థం

చెప్పింది. ఈ భరతుడు అనే పేరు వేదం ఇద్దరికి చెప్పింది. ఒకటి పరమేశ్వరునికి, రెండు అగ్నికి.

పరమేశ్వరుడు భరత్వం, రమణత్వం రెండూ చేస్తున్నాడు. భరత్వం అంటే పోషించుట, రక్షించుట. నిజానికి ప్రపంచాన్ని పోషించి, రక్షించేవాడు పరమేశ్వరుడు. అంతే కాదు, రమణత్వం అంటే ఆనందింపజేయుట. చక్కగా పోషించి ఆనందాన్ని అందించేవాడు కనుక భగవంతునికి 'భరతుడు' అని పేరు.

అగ్నిహోత్రునికి భరతుడు అనే పేరు. **'హవిర్భరణ సామర్థ్యాత్'** అనే అర్థం వేదమే చెప్పింది. హవిస్సులు అగ్నిలో వేస్తున్నాం. అగ్నిదేవుడు హవిస్సులు భరించి దేవతలకు అందించి దేవతలను ఆనందింపజేస్తున్నాడు. తద్వారా దేవతలు సంతోషించి వర్షాలు కురిపించి మనలను ఆనందింపజేస్తారు. సరిగ్గా భగవద్గీతలో స్వామి చెప్పినట్లుగా-

**సహ యజ్ఞా ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,**
**అనేన ప్రసవిష్యధ్వం ఏషవోస్త్విష్ట కామధుక్.**

అగ్నిహోత్రం, యజ్ఞము ద్వారా దేవతలను తృప్తిపరిస్తే దేవతలు సంతోషించి మనలను అనుగ్రహిస్తున్నారు. పరమేశ్వరునికి భరతుడు అని పేరు. ఆ భరతుడైన పరమేశ్వరుని ఆరాధించే వారికి భారతీయులు అని పేరు. ఆ యజ్ఞాన్ని ఆచరించి, యజ్ఞం ద్వారా జీవించే యజ్ఞభూమికి భరతవర్షం అని పేరు. యజ్ఞభూమిలో జీవించే వారికి భారతీయులు అని పేరు.

భరత అంటే యజ్ఞభూమి. భరత అంటే పరమేశ్వరుని భూమి. ఈశ్వర సంబంధమైన సర్వజ్ఞానములు అందివ్వగలిగినది భారతీయ సంస్కృతి. ఇతర దేశాలలో మతం వేరు, విజ్ఞానం(సైన్స్) వేరు. దేని విభాగాలు దానికి కనబడుతూ ఉంటాయి. విడదీసి బ్రతకడం, విడిపోతూ బ్రతకడం వారికి అలవాటు. కానీ ఒక దానితో ఒక దానికి ఉన్న అనుబంధం తెలుసుకోవడం మహా కష్టం. ఆ సమన్వయం హైందవ ధర్మంలో సహజంగా ఉంది.

గణితశాస్త్రం చదివితే దానిలో భగవంతుని గురించి చెప్పారు. వైద్యశాస్త్రంలో

భగవంతుని గురించి చెప్పారు. భారతీయులు యుగాల క్రితమే గణితాది శాస్త్రాలలో ఉద్దండులు. అంతరిక్ష విజ్ఞానంలో పండితులు. ఆ పండితులు కూడా మనదైన వేదవిజ్ఞానంలో ఉన్న అంశాలనే ప్రస్తావించారు. ఒక దానితో ఒకటి అనుబంధం కలిగి ఉంది. అన్నీ కలిపి హిందూధర్మం అని వ్యవహరిస్తున్నాం.

హిందూ, భరత, ఆర్ష, సనాతన అనేవి పర్యాయపదాలు. ఇవన్నీ మనవి అని తెలుసుకోవాలి. అనీబిసెంట్ హిందూమతం గురించి చెప్తూ "భారతదేశంలో హిందూమతం ఉంది కాదు... హిందూమతంలో భారతదేశం ఉంది" అన్నారు. ఎంత అందమైన మాట! "హిందూమతాన్ని తీసి వేస్తే భారతదేశానికి భవిష్యత్తు లేద"ని ఒక పాశ్చాత్య వనిత చెప్పారు.

1893లో ప్రపంచమంతా పర్యటించి వచ్చిన వివేకానంద చెప్పిన మాట – "ప్రపంచంలో అన్ని దేశాలు తిరిగాను. అన్ని మతాలు అవగాహన చేసుకున్నాను. అన్నీ చూసిన తరువాత తెలిసింది – నా ధర్మం కంటే, నా దేశం కంటే గొప్పది మరొకటి లేదు. ఇంత చెప్తున్నప్పుడు నాదైన ధర్మం గొప్పతనమే చెప్తున్నాను తప్ప ఇతరులను ఏమీ తగ్గించడం లేదు. ఇతరులను నేను చాలా గౌరవిస్తాను. ఎందుకంటే ఇతర మతాలు కూడా మా అమ్మ మతమైన హిందూధర్మం నుంచే పుట్టాయి".

భారతం రచిస్తూ వ్యాసుడు **"యది హాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"** – 'ఇక్కడ ఉన్నదే ఎక్కడైనా ఉంది, ఇక్కడ లేనిది ఎక్కడా లేదు' అని చెప్పాడు. భారతం విషయంలో వ్యాసుడు ఏమనుకున్నాడో హిందూధర్మం విషయంలో అదే అనుకోవాలి. అందులో సందేహం లేదు. ఈ ధర్మాన్ని పరిశీలించిన వారు మాత్రమే ఇలా చెప్పగలరు. ఇక్కడ ఉన్నదే ఎక్కడైనా ఉంది.

1893 సెప్టెంబరు పదకొండవ తేదిన స్వామీ వివేకానంద చికాగో మహాసభలో మొట్టమొదట చెప్పిన మాట ఒక్క సారి గుర్తు తెచ్చుకుంటే గుండె పొంగిపోతుంది... ఒళ్ళు పులకరించిపోతుంది – "నేను సనాతన భారతీయ హైందవ ధర్మం తరపున మీ అందరికీ నమస్కరిస్తున్నాను. భారతదేశపు యతి

ధర్మ పరంపర తరపున నమస్కరిస్తున్నాను. ప్రపంచ మతాలకు తల్లి అయిన హిందూధర్మం పక్షాన నమస్కరిస్తున్నాను" అని విదేశస్థులతో కిటకిటలాడుతున్న సభలో, అన్య మత మేధావులున్న సభలో ఎలుగెత్తి స్వామి వివేకానంద చెప్పిన ధైర్యానికి నమస్కరిస్తున్నాను.

అంత ధైర్యం ఎక్కడి నుంచి, ఎందువల్ల వచ్చింది అంటే... సత్యం వల్ల వచ్చిన ధైర్యం అది. సత్యం ఎక్కడ ఉంటుందో ధైర్యం అక్కడ ఉంటుంది. సత్యంతో చెప్తున్నాడు. అవతలి వారు ప్రశ్న వేస్తే సమాధానం చెప్పడానికి తాను సిద్ధం.

అక్కడ ఏమన్నారంటే– **'ప్రపంచ మతాలకి తల్లి'** (the mother of all religions). ఇది గొప్ప మాట. ఏది వెతకండి, ఎక్కడ వెతకండి– దీనిలో భాగం కనబడుతుంది. ఒక పరిపూర్ణమైన హైందవధర్మంలో శాఖలవలె అవి కనబడుతూ ఉంటాయి. పరిపూర్ణత ఇక్కడ ఉంది. అదీ గ్రహించవలసిన ప్రధానమైన అంశం.

## హిందూమత సిద్ధాంతాలు - ఒక వివేచన

హిందూమతం ఒక మహానదిలా ఉంటే, మిగిలినవి చిన్న చిన్న పాత్రలలో పెట్టిన నీళ్ళు. ఇందులో ఉన్నదే ఎక్కడైనా కనబడుతుంది. అంతే కాదు... **"భగవంతుని గురించి ఎన్ని రకాల ఆలోచనలు చెయ్యాలో అన్నీ ఇదివరకే చేసి పెట్టి ఇంకెవరికీ ఏమీ చెయ్యడానికి మిగల్చని మతం హిందూమతం".**

మతం, ధర్మం అంటే నిర్వచనం రమణమహర్షి అద్భుతంగా చెప్పారు. విశ్వజనీన నిర్వచనాలు ఇవ్వడంలో హిందూమతానికి సాటి మరొకటి లేదు. "జీవుడు, జగత్తు, ఈశ్వరుడు... ఈ ముగ్గురి గురించి చర్చ చేసే దానికే మతం లేదా అధ్యాత్మికత అని పేరు". జీవుడు, జగత్తు, ఈశ్వరుడు... ఈ మూడే మన ముందు ఉన్నాయి.

జీవుడు అంటే ఎవడికి వాడు. ముందు వీడు ఉంటే తరువాత ప్రపంచం. దీనికి అన్నమయ్య చక్కగా చెప్తూ 'ముందు తా కలిగితే మూడు లోకములు' అన్నాడు. ముందు నువ్వు ఉంటేనే మూడు లోకాలు. నువ్వు నిద్ర పోతే, నీకు

లోకమే లేదు. నీ లోకం నీదే.

**'కనురెప్ప మరుగుననె కలిమియును లేమియును**

**కను తెరిచినంతనే కలుగు నీ జగము**

**కను మూసినంతనే కడు శూన్యము**

**తన మనోభావనల తగిలి తోచీని'**

అన్నారు అన్నమాచార్య. సృష్టిలో అందరి కంటే గొప్పవారు ఎవరు అంటే ఎవరికి వారు నేనే అనుకుంటారు. కనుక ముందు నేను. తరువాత ప్రపంచం. ఈ రెండూ ప్రతివారికీ తెలిసినవే. నాస్తికునికి కూడా ఈ రెండూ ఉంటాయి. నేను, ప్రపంచం అంతే!

నేను, ప్రపంచం కూడా ఎవరి చేతిలో ఉన్నాయో వాడు 'ఈశ్వరుడు'. నేను, ప్రపంచం, ఈశ్వరుడు. ఈ ముగ్గురి గురించి చర్చించే దాని పేరు 'మతం'. ఈ చర్చలో ఎవరి అభిప్రాయాలు వారు చెప్తారు. పుర్రెకో బుద్ధి, బుద్ధికో సిద్ధాంతం, సిద్ధాంతానికో రాద్ధాంతం. ఈశ్వరునికి, జగత్తుకి, జీవునికి భేదం లేదు. ఉన్నదంతా పరమాత్మయే – భేదం లేదు అంటారు. ఆయన చేతిలో ఇది ఉంది అంటారు వేరేవారు. ఆయన అంశే ఇది తప్ప ఆయన నుంచి వేరేమీ కాదు. అంటే భేదం ఉంది, భేదం లేదు అంటారు ఇంకొకరు.

మొదటివారు 'అభేదవాదులు', రెండవవారు 'భేదవాదులు', మూడవవారు 'భేదాభేదవాదులు' – ఈ ముగ్గురు ఏం మాట్లాడుకున్నా చెప్పేది మాత్రం ఈశ్వరుడు, జగత్తు, జీవుని గురించే. దేవుని గురించి ఎన్ని రకాలు ఆలోచించగలమో అన్నీ దీనిలో ఉన్నాయి.

ఉదాహరణకు, "భగవంతునికి ఆకారం లేదు. మీరు ఆకారంతో పూజించెదరు" అని ఎవరైనా వచ్చి అడిగితే, 'అవునేమో!' అని అనుకోకండి, వెంటనే చెప్పండి– 'మా మతంలో భగవంతునికి ఆకారం లేద'ని మనమే చెప్తాం కదా! లలితాసహస్రంలో అమ్మవారి ఆకారం ముందు గొప్పగా వర్ణిస్తారు. కొన్ని నామాల తరువాత 'నిరాకారా, నిరాకులా' అని చదువుతాం. నిరాకారమూ

మనమే చెప్పాం.

## ఇందరు దేవతలెందుకు?

'ఇందరు దేవుళ్ళు ఏమిటండీ?' అన్నాడు ఒకాయన. వాడికి ఏం నష్టమో అర్థం కాదు. ఒకాయన ఎవరో మన ఇంటికి వచ్చి 'మీ ఇంటిలో ఇంత జనాభా ఎందుకండీ? అందరూ చచ్చిపోండి' అంటే చచ్చిపోతామా? వాడెవడు అనడానికి? ఇంత మంది దేవుళ్ళు ఉన్నందుకు మనం ఆనందించాలి.

దేవుళ్ళు ఎందరు? ఒక్కరా..? ఇద్దరా..? దేవుడొక్కడే... ఈ మాట ఎప్పుడో చెప్పాం. **'ఏకం అద్వితీయం బ్రహ్మ', 'ఏకో నారాయణో హరిః'.** ఏక శబ్దం మనలోనే ఉంది. కనుక **నిరాకారమూ మనమే చెప్పాం, సాకారమూ మనమే చెప్పాం. ఏకమూ మనమే చెప్పాం, అనేకమూ మనమే చెప్పాం.** భగవంతుని ఎన్ని రకాలుగా ఆలోచించాలో అన్నీ హిందూధర్మంలో చెప్పారు.

"ఒకే గ్రంథం, ఒకే ప్రవక్త, మీరు ఆ గ్రంథాన్ని, మేం చెప్పిన దేవుని నమ్మినచో బాగుపడెదరు లేకపోతే నాశనమైపోదురు" అని హిందూమతం ఏనాడూ చెప్పదు. ఇదీ దాని గొప్పతనం. హిందూమతం ఎంతో గొప్పగా మానవజాతిని అర్థం చేసుకుంది. అందరూ ఒక్కలా ఉండరు. జీవలక్షణాలు ఉంటాయి. ఒకరిది సాత్త్విక ప్రవృత్తి, వేరొకరిది రాజస ప్రవృత్తి, మరొకరిది తామస ప్రవృత్తి. ఈ పదాలు కూడా హిందూమతం తెలిస్తే కానీ తెలియవు.

సాత్త్విక, రాజస, తామస – ఈ మూడు గుణాలు ఎక్కడ ఉంటాయి? హిందూ మతంలోనా? కాదు. ప్రపంచంలో ఉంటాయి అని తెలుసుకోవాలి. ఒక గుండె వ్యాధి నిపుణుడు గుండె గురించి ఉపన్యాసం ఇచ్చాడనుకోండి. ఏమీ తెలియదు కనుక మనం కూర్చుని నోరు వెళ్ళబెట్టి వింటాం. కానీ ఆ చెప్పేవానికి, వినేవానికి ఇద్దరికీ గుండె మాత్రం ఉంది. హిందూమతం ప్రపంచంలో ఉన్న సత్యాలనే చెబుతోంది తప్ప అదేదో లేని కొత్త సత్యాన్ని చెప్పడం లేదు అని తెలుసుకోవాలి.

మనలో ఉన్నది, మనకి కావలసిందే హిందూమతం చెప్పింది. సాత్త్విక, రాజస, తామస గుణాలు ఉంటాయి. వాటి పాళ్ళలో భేదాలు ఉంటాయి.

ఇలాంటి అనేక రకాల ప్రవృత్తులు ఉన్న వారిలో ఒకొక్క అభిరుచి ఒకొక్కరికి ఉంటుంది. భిన్న భిన్న మార్గాల వారిని, భిన్న భిన్న జీవలక్షణాల వారిని ఆ పరమసత్యంతో అనుబంధం ఏర్పరచడానికి ఎన్నో మార్గాలు ఉంటాయి.

## దేవుడు ఒకడే కదండీ! మరి ఇందరు దేవుళ్ళు ఎందుకు?

దేవుడొక్కడే, కానీ జీవులు ఎందరో. జిహ్వాకో రుచి, జీవునికో బుద్ధి, ఒకొక్కరికి ఒక సంస్కారం, ఒక జీవలక్షణం ఉంటాయి. వారికి తగ్గట్టుగా వారు భగవంతుని ఆరాధించడం కోసం, విభిన్న జీవ లక్షణాలు కలిగినవారు తరించడం కోసం విభిన్న మార్గాలను మన శాస్త్రాలే ఏర్పరచాయి. ఎవరి ఇష్టానుసారం వారు ఎంచుకోవడం కాకుండా, 'ఈ జీవలక్షణం ఉన్నవారు ఇలా అనుసరిస్తే తరిస్తారు' అని ఎన్నో మార్గాలు ఏర్పరచింది.

ఒకరికి నిరాకారం ఇష్టం. ఇంకొకరికి సాకారం ఇష్టం. ఆ సాకారంలో మళ్ళీ ఒకరికి విష్ణువు, ఇంకొకరికి శివుడు ఇష్టం. ఒకే ఇంట్లో నాలుగు ఇష్టాలు. నాన్నగారేమో 'నమో నారాయణాయ' జపం చేస్తారు. అమ్మ 'గౌరీ జపం'. పెద్ద పిల్లవాడు 'హనుమంతుని' జపం చేస్తే, రెండవ పిల్లవాడు 'శివపంచాక్షరి' జపం చేస్తాడు. నలుగురూ ఒకే ఇంటిలో కూర్చుని జపం చేస్తారు. భిన్న భిన్న సిద్ధాంతాలైనా ఒకే కప్పు క్రింద బ్రతకగలగడమే హిందూమతం యొక్క గొప్ప లక్షణం.

హిందువులలో ప్రతివారికీ ఒక అవగాహన ఉన్నది. ఏ దేవతా భక్తులైనా సరే ఒక మాట అనక తప్పదు– **'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి'.** అప్పుడు వారు విష్ణువును ఇష్టంగా నమస్కరిస్తున్నా కూడా ఇతర దేవతలు ఆయన స్వరూపాలే అనే భావన సహజంగా ఉంటుంది. కనుకనే ఎన్నో సంప్రదాయాలు ఉన్నప్పటికీ హిందూమతం సహజంగా జీవించగలుగుతోంది. కలిసి బ్రతకగలుగుతోంది. భిన్నత్వంతో కలిసి బ్రతకడం హిందూమతానికి సహజం కనుక ఇతర మతాలను కూడా ప్రేమగా పొదువుకుని కలిసి బ్రతక గలిగే లక్షణం హిందూమతంలో ఉంది.

## ఛాందసవాదం!?

'అసలు హిందూ ఫండమెంటలిస్టు(Fundamentalist)గా మారిపోతే చాలా బాగుంటుంది' అని బ్రిటను దేశస్థురాలైన ఒకామె ఇటీవల చెప్పిన మాట ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. Fundamentalist అంటే ఛాందసవాది అని తెలుగులో అర్థం. ఇది పత్రికాభాష.

Fundamentalist అంటే ఛాందసవాదిగా తాను ఏ మతం పట్టుకున్నారో దానిని తు.చ. తప్పకుండా పాటించేవారు. హిందూమతాన్ని తు.చ. తప్పకుండా పాటించే వాళ్ళమైతే ఎలా ఉంటాం? హిందూమతం ప్రధానంగా ఎవరు ఏ మార్గంలో ఉపాసించినా ఉపాసించేది ఒకే దైవాన్ని అనే భావన సహజంగా కలిగి ఉంటుంది. మనం హిందూ ఛాందసవాదులమైతే అవతలి వారిని మన మతంలోకి మార్చాలని ప్రయత్నం చెయ్యము. మన మతంలోకి మారకపోతే ధ్వంసమూ చెయ్యము. **'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః'** అని చెప్పిన జగద్గురువులు ఇచ్చిన మతంలో పుట్టాం.

'నీ ధర్మం ఎలా ఉన్నా నీ ధర్మంలో నువ్వు తరిస్తావు. అంతే కాని ధర్మం మారవలసిన అవసరం లేదు' అని చెప్పిన హిందూధర్మాన్ని నమ్ముతున్నప్పుడు మనం బ్రతుకుతాం, ఇంకొకరిని బ్రతకనిస్తాం. వారిని బాధించం, సంహరించం. ఇప్పుడు ఊహించండి- హిందూ ఛాందసవాదమే ప్రపంచమంతా ఉంటే ప్రపంచంలో అందరూ హాయిగా శాంతిగా ఉండగలరు. తాను బ్రతుకుతూ, ఎదుటవారిని బ్రతకనిచ్చే మతం హిందూమతం. ఎవరు ఎలా ఉపాసించినా ఆ స్థితిలోకి వెళ్ళగలరు.

స్వామి వివేకానంద మొట్టమొదట అమెరికాలో హిందూమతాన్ని పరిచయం చేస్తూ చెప్పిన మాట-

**రుచీనాం వైచిత్ర్యాత్ ఋజు కుటిల నానా పథజుషాం**
**నృణామేకో గమ్యః త్వమసి పయసామర్ణవ ఇవ**

ఏనాటి యుగాలనాటి శ్లోకంలో ఇంత అద్భుతమైన మతాతీత దృష్టి(Secular

view)ని అందించాడు హిందువు. **భూమి మీద నిజమైన Secular religion ఏదైనా ఉందంటే అది హిందూమతం మాత్రమే అని సవినయంగా, సగర్వంగా, సానందంగా చెప్పుకోవచ్చు.**

"రుచీనాం వైచిత్ర్యాత్ – ఒకొక్కరి బుద్ధికి ఒకొక్క ప్రీతి ఉంటుంది. ఆ ప్రీతికి తగ్గట్టుగా ఒకొక్కరు ఒకొక్క విధంగా – ఓ పరమేశ్వరా! నిన్నే ఆరాధిస్తున్నారు. ఒకరు కర్మమార్గంలో, ఒకరు ఉపాసనామార్గంలో, ఇంకొకరు జ్ఞానమార్గంలో... ఒకరు విష్ణువు అని, ఒకరు శివుడు అని, ఒకరు శక్తి అని, గణపతి అని ఒకరు, కుమారస్వామి అని ఒకరు – ఎవరు ఏ పేరుతో ఆరాధించినా నిన్నే ఆరాధిస్తున్నారు స్వామీ! అంతా కలిపి అన్నమయ్య – హరి అవతారములే అఖిల దేవతలు" అని ఒకే మాటలో తేల్చి చెప్పేశాడు.

హరి అవతారములే అఖిల దేవతలు అయినప్పుడు ఏ దేవతకి నమస్కరించినా హరికే నమస్కరించినట్టు. హిందూధర్మం వైశాల్యాన్ని చెప్పుకున్నాం. హిందూధర్మం ఎన్ని శాస్త్రాలను కలబోసుకుందో చెప్పుకున్నాం.

## భిన్నత్వంలో ఏకత్వం

జగత్తు, జీవుడు, ఈశ్వరుడు అనే మూడు అంశాల గురించి ఎన్ని రకాల సిద్ధాంతాలు ఉండాలో అన్నీ హిందూధర్మం చెప్పేసింది. ద్వైతమూ, విశిష్టాద్వైతమూ, అద్వైతమూ హిందూమతంలో ఉన్నాయి. ఇంకేం కావాలి? ఎన్ని చెప్పాలో అన్ని చెప్పారు. వీటన్నిటికీ ఏం భేదం లేదు. ఒకొక్కరు ఒకొక్క స్థానంలోంచి చూసి మాట్లాడారు.

ఒకడు పున్నమి రాత్రి వేళ తోటలో కూర్చుని ఉన్నాడు. కొమ్మ మీద నుంచి చూస్తే ఆకాశంలో చంద్రుడు కనబడ్డాడు. చంద్రుడు ఎక్కడ ఉన్నాడు అంటే, 'మా చెట్టు కొమ్మ మీద' అన్నాడు. ఇంకొకాయన తన మేడ మీద కూర్చుని తన ఇంటి కిటికీ లోంచి చంద్రుని చూశాడు. చంద్రుడు ఎక్కడ ఉన్నాడంటే, 'మా కిటికీలో' అన్నాడు ఆయన. ఇంకొకాయన చంద్రుడు అంటే 'ఆకాశంలో' అన్నాడు. ముగ్గురి అభిప్రాయాలలో భేదాలు వచ్చాయి.

చెట్టుకొమ్మ మీద చంద్రుడు, కిటికీలో చంద్రుడు, ఆకాశంలో చంద్రుడు – ఇప్పుడు ఏది సత్యం? అక్కడి నుంచి చూస్తే చెట్టు మీద చంద్రుడూ సత్యమే, కిటికీలోంచి చూస్తే కిటికీలో చంద్రుడు సత్యమే, ఆకాశంలో చంద్రుడు అసలు సత్యం. ఎవరి స్థానంలోంచి వారు చూసి దర్శించారు కనుక తప్పేముంది? 'ఎక్కడి నుంచి ప్రారంభించావో అక్కడి నుంచే వెళుతూ ఉంటే ఎప్పటికైనా అసలు సత్యాన్ని అందుకోగలవు' – అని చెప్తూ భిన్న భిన్న సిద్ధాంతాలు చెప్పింది హిందూమతం.

హిందూమతంలో అనేకమంది దేవతలని పూజించాలంటే పూజించవచ్చు లేదా ఒకే దేవుని పూజించాలన్నా పూజించవచ్చు. ఏదో ఒక్కరే ఉన్నారనుకోండి, ఎక్కువ మందిని పూజించాలంటే కష్టం. అవకాశం ఉండదు. లేదూ, ఒక్కనినే పూజిస్తాను అనుకుంటే, ఇన్ని ఉన్నప్పుడు ఏదో ఒక్కటి ఎంచుకుంటే అయిపోయింది... సమస్య ఏముంది?

ఒకాయన కూరలు కొనుక్కోవడానికి బజారుకి వెళ్ళి వెనక్కి వచ్చేశాడు. ఎందుకంటే 'ఒక కూర కొనుక్కుందామని వెళ్ళాను, అబ్బో! బోలెడు కూరలు కనబడ్డాయి. అయోమయపడి వచ్చేశాను' అన్నాడు. వెంటనే వాళ్ళ అమ్మ మందలించింది, 'పిచ్చినాయనా! ఏదో ఒక్క కూరే ఉంటే బాధ పడి రావాలి కానీ కూరలు ఉన్నప్పుడు నచ్చింది ఒకటి తెచ్చుకో, లేదా నచ్చినవి రెండు మూడు తెచ్చుకో' అన్నది. అలా ఎన్నో కూరలు ఉన్న బజారు లాగ ఎన్నో పద్ధతులు ఉన్న, ఎన్నో అవకాశాలు ఇచ్చిన హిందూధర్మానికి నమస్కారం చేసుకుందాం.

మనకు ఏ పద్ధతి కావాలంటే ఆ పద్ధతి హిందూమతంలో ఉంది. నేను భగవంతుని ఆకారం లేకుండా ధ్యానిస్తాను అంటే ధ్యానించుకో. భగవంతుని కీర్తన చేస్తే ఆనందం అనుకుంటే చేసుకోవచ్చు. భగవంతుని పూజ చేస్తే ఆనందంగా చేసుకోవచ్చు. నాకు అలా కూర్చుని మౌనంగా ధ్యానం చేస్తే ఆనందం అంటే అదీ చేసుకోవచ్చు. ధ్యానమూ, పూజ, యోగమూ, సంకీర్తన... మనమే చెప్పాం.

ఇంకొక అద్భుతమైన విషయం – ప్రతి మార్గంలో ఆ మార్గంలో వెళితే గొప్ప వాళ్ళవుతారు, గొప్ప ఫలితం పొందుతారు అని ఋజువు చేసిన మేధావులు, మహాత్ములు ఉన్నారు.

సంకీర్తనతో భగవంతుని పొందవచ్చు అని ఋజువు చేసిన మహాత్ములు ఎందరో ఉన్నారు. అన్నమయ్య, పురందరదాసు, త్యాగరాజస్వామివారు, ముత్తుస్వామి దీక్షితులవారు... ఇలా ఎందరెందరో సాక్ష్యం. తెలుగువారే కాదు. తుకారాం, మీరాబాయి... ఇలా ఆసేతు శీతాచలం సంకీర్తనమార్గంతో తరించవచ్చు అని చెప్పడానికి ఎందరో ఉన్నారు. ధ్యానంతో తరించిపోవచ్చు అని చెప్పిన లహరీ మహాశయులు వంటి యోగులు కూడా ఎంతోమంది ఉన్నారు. జ్ఞానంలో రమణమహర్షి మొదలైనవారు చాలా మంది కనబడతారు.

పూజలతో తరించిన మహాత్ములను ఎందరినో చూపించవచ్చు. త్యాగరాజస్వామే పూజతో తరించవచ్చని “తులసీ దళములతో సంతోషముగా పూజింతు” అని చెప్తే, అన్నమయ్య “షోడశ కళానిధికి షోడశోపచారములు” అన్నాడు. ఏ మార్గంలో వెళ్ళినా ఆ మార్గంలో ఏందరో మహానుభావులు కనబడతారు.

## హిందూమతానికి ఆధారాలు–గ్రంథాలు, ఆలయాలు, మహాత్ములు

మూడింటి మీద ఆధారపడి వచ్చింది హిందూధర్మం. హిందూధర్మంలో ఎప్పటికప్పుడు మహాత్ములు కనబడతారు. ఇతరులు మన మీద దాడి చేసి ప్రాణభంగ, మానభంగ, ధ్వంసకాండలు నిర్వహిస్తున్నప్పుడు కూడా మహాత్ములు వచ్చారు.

పరాయివాళ్ళు ఆక్రమించుకుని ఉనికికి ప్రమాదం కలిగించినప్పుడు ఒక చైతన్య మహాప్రభువు ప్రభంజనంలా వచ్చాడు. ఆయన భక్తిని అనుసరించి ఎందరో లక్షల కొలది, కోట్ల కొలది తరతరాలు ఆయనను అనుసరించి మళ్ళీ ధర్మంలో నిలబడ్డారు. అలాగే తులసీదాసు. ఇలా మహాత్ములందరూ కూడా ఇతరులు మనలను పాలిస్తున్న రోజుల్లోనే ఈ దేశంలో పుట్టారు.

హిందూధర్మం గొప్పతనం గ్రంథాలలో మాత్రమే మిగిలి ఉంటే ఈ ధర్మం ఇలా ఉండేది కాదు. ఎప్పటికప్పుడు ఆ గ్రంథాలలో ఉన్నది సత్యమని తాము అనుభవించి ఋజువు చేసిన మహాత్ములు మనకు దిక్సూచిగా కనబడుతూనే ఉంటారు. అది హిందూమతంలో ఉన్న గొప్పతనం. ఎంతోమంది మహాత్ములు కనబడతారు.

రమణమహర్షి, ఆదిశంకరభగవత్పాదులు, భగవద్రామానుజాచార్యులు, మధ్వాచార్యులు... వారి పరంపర, వారి శిష్యులు, వారిలో వచ్చిన మహాత్ములు, విద్యారణ్యులవారు... ఇలా భారతదేశంలో ఎప్పటికప్పుడు సనాతనధర్మం సత్యాన్ని ఋజువు చేసిన మహాత్ములు కనబడుతూనే ఉంటారు. అదీ ఈ దేశం గొప్పతనం. ఇందులో పుట్టాక కూడా దీని విలువ తెలుసుకోకపోతే ఎలా?

ఈ దేశంలో పుట్టిన సర్వశాస్త్రాల జ్ఞానం పేరు 'హిందూమతం'. ఇది మహర్షులు ఇచ్చిన గ్రంథాలతో పాటు ఆలయాలపై, క్షేత్రాలపై, మహాత్ముల జీవితాలపై ఆధారపడి మనకు లభించినది.

## కొద్దికాలం క్రితం జరిగిన యథార్థ సంఘటన

సరిగ్గా స్వాతంత్ర్యం వచ్చిన కొంత కాలానికి భారతదేశంలో ఉత్తరాదిలో ఒక ఇంగ్లీషు సన్న్యాసి ఉండేవారు. ఆయన బ్రిటన్ దేశంలో పుట్టినవాడు. ఆయన సన్న్యాస వస్త్రంలో కూర్చుని ఎప్పుడూ రామజపం చేసుకునేవారు.

ఆయన వద్దకు ఎవరు వెళ్ళినా oh my dear child... please say Sitaram;- సీతారాం అనమని చెప్పేవారు. ఆయన దగ్గరికి వెళ్ళి కుతూహలంతో ఒకాయన ప్రశ్న వేశాడు - "మీరు చూస్తే పాశ్చాత్యులు... ఆ దేశం నుండి ఈ దేశానికి ఎలా వచ్చారు? ఇలా సీతారాం అంటున్న భక్తునిలా ఎలా మారారు? మీ అనుభవాన్ని చెప్పండి" అంటే ఆయన చెప్పిన అనుభవం ఆశ్చర్యాన్ని కలిగించింది.

హిందూధర్మం ప్రభావం ఎలా ఉంటుందో చెప్పడం కోసం ఈ అంశాన్ని తీసుకుంటున్నాం. ఈ ధర్మంతో పరిచయం లేనివారిపై కూడా ప్రభావం ఎలా ఉందో తెలుసుకోవాలి. తెలిసి ముట్టుకున్నా, తెలియక ముట్టుకున్నా నిప్పు

కాల్చుతుంది అని పెద్దవారు అంటారు. తెలిసి కాకున్నా, తెలియక కాకున్నా హిందువుగా బ్రతికితే అది మన బ్రతుకుని బాగు చేస్తుంది.

ఆ సీతారాం అనబడే విదేశీయుడు చెప్తున్న గొప్ప విషయం – "నేను ఇంగ్లండు నుంచి భారతదేశానికి వచ్చిన ఇంజనీరుని. వారి పాలనకాలంలో నేను ఇక్కడకు వచ్చాను. ఒక పెద్ద నదిపై డ్యాం నిర్మించే ప్రాజెక్ట్ నా భుజస్కంధాలపై పడింది. అనేక మంది కూలీలతో డ్యాం నిర్మాణం దాదాపుగా పూర్తి అవుతున్న కీలకదశలో భయంకరమైన వర్షాలు పడడం మొదలు పెట్టాయి.

ఆ వర్షాలకు ఆ డ్యాం ఏమవుతుందో తెలియని పరిస్థితి ఏర్పడింది. భయం పట్టుకుంది. ఏమి చెయ్యాలో తోచలేదు. ఒక వైపు వారి ప్రయత్నాలు వారు చేస్తున్నారు. కానీ నిలబడుతుందన్న ధైర్యం లేదు. ఆ సమయంలో ఏమీ తోచక అక్కడ తిరుగుతూ ఉంటే అక్కడ పల్లెలలో ప్రజలు కొలుచుకుంటున్న ఒక చిన్న మందిరం నా కంట పడింది". ముందే చెప్పుకున్నాం, అతనికి ఈ సంస్కృతి గురించి ఏమీ తెలియదు. ఆయన వెళ్ళి వారి దగ్గర నిలబడ్డాడు.

"ఏమిటి మీరు చేస్తున్నది" అని అడిగితే, "ఇక్కడి అమ్మవారికి మేము దండం పెట్టుకుంటున్నాం" అన్నారు. "దండం పెట్టుకుంటే ఏమి వస్తుంది?" అని అడిగాడాయన. "ఎలాంటి కష్టంలో ఉన్నా, త్రికరణశుద్ధిగా నమ్మితే తప్పకుండా అనుగ్రహం లభిస్తుంది, కష్టం నుంచి బయట పడతాం" అని చెప్పారు. "ఈ అమ్మవారి పేరు ఏమిటి?" అని అడిగాడు. "సీతమ్మ" అన్నారు వారు. ఆ ప్రాంతం వారు సీతమ్మని కొలుచుకుంటూ ఉంటారు. ఇతను ఉన్న కష్టానికి ఏమి చెయ్యాలో తెలియక వారి దగ్గర దండం పెట్టడం ఎలాగో నేర్చుకున్నాడు.

నమస్కరించడమనే సంస్కారం భారతీయులకు మాత్రమే ఉంది. నమస్కారం అనేది ఎంతో గొప్పది. మనస్సే నమస్సు. మనస్సును సమర్పించడమే నమస్సు. నమ్రభావమే నమస్కారం. ఒక గొప్ప విషయం ముందు తల వంచితే అదే నమస్కారం. అమ్మవారికి శరణాగతుడవడం – అదే నమస్కారం. వెంటనే 'అమ్మా! సీతమ్మా! ఈ డ్యాం ఏం ప్రమాదం లేకుండా ఉంటే నేను నా

ఉద్యోగాన్ని కూడా విడిచి పెట్టి నా జీవితమంతా నీ సేవకు అంకితం చేసుకుంటాను. ఒక వేళ డ్యాం నిలవలేదనుకో, ఇందులో పడి ఆత్మహత్య చేసుకుంటాను' – ఈ రెండూ అనుకున్నడాయన. ఆ పెట్టిన నమస్కారం చాలా త్రికరణశుద్ధిగా పెట్టాడు.

అప్పటికి సీతమ్మ అనే పేరే విన్నాడు తప్ప చరిత్ర తెలియదు. రాముడు, లక్ష్మణుడు, రామాయణం ఏదీ తెలియదతనికి. అక్కడ మాత్రం నమస్కారం చేశాడు అంతే. ఆ రాత్రి అతడు నిద్రపోదామని ఉపక్రమించాడు కానీ అసలు అవకాశం లేదు... కుంభవృష్టి కురుస్తోంది. ఆయన చిన్న గొడుగు, రెయిన్ కోటు వేసుకుని ఆ డ్యాం ఇంక పోతుంది – నేనూ ఆత్మహత్య చేసుకోక తప్పదు – 'నేను ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించలేకపోతున్నాను. ప్రకృతి ముందు ఓడిపోయాను. కాబట్టి ఆత్మహత్య చేసుకుంటున్నాను' అని కాగితం వ్రాసి పెట్టి ఆ డ్యాం దగ్గరికి వెళ్ళాడు.

ఆశ్చర్యకరంగా ఆ రాత్రివేళ ఒక ఇద్దరు వ్యక్తులు ఆ డ్యాంకి పడుతున్న రంధ్రాన్ని కప్పి పెడుతున్నారు. ఆ ఇద్దరిని చూసి ఆశ్చర్యపోయాడు. ఆ వస్తున్న ప్రవాహం కూడా ఆగిపోయింది. చాలా చక్కగా నిర్మాణం పూర్తి అయింది. వాళ్ళని చూసి ఆనందపరవశుడై ఆయన మూర్ఛపోయాడు.

మరుసటి రోజు ప్రొద్దున్న అక్కడ ఉన్న కూలీలు నీళ్ళు చల్లితే తేరుకున్నాడాయన. "ఏమిటి ఇలా మూర్ఛపోయారు? ఇప్పుడంతా చక్కగా ఉంది, డ్యాం నిర్మాణానికి కూడా ఏ ఇబ్బందీ లేదు. ఏదో అద్భుతం జరిగింది. ఏమి జరిగింది?" అని ఆయనను అడిగారు. ఆయన చెప్పింది వింటే ఆశ్చర్యపోతాం.

"నేను భయపడుతూ ఇంక ఆత్మహత్య చేసుకుందాం, నా వల్ల కాదు అనుకుని ఒకసారి డ్యాం పరిస్థితి చూద్దామని బయలుదేరినప్పుడు నాకు అక్కడ ఇద్దరు యువకులు కనబడ్డారు. ఒక యువకుడు నీలకాంతితో, ఇంకొక యువకుడు బంగారుకాంతితో ఉన్నాడు. ఇద్దరి భుజాలకు ధనుస్సులు ఉన్నాయి. వెనకాల అమ్ములపొదులు ఉన్నాయి. వాళ్ళెవరో నాకు తెలియదు. వాళ్ళిద్దరూ కలిసి ఆ

రంధ్రాలని పూడ్చుతూ కాపాడారు. అది తెలుసుకున్నాను” అన్నాడు.

దీనిని బట్టి ఆలోచించండి. నమ్మకం ఉన్నా, లేకపోయినా వాడికి తెలియని రామలక్ష్మణులను చూడగలిగాడంటే రాముడు ఒక నమ్మకం కాదు... రాముడు ఒక సత్యం. తాను ఎవరిని ఆదుకోదలచుకున్నాడో వారిని ఆదుకోవడానికి తనను తాను ప్రత్యక్షం చేసుకోగలడు.

భారతీయసంస్కృతి ఒక గొప్ప మాట చెప్తోంది– భగవంతునికి రూపం లేదు, కాని రూపం ధరించలేడు అనకూడదు. రూపం ధరించలేడు అంటే అసమర్థుడు అవుతాడు. సర్వశక్తిమంతుడైన భగవంతునికి రూపం లేదు కానీ, భక్తుని అనుగ్రహించడం కోసం ఏ రూపమైనా ధరించగలడు. ఇది ఈ సంస్కృతి చెప్తున్న గొప్ప విషయం.

## మన మతం గురించి ఎందుకు తెలుసుకోవాలి?

చాలామంది స్తోత్రాలను ఏవో పుణ్యాలు వచ్చేస్తాయని చదువుతారు కానీ, సరిగ్గా చదవరు. ఇప్పుడు అది కూడా చదవడం లేదు. ఎంతమంది హిందువుల ఇళ్ళల్లో భగవద్గీత ఉందో చెప్పండి? మీ ఇంటికి ఎవరైనా వస్తే భగవద్గీత ఇస్తారా? మీ పిల్లలకి భగవద్గీతలో ఎన్ని శ్లోకాలు వచ్చు? మిగిలినవారు అసలు విజ్ఞానమే లేనివారి గ్రంథాలను పట్టుకుని వేసవి కాలపు తరగతులు, వారాంతపు తరగతులు అని చెప్పి పాఠాలు చెప్తూ ఉంటే చెప్పుకోవలసిన మహాజ్ఞానం కలిగిన గ్రంథాలు పెట్టుకుని కూడా అధ్యయనం చెయ్యడం లేదు, పిల్లలకు అందివ్వడం లేదు.

పిల్లలకు ధర్మం గురించి ఏం చెప్పకుండా పెంచి, వారు పెద్ద అయిన తరువాత ‘అసలు ఈ ధర్మంలో ఏం ఉంది’ అని పరాయి ధర్మాలలోకి వెళిపోతూ ఉంటే సమాధానం చెప్పలేని స్థితిలో ప్రతి హిందూ తల్లిదండ్రులు ఉన్నారు. ముందు మన ధర్మం గురించి మనకే అవగాహన కలగడం లేదు. వారికి ఏం నేర్పుతాం? మొదటి నుంచి మనం నేర్పగలిగితే వారు వదిలిపెట్టలేరు.

బొట్టు ఎందుకు పెట్టుకోవాలి? జడ ఎందుకు వేసుకోవాలి? అనేవి వినాలంటే

scientific reasons చెప్పాలట. లేకపోతే వేసుకోరట. ఎంత బాధ! ఒకావిడ ఒక సభలో అడిగింది, "ఇప్పుడు అంతా లాజిక్ తరం వస్తోంది, ఆర్గ్యుమెంట్ చేస్తారు. వాళ్ళకి సైంటిఫిక్ రీజన్స్ కావాలి. రీజనింగ్ చెప్పాలి కాని, మేము చెప్పలేకపోతున్నాం. మా పిల్లలని మార్చలేకపోతున్నాం" అంది.

అందరికీ అన్నీ తెలుస్తాయా? అన్నీ అందరికీ తెలియవు. నేను ఇవాళ ఇక్కడ లైట్ వెయ్యాలంటే ఏ స్విచ్ వేస్తే ఏ బల్బ్ వెలుగుతుందో తెలిస్తే చాలు. నాకు విద్యుచ్ఛక్తి విజ్ఞానం అక్కర్లేదు. మొత్తం ఆ విజ్ఞానం అంతా నేర్చుకున్నాక స్విచ్ వేస్తానంటే బ్రతుకంతా చీకట్లోనే ఉంటారు. అన్నీ అందరికీ తెలియవు. ఆచరించవలసిందే. మా పిల్లలకి రీజనింగ్ అండీ, దీపం వెలిగించమంటే "వై?" అని అడుగుతాడు.

"పుట్టిన రోజప్పుడు మీ పిల్లవాడు కేక్ కట్ చేస్తాడా?" అని అడిగితే "ఆ కట్ చేస్తాడు" అందావిడ.

"కొవ్వొత్తులు ఊదుతాడా?" – "ఊదుతాడు".

"కేక్ ఎందుకు కట్ చేయాలి? కొవ్వొత్తి ఎందుకు ఊదాలి? అని అడిగాడా?" నిజంగా రీజనింగ్ ఉంటే అది కూడా అడగాలిగా! ఎందుకు వెలిగించాలని అడిగినవాడు, ఎందుకు ఊదాలని అడగాలి. అది ఎందుకు అడగలేదు? చెప్పండి? అక్కడ ఏమైనా రీజన్ ఉందా? ఏం లేదు. పరాయిదానిపై మోజు ఉంది. మన దానిపై గౌరవం లేదు. అంతకు తప్ప మరొకటి కాదు.

మనలను మనం అనుసరిస్తూ ఉంటే నిలబడుతుంది. ఒకటి అలవాటయ్యాక అలవాటు నుంచి పక్కకి రావడానికి మనస్కరించదు. కనుక చిన్నప్పటి నుంచి హిందూధర్మాన్ని హిందువులైనవారు వారి పిల్లలకు అలవాటు చెయ్యగలిగితే వారు హిందూధర్మం నుంచి బయటకు వెళ్ళలేరు. ఈ రోజులలో అది చేయించలేకపోతున్నారు. చిన్న చిన్న మాటలలోనే హిందూధర్మాన్ని చక్కగా చెప్పవచ్చు.

మనకు ఉన్న అనంత వాఙ్మయంలో ఒక్క పుస్తకం దగ్గర పెట్టుకున్నా అందులోంచి

ఎంతో జ్ఞానాన్ని పొందవచ్చు. భగవంతుని గురించి ఒక చిన్నమాటలో చెప్తూ **'బ్రహ్మజ్యోతి స్వరూపం చ భక్తానుగ్రహ విగ్రహం'** అన్నారు. భగవంతుడు ఒక బ్రహ్మజ్యోతి. జ్యోతి అంటే దీపము అని కాదు అర్థం. జ్యోతి అంటే కాంతి, చైతన్యం, ప్రకాశం. భారతీయసంస్కృతిలో, "భగవంతుడు ఎక్కడ ఉండును?" అంటే, "పరలోకమునందు ఉన్న భగవంతుడు ప్రపంచమును సృష్టించెను, ఆరు రోజుల తరువాత నిద్ర పోయెను" అని ఉండదు. భగవంతుడు ప్రపంచాన్ని సృష్టించడం మాత్రమే కాదు, ప్రపంచమంతా వ్యాపించి ఉన్నాడు. అదీ భారతీయసంస్కృతిలో ఉన్న గొప్పతనం.

ఆ వ్యాపించిన మహా చైతన్యం ఎంత ఉంది? ఈ ప్రపంచం అంతా... అనంతంగా ఉంది. అనంతం అన్నదానికే బ్రహ్మ అని అర్థం – బ్రహ్మ అంటే 'The Biggest'. పదానికి అర్థం తెలుసుకుంటే సైన్స్ తెలుస్తుంది. **నామ రూపాలతో ఆగిపోతే మతం... వాటి అర్థం తెలుసుకుంటే అధ్యాత్మికం. అది విశ్వజనీనం.**

## విగ్రహారాధన రహస్యం

విష్ణువు అంటే హిందువుల దేవుడు. కానీ విష్ణువుకి అర్థం – 'సర్వవ్యాపకుడు'. అర్థం తెలిస్తే ఫిలాసఫీ, అర్థం తెలియకపోతే రెలిజియన్. హిందూమతానికి అర్థమే ఫిలాసఫీ. ఇలా బ్రహ్మజ్యోతిగా విశ్వమంతా వ్యాపించిపోయిన ఒక మహాచైతన్యం భగవంతుడు. **భక్త అనుగ్రహ విగ్రహం** – భక్తులను అనుగ్రహించడానికి విగ్రహం ధరించాడు. చాలా స్పష్టమైన నిర్వచనాలు ఇవి.

**'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా'** – ఒకటే మాట. ఉపాసించే వాని కోసం ఒకే భగవంతుడు అనేక రూపాలు ధరించాడు. నూతిలో నీళ్ళు చేదతో తోడుతూ ఉన్నప్పుడు, ఆ చేద ఏ ఆకారంలో ఉందో నీరు ఆ ఆకారంలో వస్తుంది. చేద నలుచదరంగా ఉంటే నీరు కూడా నలుచదరంగా వస్తుంది, గుండ్రంగా ఉంటే నీరు కూడా గుండ్రంగా ఉంటుంది. ఇప్పుడు గుండ్రటి నీరు, నలుచదరపు నీరు అని ఎక్కడైనా ఉందా? లేదు. చేద ఆకారం దానికి అంటగట్టాం.

భాగవతంలో శుకమహర్షి అద్భుతమైన ఉపమానం చెప్తూ- 'ఒకే విష్ణువు అనేక రూపాలు ధరించి ప్రపంచాన్ని నడుపుతున్నాడు. ఎందుకంటే ప్రపంచం నడపడం కోసం. ఒక సరస్సు నుంచి పొలాలకు కాలువలు తవ్వారు. ఎందుకు ఇన్ని కాలువలు? మనం తిండి తినడం కోసం... అన్ని పొలాలు పండించడం కోసం. ఇప్పుడు ఇన్ని కాలువలు సరస్సుకు అవసరమా? పొలాలకు అవసరమా? అంటే – పొలాలకే అవసరం.

పొలాలకు అవసరమైనప్పుడు సరస్సు ఇన్ని కాలువలుగా వచ్చింది. ఒకటి పొడవు కాలువ, మరొకటి పొట్టి కాలువ, ఒక కాలువ వంకర. అందులో నీళ్ళు ప్రవహిస్తున్నాయి. కానీ ఈ పొడవు, వంకర, పెద్ద, చిన్న అనేవి కాలువ పరిమాణం బట్టి నీటికి ఏర్పడింది. కాలువరూపంలో చూస్తున్నప్పుడు నీటిని అలా అనుకున్నా తప్పేమీ లేదు. కానీ ఆ సరస్సులో నీరే ఇన్ని కాలువలలో ఇన్ని రూపాలతో కనబడుతోంది అనే ఎరుక ఎలా ఉండాలో, ఒకే పరమాత్మ ఇన్ని దేవతలుగా మనలను అనుగ్రహిస్తున్నాడు అనే జ్ఞానం అలా ఉండాలి.

మనలో మనకు దురభిప్రాయాలు ఏర్పడి – 'విగ్రహారాధన చాలా ప్రాథమికదశలో చేస్తారు. అల్పబుద్ధులు విగ్రహంలో ఆరాధిస్తారు. జ్ఞానులు సర్వత్రా భగవంతుని చూస్తారు. కనుక విగ్రహారాధన అల్పమైనది' అనే అభిప్రాయంలో చాలామంది ఉన్నారు. అది ఖండించవలసిన ఒక అంశం.

ఒక దేవాలయం, ఒక విగ్రహం, దాని వెనక ఉన్న విజ్ఞానం తెలుసుకోగలిగితే విగ్రహారాధన తక్కువదేమీ కాదు అని తెలుస్తుంది. విగ్రహారాధనలో భగవంతుని విగ్రహంలో చూస్తాం. క్రమంగా మన జ్ఞానం విస్తరించి ప్రపంచమంతా భగవంతుని చూస్తాం. ఆ భగవంతుడే విగ్రహంలో ఉన్నాడని తెలుసుకుంటాం. అంతేకాని విగ్రహారాధన విడిచిపెట్టము.

విగ్రహారాధన విషయం కూడా తెలియాలి. స్వామి వివేకానంద 'విగ్రహమే దేవుడు కాదు. విగ్రహంలో దేవుడు' అన్నారు. మీ దేవుడు ఎవరంటే 'విగ్రహంలో ఉన్నాడు' అని హిందువులు ఎవరూ చెప్పరు. హిందువులలో పసివాడు కూడా,

“పరమాత్మ ప్రపంచమంతా నిండి ఉన్నాడ”ని చెప్తాడు. దానిని విగ్రహంలో ఆరాధిస్తున్నాము. తప్పేముంది?

ఉదాహరణకు – ఒకడు తాగడానికి ఒక కడవలో గంగానది నీళ్ళు తెచ్చాడు. మరొకడు, “ఏమిటా కడవలో” అంటే, “గంగాజలం” అన్నాడు. “ఓహో! గంగ అంటే ఇంతేనా?” అన్నాడు. అడిగినవాడు ఎప్పుడూ గంగ చూడలేదు. “గంగ ఇంతే కాదురా” అని చెప్తే, “మరి నువ్వే గంగాజలం అన్నావు?” అన్నాడు. “ఎంతో ఉన్న గంగాజలంలో నేను ఇంత తెచ్చుకోగలిగాను కనుక ఇంత తెచ్చాను” అన్నాడు.

అదేవిధంగా **ఉపాసకానాం కార్యార్థం** – ఉపాసించేవాని భావానికి అనుగుణంగా ఆ భగవంతుడు ఎన్నో రూపాలు ధరిస్తాడు. అయితే ఈ భావాలు, ఊహలు కల్పించుకున్నవి కావు. ఒకే భగవంతుడు ఋషులకు అనేక రూపాలుగా దర్శనమిచ్చాడు. **ఏకం సత్ విప్రా బహుధా వదంతి** – ఇది హిందూధర్మంలో ప్రాథమిక వాక్యం. ఒకే సత్యవస్తువు ఉంది. దానిని విప్రులు అనేక రకాలుగా అంటారు. విప్రులు అంటే విశేషప్రజ్ఞ కలవారు.

‘ఇందరు దేవుళ్ళు ఎందుకు?’ అనే దానికి చాలా మంది చాలా రకాలుగా చెప్పారు. ఇంత మంది దేవుళ్ళు ఎందుకు అని ప్రశ్నిస్తే మన వాళ్ళు ఏమంటారంటే ‘ఎవరి ఇష్టం కోసం వారికి భగవంతుడు ఇన్ని రూపాలలో వచ్చాడ’ని అంటారు.

ఇక్కడ గుర్తు పెట్టుకోవలసింది ఇంత మంది దేవుళ్ళు హిందూమతంలో ఉన్నారు అని చాలా మంది అంటూ ఉంటారు. కాని ఇంత మంది దేవుళ్ళు హిందూమతంలో మాత్రమే లేరు. ఇంత మంది దేవుళ్ళు ఈ విశ్వంలో ఉన్నారు. వాళ్ళని హిందువులు తెలుసుకున్నారు.

ఈ విషయాన్ని డా. డేవిడ్ ఫ్రాలే అనే పాశ్చాత్యుడు – “మంచు మనందరికీ ఒకే లాగ కనబడుతుంది– తెల్లగా, చల్లగా. అంతే. కానీ ధృవప్రాంతాలలో ఉండే ఎస్కిమోలు నిరంతరం మంచుతోనే బ్రతుకుతారు. వారు మంచు అంతా ఒకటే అంటే ఒప్పుకోరు. మంచులో నలభై ఎనిమిది రకాలు ఉన్నాయని చెప్తారు.

కానీ సామాన్యులకు మంచు అంతా ఒకటే. మంచుతో ఉన్న సాన్నిహిత్యం(intimacy) వల్ల ఎస్కిమోలు మంచులో ఉన్న రకరకాల భేదాలు చెప్పగలిగారు. ఎవరికైతే సాన్నిహిత్యం ఎక్కువ ఉంటుందో వారికి దానిలో ఉన్న అనేక కోణాలు తెలుస్తాయి. భగవంతునితో సాన్నిహిత్యం వల్ల ఋషులు భగవంతుని అనేక రూపాలను ఆవిష్కరించగలిగారు" అని చెప్పారు.

'ఇంత మంది ఎందుకు?' అని అడగడానికి నేనెవరిని? మీరెవరు? ఆకాశంలో ఇన్ని నక్షత్రాలు ఎందుకు? తిరుపతిలో ఇంత జనం ఎందుకు? ఈ అడవిలో ఇన్ని చెట్లు ఎందుకు? మీ ఇంట్లో ఇందరు పిల్లలు ఎందుకు అని అడుగుతారా ఎవరైనా?

నాకు ఈ చేతికి అయిదు వేళ్ళు ఎందుకు? ఒక్కటి ఉంటే సరిపోదా? ఎందుకు ఏమిటి? అవి ఉన్నాయి అంతే. ఎందుకు ఉన్నాయో అనవసరం. ఉంటాయి ప్రపంచంలో అంతే. ఇంట్లో కొళాయి నీళ్ళు కావాలంటే నీటిపారుదల కార్యాలయం, కరెంటు కావాలంటే విద్యుత్ కార్యాలయం, గ్యాస్ కావాలంటే అదొక వ్యవస్థ. ఇంటికి గాలి, నీరు, నిప్పు సరఫరా చెయ్యడానికే ఊరికి మూడు వ్యవస్థలు కావలసి వచ్చాయే! ప్రపంచాన్ని నడపడానికి ఎందరు కావలసి వస్తారో ఆలోచించండి.

నేనైతే ఆన్‌లైన్లో బిల్లు కట్టేస్తాను కనుక విద్యుత్ కార్యాలయం ఎక్కడ ఉందో నాకు తెలియదు. నీళ్ళు ఎలా వస్తాయి అంటే టాప్ తిప్పితే వస్తాయి అంటే తప్పు కాదా? నేను పంపు తిప్పితే నీరు రావడం నా కంటికి కనబడుతోంది. కానీ దీని వెనకాల కంటికి కనబడని ఒక పెద్ద వ్యవస్థ, కార్యకర్తలు ఉన్నారు. అదే విధంగా విద్యుత్ సరఫరాకు కూడా వేరే కార్యకర్తలు ఉన్నారు. కరెంటు బిల్లు కట్టే ప్రతివానికి ఊర్లో కరెంటు ఆఫీసు తెలుసా? ఆ కార్యకర్తల పేర్లు తెలుసా? తెలియక పోవచ్చు. కానీ వాళ్ళందరూ లేకపోతే నాకు ఈ విద్యుత్ రాదనే తెలివి ఉంటే చాలు.

ప్రపంచంలో నీరు, నిప్పు పుట్టించాలంటే ఒక పెద్ద కార్యాలయం, దానిలో

కార్యకర్తలు ఉన్నారు. ఆ కార్యకర్తల పేర్లే దేవతలు. ఇంద్రుడు, యముడు, వరుణుడు – వీళ్ళేగా దేవతలంటే. హిందువులకు బోలెడంతమంది దేవతలని కొందరు అంటారు. కొంచెం సమయము ఇస్తాను, మీరు ఎంతమంది దేవతల పేర్లు చెప్పగలరో చెప్పండి "ముప్పై మూడు కోట్ల దేవతలండి" అన్నారు. మీరు కనీసం వంద మంది దేవతల పేర్లైనా చెప్పగలరా? మన దేవతలంటే ఎవరు అనుకున్నారు? దేవతలు అనే దృక్పథం(concept) అర్థం చేసుకోవాలి. **దేవతలు అంటే విశ్వంలో పనిచేసే పరమేశ్వర శక్తులు** అని చెప్పుకున్నాం.

హిందూమతంలో ఒక చమత్కారమైన మాట ఉంది. ఈశ్వరుడు అని మీరు వినే ఉంటారు. ఈశ్వరులు అని పేరు ఎప్పుడైనా విన్నారా? దేవతలు అనేది బహువచనం, ఈశ్వరుడు అనేది ఏకవచనం. హిందూమతంలో దేవతలు ఎందరో... కానీ, ఈశ్వరుడు ఒక్కడే. గజేంద్రుడు కూడా తొండం ఎత్తి 'ఈశ్వరునే శరణంబు వేడెదన్' అన్నాడు. ఆ ఈశ్వరుని విష్ణువు అన్నాడు ఆయన. ఆ ఈశ్వరుని శివుడు అన్నాడు మరొకాయన. ఈశ్వరుని ఈశ్వరి– పరమేశ్వరి అన్నారు మరొకరు. కాని ఈశ్వరుడు ఒక్కడే.

మరి దేవతలు ఎవరు? హిందూమతంలో పరమాత్మ, పరమేశ్వరుడు, దేవతలు, జీవులు నలుగురు. ఈ దృక్పథంతో హిందూమతం గురించి ఆలోచించుకోవాలి.

## హిందూమతంలో 'పరమాత్మ' అంటే?

పరమాత్మ అని ఎవరిని అనాలి? పరమాత్మ అంటే అసలు ఈ సృష్టి, స్థితి, లయ ఏమీ చెయ్యక ముందు ఉన్న భగవంతుడు. ఆయన సృష్టి, స్థితి, లయలు చేసేటప్పుడు ఆయనను ఈశ్వరుడు అనాలి. ఎందుకంటే మనం సృష్టిలో ఉన్నాం, స్థితి చూస్తున్నాం కనుక ఆయన ఈశ్వరుడే. ఈశ్వరుడు అంటే – 'సర్వం చెయ్యగలిగే సమర్థత కలవాడు'.

లేకపోతే సృష్టి, స్థితి, లయ ఎవరు చెయ్యగలరు? సృష్టిలో పుట్టి, సృష్టి గురించి పరిశోధన చేస్తున్నారు కానీ సృష్టి మనం ఎవరం చెయ్యలేదు. సృష్టి చేసినవాడు ఎవడు? స్థితి చేసినవాడు ఎవడు? లయం చేసేవాడు ఎవడు? ఈ

సృష్టి, స్థితి, లయలు చేసేవాడు ఒకడు ఉన్నాడు. వాడే –

**ఎవ్వనిచే జనించు జగము ఎవ్వని లోపలనుండు లీనమై**
**ఎవ్వని యందు డిందు పరమేశ్వరుడెవ్వడు మూల కారణం**
**బెవ్వడనాది మధ్య లయుడెవ్వడు సర్వము తానె అయిన వా**
**డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్**

ఎంత సమన్వయం చూపించారు ఇక్కడ! ఈ మాట ఉపనిషన్మాత ఎప్పుడో చూపించింది.

**యతో వా ఇమాని భూతాని జాయంతే,**
**యేన జాతాని జీవంతి,**
**యత్ర ప్రత్యభిసంవిశంతి**

– ఎవరి నుంచి ఈ సృష్టి కలిగిందో, ఎవరి వల్ల పెరిగిందో, చివరికి ఎవరిలో లయమైందో వాడే 'ఈశ్వరుడు'.

కలిగింది అంటే **'సృష్టి చేయడం – బ్రహ్మ.** పెరిగింది అంటే **స్థితి – విష్ణువు. లయం చెయ్యడం – రుద్రుడు. ఈ ముగ్గురూ ఎవరో ఆ ఈశ్వరునికి నమస్కారం'.** ముగ్గురూ వేరు వేరు కాదు, ముగ్గురూ కలిపి ఒక్కరే అనే స్ఫూహ ఆ పద్యంలోనే పోతన గారు ఇచ్చారు. అంతకుముందే ఉపనిషత్ చెప్పింది. కాబట్టి ముగ్గురిలో ఒక్కరు కాదు, ముగ్గురూ కలిపి ఒక్కరే అని తెలుసుకోవాలి.

**త్వం బ్రహ్మే సృష్టికర్తా చ**
**త్వం విష్ణుః పరమేశ్వరః**
**త్వం రుద్రః సంహారకర్తా చ**

–స్థితికారకుడవైనప్పుడు విష్ణువు, సృష్టికారకునిగా నువ్వే బ్రహ్మావు, లయకారకుడవైనప్పుడు నువ్వే రుద్రునివి – అని ఒకే పరమేశ్వరుని స్తుతించడం ప్రతి వాఙ్మయంలో కనబడుతుంది. భారతీయులు బహుదేవతలను ఆరాధిస్తున్నారు. ఒకే ఈశ్వరుని ఉపాసిస్తున్నారు.

అలా అయిన ఒక ఈశ్వరుడు ఉన్నాడు. ఆ ఈశ్వరుడు అనేక దేవతలతో ఈ

పని చేస్తున్నాడు. ఆ దేవతలు ఎవరు మధ్యలో? ఇది పెద్ద ప్రశ్న కదా! పరమాత్మ అర్థం అయ్యాడు, పరమేశ్వరుడు అర్థం అయ్యాడు.

## మరి దేవతలు ఎవరు?

పరమాత్మకు ఏ పనీ లేదు. పరమాత్మ సృష్టి స్థితి లయలు అనే పని పెట్టుకుంటే ఈశ్వరుడు అయ్యాడు. చెప్పడానికి మూడు పనులే కానీ చెయ్యడానికి ఎన్నో! స్థితి చెయ్యాలంటే ఎన్నో ఉండాలి – పంచభూతాలు, వాటి నిర్వహణ... బోలెడు పనులు! ఇన్ని పనులు చేసేటప్పుడు ఆ ఒక్క ఈశ్వరుడే ఎందరో దేవతలయ్యాడు. ఎలా అయ్యాడంటే చిన్న ఉదాహరణ చెప్పారు.

వేదాలలో ఉన్నవే ఇక్కడ ప్రస్తావన చేస్తున్నాం. కానీ ప్రతి దానికీ మంత్రం చెప్పడం లేదు, అర్థం చెబుతున్నాం. వేదం ఎంత హేతుబద్ధంగా, వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా అందించిందో ఆలోచించాలి. ఈశ్వరుని తరువాత దేవతలు. దేవతలంటే వేదం ఏమి చెప్తోందంటే **'ఒక మనిషికి ఇంద్రియాలు ఎలాంటివో, పరమేశ్వరునికి దేవతలు అలాగ'**. ఎంత అద్భుతమైన మాట!

ఎవరికి వారు నేను ఉన్నాను, నేను చూశాను, నేను తిన్నాను, నేను విన్నాను, నేను నడిచాను అనుకుంటే – అన్నీ ఎవరు చేశారు? నేను. కానీ ఆలోచిస్తే... ఇవన్నీ ఒక్కదానితో చెయ్యలేదు. నేను విన్నాను– చెవితో. నేను తిన్నాను– నోటితో. నేను చూశాను– కంటితో. అప్పుడే మూడు పనులు. ఎవరు చేశారు, నేనే. అంటే ఈ మూడు నీవే కదా! ఎప్పుడైనా విచిత్రంగా నేను కంటితో వింటాను, చెవితో చూస్తానంటే అవుతుందా? లేదు. ఏ ఇంద్రియం పని దానిదే. ఏ ఇంద్రియం శక్తి దానికి ఉన్నది. ఏ ఇంద్రియం ఇందులో నాకు కావాలి? అంటే అన్నీ కావాలి.

ఇంద్రియాలు లేకపోతే మనం లేము. చూడాలనుకున్నప్పుడు కన్ను కావాలి. వినాలనుకున్నప్పుడు చెవి కావాలి. కన్ను గురించి వ్రాయాలంటే అత్యద్భుతంగా వ్రాయవచ్చు. అది చదివితే, అబ్బా! కన్ను ఒక్కటి ఉంటే చాలు అనిపిస్తుంది.

అలాగే ఏ అవయవ నిపుణునికి ఆ పని అప్పచెప్పితే ఆ అవయవం గురించి వ్రాయగలడు. అప్పటికి అది ప్రధానం అనిపించవచ్చు. కానీ అది ఒక్కటీ తప్ప మిగిలినవి పోతే? **'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం'**. కనుక కన్ను ఉంచి మిగిలినవి తీసేద్దామంటే ఒప్పుకుంటామా? నేను ఒక్కడినే కానీ నాకు అనేక ఇంద్రియాలు. ఆ 'నేనే' దర్శన శక్తి, శ్రవణ శక్తి, వాక్ శక్తి – ఇన్ని శక్తులుగా ఈ శరీరంలో ఎలా వ్యక్తమవుతున్నా దేని ఉనికి దానిదే. దేని ప్రత్యేకత దానిదే. దేని ప్రయోజనం దానిదే.

అలాగే ఒకే ఈశ్వరుడు రకరకాల శక్తులతో ప్రపంచాన్ని నడుపుతున్నాడు. ఈ విధంగా పరిశీలించాలి. ఇది హిందూమతానికి మాత్రమే ప్రత్యేకమైనది. ఇంకెక్కడా ఈ విశ్లేషణ కనబడదు. **పొరపాటున కూడా హిందూమతము, ఇతర మతాలు అన్నీ ఒకటే అని అనుకోకండి. ఎక్కువ, తక్కువలు చెప్పడం లేదు. అన్నీ ఒకటని మాత్రం అనుకోకూడదు. చామంతి చామంతే. మల్లెపువ్వు మల్లెపువ్వే. దేని ప్రత్యేకత దానిదే. దయచేసి హిందూమతంతో మరి ఏ ఇతర మతాలను పోల్చవద్దు.**

పరమాత్మ, పరమేశ్వరుడు, దేవతలు, జీవులు– ఈ నడుస్తున్న చక్రమంతా ఇదే. పరమేశ్వరుడు దేవతలతో నడుపుతున్నాడు. ఏ దేవతనైనా నమస్కరించినప్పుడు అది పరమేశ్వరునికి వెళుతుంది. ఒక సంగీత విద్వాంసుడు అద్భుతంగా గానం చేశాడు. భక్తితో సన్మానం చేయాలనుకున్నారు. భుజానికి శాలువా కప్పుతారు లేదా కాళ్ళకు దండం పెడతారు. అంతే కానీ, ఎంత బాగా పాడారండీ అని గొంతు పట్టుకోరు కదా! వారికి ఆనందంగా కరచాలనమే చేస్తారు కానీ, గొంతు చాలనం చేయరు. పాడింది గొంతైనా అభినందన కాలికి. పరిశీలిస్తే కాలికీ కాదు, గొంతుకకీ కాదు... పాడినవారికి.

అలాగే ఏ దేవతను మనం గౌరవించినా చేరేది ఒకడే అయిన ఈశ్వరునికి. **'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి'** – ఎవరికి నమస్కారం చేసినా విష్ణువుకే వెళ్తుందని అర్థం. ఎవరికి నమస్కారం చేసినా విష్ణువుకి వెళ్తుంది అంటే ఎవరిని

తిరస్కరించినా విష్ణువుకే వెళ్తుంది అని ఆ వాక్యంలోనే ఉంది. హిందూధర్మంలో గొప్పతనం – "నువ్వు నీ ఇష్టదైవాన్ని నీ పద్ధతిలో ఆరాధించుకుంటూ, ఇతరులను కూడా అదే విధంగా గౌరవించడం నేర్చుకోవాలి". ఇది చక్కటి సహజీవనం. అది ఉన్నది కనుకనే హిందూధర్మం బ్రతక గలిగింది.

## దేవతా విభాగం - దిక్పతులు

పురాణాలు చెప్పిన దేవతలు ఎక్కడ లేరో చెప్పండి. ఇంద్రుడు, ఏ మతం దేవుడు ఈయన? తూర్పు దిక్కుకి అధిపతి. యముడు – దక్షిణ దిక్కుకి అధిపతి. దిక్కులను ఎవరు పాలిస్తారో తెలిస్తే మనం దిక్కున్న మతం వాళ్ళం అవుతాం. లేకపోతే దిక్కు లేనివారం అవుతాం కదా! ఒకొక్క దిక్కుకు ఒకొక్క పాలకుడు ఉన్నారు. **"మీ హిందూమతంలో దిక్కులను కొలుచుకుంటారండీ"** అంటే, **"అవునండీ! మాది దిక్కున్న మతం"** అని చెప్పండి. దిక్కులేని మతాన్నే దిక్కుమాలిన మతం అని అనవచ్చు. లేని–మాలిన ఒకే అర్థాన్ని తెలియజేస్తాయి.

మనకు దిక్కులు ఉన్నాయి కదా! ఒకొక్క దిక్కుకి ఒకొక్క శక్తి ఉన్నది. ఇంద్రుడు, వరుణుడు, యముడు... ఇలా వీరు దిగ్దేవతలు. అంటే ప్రకృతిలో మనకు కనబడుతున్న ఒకానొక శక్తి. ప్రకృతి మన కంటే శక్తిమంతమైనది. అంటే మనల్ని తన అధీనంలో పెడుతోంది ప్రకృతి. ప్రకృతిలో కనబడే ప్రతి శక్తీ పరమేశ్వరునిదే.

## ప్రపంచాన్నే పరమేశ్వరునిగా దర్శించడం - విశ్వరూప భావన

హిందూమతంలో మాత్రమే ఉన్న ఒక ప్రత్యేకత– 'విశ్వరూపం'. విశ్వరూపం కృష్ణపరమాత్మ అర్జునునికి చూపించాడు. అలా విశ్వరూపాన్ని చూపించేటప్పుడు 'అర్జునా! నువ్వు ఇక్కడే ఉండు. నేను విశ్వరూపం వేసుకొస్తా'నని మేకప్ గదిలోకో, కాస్ట్యూమ్ గదిలోకో వెళ్ళలేదు. ఏం చేశాడక్కడ? స్వామి రూపు మార్చుకోలేదు, అర్జునుని చూపు/దృష్టిని మార్చాడు. "నేను విశ్వరూపుడను. కానీ నీకు అది

చూసే దృష్టి లేదు. నీ కళ్ళు ప్రపంచం చూడడం కోసం సృష్టించాను కనుక నీకు నేనూ అలాగే కనబడుతున్నాను. నా అసలు స్వరూపం నీకు తెలియాలంటే నీ దృష్టి మారుస్తున్నాను" అన్నాడు. అసలు దృష్టి ఇచ్చాడు... అదే యోగదృష్టి. **"దివ్యం దదామి తే చక్షుః" –** "ఇస్తున్నాను చూడు" అని విశ్వరూపం చూపించాడు.

విశ్వరూపం అనే భావన ప్రతి పురాణంలో కనబడుతుంది. ఉదాహరణకు 'దేవీభాగవతం'లో అమ్మవారి విశ్వరూపం, 'శివపురాణం' 'పద్మపురాణం'లలో శివుని విశ్వరూపం, 'గణేశపురాణం'లో గణపతి విశ్వరూపం, 'పద్మపురాణం'లో రామచంద్రమూర్తి విశ్వరూపం చూపిస్తారు. ఇన్ని రకాల విశ్వరూపాలు అంటే రామునిది ఒక విశ్వం, శివునిది ఒక విశ్వం, అమ్మ వారిది ఒక విశ్వం – ఇన్ని విశ్వాలు ఉన్నాయా? కొంచెం వివేచన చెయ్యాలి.

ఆలోచించే వారికి పనికి వచ్చే మతం పేరు 'హిందూమతం'. హిందూమతం – 'Full of knowledge;. హిందూమతం పూర్తిగా జ్ఞానమే. "గుడ్డిగా నమ్మి అనుసరించు" అని ఎప్పుడూ హిందూమతం చెప్పదు. "దృఢంగా ఆలోచించి అనుసరించు" అని చెప్తుంది. ప్రపంచం మొత్తం మీద ఆలోచనకు, తర్కానికి చోటిచ్చే మతం పేరు 'హిందూమతం'. తర్కం ఆలోచించి చెప్తుంది. ఇక్కడ చెప్పినదంతా ఒకసారి ఆలోచించాలి.

విశ్వరూపాలు ఇన్ని ఉన్నాయా? అమ్మవారిది ఒక విశ్వరూపం, శివునిది ఒక విశ్వరూపం, ఇదేమిటండీ? అసలు విశ్వాలు ఎన్ని ఉన్నాయి? విశ్వం ఎప్పుడూ ఒక్కటే. పురుష సూక్తం వర్ణించినా, విష్ణు సహస్రం వర్ణించినా –

**భూః పాదౌ యస్య నాభిర్వియదసురనిలశ్చంద్రసూర్యౌచ నేత్రే**
**కర్ణావాసా శ్శిరోద్యౌర్ముఖమపి దహనో యస్య వాస్తేయ మబ్ధిః**
**అంతస్థం యస్య విశ్వం సుర నర ఖగగో భోగిగంధర్వ దైత్యైః**
**చిత్రం రం రమ్యతే తం త్రిభువన వపుషం విష్ణుమీశం నమామి**

ఎంతో అందంగా చెప్పారు. భూమి పాదం, ఎక్కడో కనబడని దివి ఆయన శిరస్సు. నాభి అంతరిక్షం. ఆయన ఊపిరి వాయువు. ఒకసారి ఈ భావన చేసి

విష్ణు సహస్రం హృదయంతో చదివితే... బయటికి రాగానే సూర్యుడు కనబడగానే విష్ణువు మనలను చూస్తున్నాడు అనే అనుభూతి రావాలి. అలాగే గాలి ఆయన ఊపిరి అన్నాక, మనకు గాలి తగలకుండా ఉందా? గాలి తగులుతోంది. అంటే మనం విష్ణువుకు ఎంత దగ్గర ఉన్నామంటే ఆయన ఊపిరి తగులుతున్నంత దగ్గరగా ఉన్నామన్న అనుభూతి రాదూ! అలా అడుగడుగునా భగవంతుని అనుభవించడానికి అవకాశం ఇస్తోంది 'విశ్వరూపం' అనే భావన.

## విశ్వమే విశ్వేశ్వరుడు

'విశ్వాన్నంతటినీ పరమాత్మగా చూడు' - అన్నారు. దీనిని బట్టి శివునికో విశ్వం, శివునికో సూర్యుడు, శివునికో భూమి... ఇలా ఉన్నాయా? కాదు. ఉన్నదంతా అదే. ఆ విశ్వరూపమే శివభక్తునికి విశ్వం శివునిగా కనబడుతోంది. విష్ణుభక్తునికి విశ్వం విష్ణువుగా కనబడుతోంది. నిజానికి మనకున్న ఈశ్వరుడు విశ్వానికి దూరంగా లేడు. విశ్వమే విశ్వేశ్వరుడు. ఆయనే విశ్వరూపుడు. ఆయనే విష్ణువు. ఇదే విష్ణుసహస్రం మొత్తం(యొక్క) సారాంశం.

విష్ణుసహస్రంలో విశ్వరూపంలో లేని దేవత లేదు. ఇంద్రుడు, యముడు, వరుణుడు, వాయువు, అగ్ని, రుద్రుడు - **'రుద్రో బహు శిరా బభ్రుః, సర్వః శర్వః శివః స్థాణుః'** - ఏమి లేదో చెప్పండి. అందరు దేవతలూ ఇందులో కనబడతారు. ఇందరు దేవతలతో విష్ణు సహస్రం చెప్పడం ఏమిటి? అంటే **అన్ని అవయవాలతో విష్ణువును గౌరవించినట్లు అందరు దేవతలతో విష్ణువును చూడడం.**

ప్రపంచాన్ని విడివిడి ముక్కలుగా చూడకుండా అంతా కలిపి ఒకే పరమేశ్వరునిగా చూడమని చెప్పడమే ఇందులో ఉద్దేశం. ఈ ప్రపంచంలో ఉన్న సర్వశక్తి ఆయన స్వరూపంగా చూడాలి. అది విశ్వరూపం. స్వామి అర్జునునికి చూపించింది ఒక అద్భుతమో, మాయో కాదు. అది ఒక సత్యం. (It's n't a miracle. It's n't a wonder. It's a truth. Eternal Truth) "విశ్వమంతా నేనే" అనే సత్యాన్ని అనుభవానికి తీసుకుని వచ్చారు. అదృష్టవశాత్తు విశ్వరూపం

అనే భావన ప్రపంచంలో హిందూమతానికి మాత్రమే ఉంది.

## కర్మ సిద్ధాంతం

ఇతర మతాలకు, హిందూమతానికి ఏమి భేదాలు ఉన్నాయో అవి మాత్రమే చెప్పబడుతున్నాయి. 'ఈ శరీరం పోయినా నువ్వు పోవు. ఉంటావు' – అంటేనే ఏ మతమైనా బ్రతుకుతుంది. 'ఈ శరీరం పోయినా నువ్వు ఉంటావు, పుణ్యం చేస్తే స్వర్గానికి, పాపం చేస్తే నరకానికి పోతావు' అని చెప్పడంతో ఆగిపోతాయి ఇతర మతాలు. అంతే కానీ మరొక(పునర్)జన్మ – ఇతర మతాలు ఒప్పుకోవు. కానీ మరొక జన్మ హిందూమతానికి మాత్రమే ప్రత్యేకం... అంటే కర్మ సిద్ధాంతం.

'నరకం కూడా శాశ్వతం కాదు, మళ్ళీ అది అయిపోయాక కిందనే పడతావు' అని హిందూమతం చెప్తోంది. అంటే వారు చెప్పింది చెప్తూ దాని పైమెట్టు కూడా మరొకటి చెప్పారు – **'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి'.** ప్రతివారికీ స్వర్గం, నరకం మాత్రమే ఉంటాయి. హిందువులకు మోక్షం అనే ఒక విశేష విషయం ఉంది. ఇది ప్రత్యేకం. అంటే వేరే మతంవారు చెప్పింది చెప్తూ, వారు చెప్పనిది కూడా చెప్పామంటే పరిపూర్ణత ఎక్కడ ఉన్నట్లు? హిందూమతంలోనే కదా!

మన వైపు నిందలు ఏవేవి వేస్తున్నారో వాటికే సమాధానం చెప్పడానికి ఇప్పుడు చెప్పుకుంటున్నాం. అనేక మంది దేవుళ్ళు అనే దానికి సమాధానం చెప్పుకోగలిగాం. విశ్వరూపం అనే అంశాన్ని ఒక్కసారి పరిశీలిస్తే – విడి విడిగా చూడమని చెప్పలేదు, ఏకత్వాన్ని చూడమని మనవాళ్ళు చెప్పారు. శివసహస్రం చదివితే విష్ణు నామాలు, విష్ణు సహస్రం చదివితే శివ నామాలు కనబడతాయి.

ఒకరు గురువు దగ్గరికి వెళతారు. శ్రీవిద్యామంత్రం ఉపదేశం పొందుతారు, జపం చేస్తారు. వానికి ఆ మంత్రం ద్వారా ఆ భగవంతుడు లలితాదేవిగా కనబడుతున్నాడు. ఇంకొకడు లక్ష్మీమంత్రం తీసుకుంటాడు, జపం చేస్తాడు, వానికి భగవంతుడు ఆ రూపంలో కనబడతాడు. సృష్టి అంతా అనేక భావాలతో ఉంది. ఈ భావాలు మీరు, నేను ఏర్పరచలేదు. సృష్టిలో ఉన్నాయి. అవునో,

లేదో పరిశీలించండి.

విద్య, ఐశ్వర్యం, పరాక్రమం – ఇందులో ఏది గొప్పది? ముందు చెప్పినట్టే, దేని అవసరం వచ్చినప్పుడు అదే గొప్పది. కనుకనే ఒకే పరమేశ్వరుడు మనకు విద్యని ఇస్తున్నాడు అనగానే ఒక్కసారి అమ్మా! అని పిలిస్తే 'సరస్వతి'. ఐశ్వర్యం ఇస్తోంది అంటే 'లక్ష్మి'. పరాక్రమం ఇస్తోంది అంటే 'దుర్గ'. ఒకొక్క భావానికి ఒకొక్క దేవత. ఇన్ని భావాలు ఎవరివి? ఒకే భగవంతునివి.

ఇది ఎలాంటిది అంటే ఒక తల్లి పిల్లలని పెంచుతుంది. మనందరం తల్లి చేత పెంచబడ్డ వాళ్ళమే కదా! ఆ తల్లి మనలను ఎలా పెంచిందో ఒకసారి ఆలోచించండి.

తల్లి మనకు 'అమ్మా! ఆకలేస్తోందమ్మా' అంటే అన్నం పెడుతుంది. తిండి తినేశాక హోంవర్క్ చేస్తూ ఉంటే 'అమ్మా! నాకు ఈ లెక్క అర్థం కాలేదు' అంటే ఆ తల్లి వచ్చి ఆ లెక్క చేసి పెడుతుంది. ఇందాక అన్నం పెట్టిన అమ్మ ఇప్పుడు చదువు చెప్పే అమ్మగా మారిపోయింది. మొదట అన్నం పెట్టినప్పుడు అమ్మలో 'అన్నపూర్ణమ్మ' కనబడుతోంది. చదువు చెప్పేటప్పుడు 'సరస్వతిగా' కనబడింది. 'అమ్మా! స్కూల్ ఫీజ్ కట్టాలమ్మా, బ్యాగ్ కొనుక్కోవాలమ్మా' అంటే 'లక్ష్మీదేవి'గా అవుతుంది. ఏదో తప్పు చేశారు, ఎవరో ఫిర్యాదు ఇచ్చారు... ఒక్కటి కొట్టింది అమ్మ. అప్పుడు ఆమె 'కాళి'. అరే! నీ ఒక్క బ్రతుకు తీర్చి దిద్దడానికి ఒక్క అమ్మే నాలుగు రూపాలు ధరించవలసి వచ్చిందే, మరి ప్రపంచాన్ని నడపడానికి పరమాత్మ ఎన్ని రూపాలు ధరించాలో ఆలోచించండి. కనుక ఏ రూపం చూసినా మా స్వామే అని తెలుసుకోవాలి. అదేవిధంగా అన్ని రూపాలు నాకు కావాలి. భగవంతుని ముందు నిలబడి 'స్వామీ! నీకెందుకయ్యా ఇన్ని రూపాలు?' అంటే 'నాయనా! నీకెన్ని అవసరాలో నాకన్ని రూపాలు' అంటాడు పరమాత్మ.

## మోక్షం – ఒక విశ్లేషణ

స్వర్గం, నరకం అనేవే కాకుండా మోక్షం అనేది ఒకటి ఉన్నది. మోక్షం అనగా పరమాత్మను అనుభవించడం. మోక్షానికీ, బంధానికీ నిర్వచనం ఒక్క మాటలో

చెప్పాలంటే – 'భగవంతుని వల్ల పని చేస్తున్న ప్రపంచాన్ని చూస్తూ ఈ ప్రపంచమే సత్యం అనుకుని దీనిలో తిరిగితే బంధం. కానీ ఈ ప్రపంచమంతా పరమాత్మే అని తెలుసుకుని పరమాత్మతో అనుబంధం ఏర్పరచుకుంటే మోక్షం'. ప్రపంచంతో తాదాత్మ్యం బంధం, పరమాత్మతో తాదాత్మ్యం మోక్షం. స్వర్గం, నరకం – అన్నీ ప్రపంచంలోవే. అవి నీకు తెలియదు కానీ, అవి కూడా ఉన్నాయి.

నేను వెళ్ళలేదు కానీ అమెరికా ఉంది. నేను వెళ్ళలేదు కానీ ఇంగ్లండు ఉంది. అలాగే నేను వెళ్ళక పోయినా స్వర్గమూ ఉంటుంది, నరకమూ ఉంటుంది. కానీ స్వర్గమూ, నరకమూ కూడా ప్రపంచమే. అంతా కలిపి ఆ పరమేశ్వర స్వరూపమే అని పరమార్థ దృష్టి కలిగితే స్వర్గం, నరకం, అనే లోకాలు ఏవీ లేకుండా మనస్సు పరమాత్మతో ఐక్యం అయిపోతుంది. ఆ ఐక్యం పేరు 'మోక్షం'. 'భగవంతునిలో ఐక్యమయ్యాడు' అనే మాట అంటాం. ఈ మాట ప్రపంచంలో ఇంకెక్కడైనా కనబడుతుందా? సర్వవ్యాపకుడైన బ్రహ్మంతో ఐక్యమవడం. ఎంత అందమైన మాట! దాని పేరు మోక్షం. అది తెలుసుకోలేకపోతే బంధం. ఆ ఐక్యం కానంత వరకూ జన్మలు ఎత్తుతూనే ఉండాలి.

## ఒకే గమ్యంగా షణ్మతాలు

ఒకే ఈశ్వరుని ఆయా దేవతా భక్తి కలిగినవారు ఆయా రూపాలతో ఉపాసిస్తున్నారు. ఎలా ఉపాసించినా చేరేది ఒకే తత్త్వం దగ్గరికే అనే ప్రధానాంశం హిందూధర్మానికి ప్రాణం. అది మర్చిపోకుండా హిందువులు జీవించవలసిన అవసరం ఉన్నది. **శైవ, వైష్ణవ, శాక్తేయ, సౌర, గాణపత్య, స్కాంద** అనే ఆరు మతాలు వేరు వేరుగా కనబడవచ్చు. కానీ ఈ ఆరు మతాల మూలస్వరూపం మాత్రం వేదమే. ఆరుగురూ వేదాన్నే ప్రమాణంగా తీసుకుంటున్నారు.

సనాతన హైందవధర్మం ఒక పెద్ద వృక్షం లాంటిది. ఈ వృక్షంలో ఆరు కొమ్మల వంటివి ఆరు మతాలు. వీటినే **షణ్మతాలు** అని అంటారు. హిందూమతం ప్రధానంగా షణ్మతస్వరూపమైనది.

ధర్మం, మతం అని రెండు మాటలు ఉన్నాయి. నిజానికి ధర్మం, మతం ఒకే

అభిప్రాయంలో మాట్లాడుతున్నాం. నిఘంటువులలో మతం అనే శబ్దానికి – అభిప్రాయం, అర్చన, జ్ఞానం అనే మూడు అర్థాలు చెప్పారు. హిందూమతం అన్నప్పుడు హిందూధర్మంలో ఉన్న ఒకానొక అభిప్రాయం అని చెప్పుకోవచ్చు. జ్ఞానం అని చెప్పుకోవచ్చు. అర్చనా పద్ధతి అని కూడా చెప్పుకోవచ్చు.

శివునినే ఉపాసిస్తే 'శైవం'. విష్ణువునే పరదైవం అనుకుంటే 'వైష్ణవం'. శక్తిని పరదైవం అనుకుంటే 'శాక్తేయం'. గణపతిని పరదైవం అనుకుంటే 'గాణపత్యం'. సుబ్రహ్మణ్యుని పరదైవం అనుకుంటే 'స్కాందం'. సూర్యునినే పరబ్రహ్మ అనుకుంటే 'సౌరం'. ఇవి ఆరు మతాలు. ఈ ఆరు మతాలకు ఆగమ మతాలు అని పేరు.

హిందూధర్మంలో నిగమం, ఆగమం అని రెండు భాగాలు ఉన్నాయి. 'నిగమం' అంటే వేదం. 'ఆగమం' అంటే మంత్రశాస్త్రం. ఈ మంత్రశాస్త్రాలలో దేవతలను ఉపాసించే పద్ధతులను చెప్పేదానికి ఆగమం అని పేరు.

శివుని ఏ విధంగా ఆరాధించాలి! ఎన్ని ఉపాసనలు ఉన్నాయి? ఎన్ని మంత్రాలు ఉన్నాయి? మంత్రానికి యంత్రం ఏమిటి? దాని విగ్రహం ఏమిటి? దాని స్వరూపమేమిటి? ఇత్యాదులు తెలియజేసేవి శైవాగమాలు. విష్ణువును ఎలా ఆరాధించాలి? ఆయన ఆలయాలు ఎలా నిర్మాణం చెయ్యాలి? ఆయన యంత్రం ఎలా ఉంటుంది? ఆయన స్వరూపం ఎలా ఉంటుంది? ఎలాంటి నియమాలు పాటించాలి? ఇవన్నీ చెప్పే దాని పేరు వైష్ణవాగమం.

అదేవిధంగా శక్తిని ఉపాసించే పద్ధతులను తెలియజేస్తూ మంత్ర, యంత్ర, విగ్రహ ఉపాసనా విజ్ఞానాన్ని చెప్పేది శాక్తేయం. అలా ప్రతి దేవతకు ఆగమాలు ఉంటాయి. ఈ ఆగమాలు ఆరు. ఈ ఆగమాల మీద ఆధారపడి వచ్చిన మతములు ఆరు మతాలు.

ఇక నిగమం అంటే వేదం. వేదం ప్రకారంగా ఉన్నవాడు ఒకడే పరమేశ్వరుడు. ఆయనే అనేక దేవతల రూపాలతో ప్రకృతిని శాసిస్తూ ఉంటాడు. **'నేను' అనే చైతన్యం 'నా' ఇంద్రియాలను ఎలా నిర్వహిస్తోందో పరమేశ్వరుడు ప్రపంచమనే శరీరాన్ని బహుశక్తులతో నిర్వహిస్తున్నాడు. ఆ శక్తులకే దేవతలు అని పేరు.**

వేదం, ఆగమాలు అని చెప్పబడే మంత్రశాస్త్ర ఉద్దేశం కూడా ఒకటే. ఈ రెండూ తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం కాకుండా నిగమానికి, ఆగమానికి సంబంధం ఉంది. వేదంలో ఏమి చెప్పారో దానిని ఉపాసనలోకి తేవడం కోసం ఆగమం ఏర్పడింది.

ఎవరి మతాన్ని వారు పాటించవచ్చు. అదే సమయంలో ఇంకొకరి మతాన్ని గౌరవించడం నేర్చుకోవాలి. **సత్సంప్రదాయం అంటే మన సంప్రదాయంలో మనం ఉంటూ, ఇతర సంప్రదాయాలను గౌరవించడం.** ఇది ఆగమాలలో మనం గ్రహించవలసిన అంశం. ఈ ఆరు మతాలకు, వేదధర్మానికి ఉన్న అనుబంధం ఎలాంటిదంటే వేదం చెట్టు వంటిదైతే, ఆరు మతాలు కొమ్మల వంటివి. చూసే దృష్టిలో తేడా ఉంటుంది.

ఒకాయన ఒక వృక్షాన్ని చూసి 'అబ్బా! చెట్టు ఎంత బాగుందో' అని దండం పెట్టి వెళ్ళిపోయాడు. ఇంకొకాయన వచ్చి 'ఎన్ని కొమ్మలో, ఎన్ని రెమ్మలో, ఎన్ని పళ్ళో' అన్నాడు. ఇతని దృష్టిలో ఎన్నో కనబడ్డాయి. అతడి దృష్టిలో ఒకటే కనబడింది. ఇందులో ఏది నిజం? రెండవవాడు చూసింది అనేకం. మొదటివాడు చూసింది ఏకం. కానీ నిజానికి అనేకం కలిపి ఏకంగా చూశాడు మొదటివాడు. ఏకంలో అనేకం చూశాడు రెండవవాడు.

అదేవిధంగా హిందూధర్మంలో అనేకంగా కనబడుతున్న మతాలను చూస్తున్నాం, ఏకంగా ఉన్న పరమాత్మని చూస్తున్నాం. ఆ రెండూ కలిపి ఒకటే స్వరూపం. అయితే ఒకాయన 'ఒక కొమ్మ చాలా పెద్దది. నేను ఆ కొమ్మ మీద పళ్ళు మాత్రమే తింటాను' అని కూర్చుని తిన్నాడు. మరొక ఆయన ఇంకొక కొమ్మ ఎక్కాడు. ఇలా ఒకే చెట్టుకున్న ఆరు కొమ్మల మీద ఆరుగురు సర్దుకుని కూర్చున్నారు. ఏడవవాడు వెళ్ళి కొమ్మకో పండు కోసుకుని తిన్నాడు. ఇప్పుడు ఆ ఒక్క కొమ్మ మీద ఉన్నవాడు తిన్నదీ ఆ చెట్టు పండే. ఆరు కొమ్మలు పంచుకు తిన్నవారు తిన్నదీ ఆ చెట్టు పండే. ఆ చెట్టు సారం ఆ ఫలరూపంలో లభిస్తోంది.

**వేదమనే చెట్టుకున్న ఆరు మతాలనే కొమ్మల మీద ఏ పండు తిన్నా దొరికే**

**ఫలం మాత్రం ఒక్కటే. హైందవధర్మాన్ని రక్షించడానికి కావలసిన సూత్రం ఇదే. ఇదే సమన్వయం. ఇదే సనాతనం. వేదం చెప్పినది ఇదే. ఏ దైవాన్ని ఉపాసిస్తున్నామో ఆ దైవాన్ని సర్వదేవతారూపంగా ఉపాసించాలి.**

వ్యాసభగవానుడు ఏ దేవతాభక్తులకు ఆ దేవతపై నిష్ఠ కలగడం కోసం ఆ దేవతే పరమం, ఆ దేవతే సర్వదేవతలకీ మూలం అని చెప్పాడు. ఆ చెప్పడంవల్ల వారు ఆ ఇష్టదేవతను ఆ దృష్టితో చూడాలి. ఒకే వ్యాసుడు శివపురాణాన్ని, విష్ణుపురాణాన్ని, సౌరపురాణాలని, గణపతిపురాణాలని అందించాడు, స్కాందం కూడా అందించాడు. వేదం చెప్పిన ఆ పద్ధతులన్నీ తీసుకుని పురాణాల రూపంలో అందించాడు.

వ్యాసహృదయం కూడా ఒక్కటే. ఏకత్వాన్ని దర్శించు. ఉపాసించే దైవం సర్వదేవతాత్మకమైన పరబ్రహ్మమని ఆరాధించు. అప్పుడే 'హరి అవతారములె అఖిల దేవతలు', 'ఇతడొకడే సర్వేశ్వరుడు', 'ఎంత మాత్రమున ఎవ్వరు తలచిన అంత మాత్రమే నీవు' అన్న అన్నమయ్య హృదయం అర్థం అవుతుంది. అనేక ఏకత్వాల సమన్వయం హిందూధర్మంలో ఉన్న గొప్ప లక్షణాలలో ఒకటి. పైగా మనం ఉపాసించేది ఒకే పరమాత్మని అని చెప్పడానికి వేదం ఆధారంగా ఒక అందమైన మాట చెప్పుకున్నాం.

## యోగపరమార్థం - ప్రణవోపాసన

వేదం ప్రకారంగా ఉన్నవాడు ఒకే పరమాత్మ. వానిని చెప్పేది ఒకటే నామం – **'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'** – ఓం అనబడేది బ్రహ్మమును తెలియచేస్తుంది. పరమేశ్వరుడు ఒక్కడే. ఇదే మాటని తీసుకుని పతంజలి యోగసూత్రాలలో **'ఈశ్వర ప్రణిధానం'** అన్నాడు. ఈ రోజులలో వ్యాయామమే యోగా అనుకుంటున్నారు. అసలు యోగవిద్య ఎప్పుడో అటకెక్కించేశారు. పతంజలి ఇచ్చిన యోగంలోని ఎనిమిది పేర్లు అందరికీ తెలుసు. అవి – యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి.

ఈ యోగం నేరుగా మోక్షాన్ని ఇవ్వదు. యోగం భక్తికి, జ్ఞానానికి సహకారి

మాత్రమే. ఉదయం లేచి వ్యాయామం చేసి చక్కటి బట్టలు కట్టుకున్నంత మాత్రాన జీవన పరమార్థం సాధించినట్లేనా? అలా తెచ్చుకున్న ఆరోగ్యంతో మంచి పనులు చెయ్యాలి. యోగం వల్ల మనస్సుకు ఒక ఏకాగ్రత ఏర్పడుతుంది, శరీరానికి ఒక ఆరోగ్యం ఏర్పడుతుంది. ఈ రెండిటితో మన బుద్ధికి ఒక శుద్ధి ఏర్పడి, భగవంతుడు అంటే అవగాహన ఏర్పడి భక్తి, జ్ఞానాలను పెంపొందించుకోగలం.

యోగం ఎప్పుడూ భక్తికి, జ్ఞానానికి సహకారే తప్ప యోగం ఒక్కటే గొప్పది కాదు. ఒకాయన "ఈ మధ్య యోగా తరగతులకి వెళుతున్నాను... అందుకే జపం, సంధ్యావందనం, ఆలయాలకు వెళ్ళడం మానేశాను" అన్నాడు. మానెయ్యమని యోగం చెప్పిందా? ఎప్పుడూ మానెయ్యడానికి మార్గాలు వెతుకుతున్నారు కాని, చెయ్యడానికి మార్గాలు వెతకడం లేదు.

యోగం సహకారి మాత్రమే. యోగశాస్త్రాన్ని ఇచ్చిన పతంజలి **ఈశ్వర ప్రణిధానం** అని చెప్పాడు. అంటే ఈశ్వరునికి ప్రణతి చెయ్యడం అనేది చాలా ప్రధానంగా యమ నియమాల్లో ఒక భాగంగా చెప్పారు. యమ, నియమ అని రెండు చెప్పారు కానీ మళ్ళీ ఒకొక్క దానిలో పది ఉన్నాయి. భాగవతం ఈ రెండిటిని పది పదిగా చెప్పింది. సత్యం, అహింస, శౌచం, అస్తేయం... మొదలైనవి పాటించడం. అవి పాటిస్తూ శరీరాన్ని, ఇంద్రియాలను నిగ్రహించుకుంటూ క్రమంగా ఈశ్వరుని ఆరాధించడం చాలా ప్రధానం.

ఈశ్వరారాధన అనేదే జీవితానికి పరమార్థం. ఈశ్వరుడు అంటే శివుడు, విష్ణువు అని కాదు. 'ఈశ్వరునే శరణంబు వేడెదన్' అని గజేంద్రుడు అన్నప్పుడు ఈశ్వరుడు అంటే ఒకే పరమాత్మ. దానిని శివుడు అనుకోండి, విష్ణువు అనుకోండి.

## ప్రణవమే పరమాత్మ

పతంజలి యోగసూత్రాలలో ఈశ్వరోపాసన ప్రధానమని చెప్తున్నారు. ఆ ఈశ్వరుని తెలియజేసే శబ్దం '**తస్య వాచక ప్రణవః** అన్నారు. ఆయనను తెలియజేసే శబ్దం **ప్రణవం**– అనగా **ఓంకారం.** ఒక్కసారి హిందూమతంలో ఏకత్వం ఎక్కడ ఉందో పరిశీలిద్దాం. ఒకరు **నమశ్శివాయ** అంటారు. ఒకరు **నమో నారాయణాయ**

అంటారు. ఒకరు **గణేశాయ** అంటారు. ఒకరు **సూర్య** అంటారు. ఎవరు ఏమన్నా ఎవరూ ఓంకారాన్ని వదలరు. ఓంకార స్వరూపమే గణపతి అంటుంది గాణపత్యం.

ఓంకార స్వరూపమే విష్ణువు అంటుంది వైష్ణవం, విష్ణు పురాణం. ఓంకార స్వరూపుడే శివుడు అని చెప్తోంది శైవం. **'నమస్తారాయ నమశ్శంభవేచ మయోభవేచ'** అనే దానిలో **నమస్తారః – తారః** అంటే **ఓంకారం** అని అర్థం. **'ఓంకారస్తారః'** అని వేదమే చెప్తోంది. తార స్వరూపం ఓంకారం. అది శివుడు అని చెప్తోంది రుద్రం. అలాగే ఓంకారం నారాయణ స్వరూపం అని నారాయణ మంత్రాలు చెప్తున్నాయి.

దీని అర్థం – ఉన్నది ఒకే ఓంకారం కనుక ఆ ఓంకారానికి నమో నారాయణాయ తగిలిస్తారు ఒకరు, నమశ్శివాయ తగిలిస్తారు మరొకరు, గణపతిని తగిలిస్తారు మరొకరు. కాని ఓంకారాన్ని ఎవరూ విడిచి పెట్టడం లేదు. ఉన్నవాడు ఒకడే పరమేశ్వరుడు. వానిని తెలియచేసేదే ఓంకారం. దానికి నమశ్శివాయ, నమో నారాయణాయ, గణపతయే తగిలిస్తున్నామంటే అర్థం ఓంకారవాచ్యమైన పరమాత్మనే శివ, నారాయణ, సూర్య, గణపతి అని ఉపాసిస్తున్నాము.

అనేకంగా కనబడుతున్న శివ నారాయణులకు ఏకత్వం ఇస్తున్నది ఓంకారం. హిందూమతంలో ఓంకారం అన్ని శాఖల వారికి ప్రధానం. ఒక్కసారి ఈ ఓంకారం గురించి ఆలోచిస్తే ఆశ్చర్యపోతాం. ఓంకారం అంత గొప్పది అంటే హిందువులు పలుకుతారు అని అనుకుంటున్నాం. కానీ ఓంకారం విజ్ఞానం. ఒక్క మాటలో చెప్పాలంటే విజ్ఞానాన్ని విశ్వసించే మతం పేరు హిందూమతం. విశ్వాసాన్నే విజ్ఞానం మిగిలినవారు అనుకుంటే, విజ్ఞానాన్ని మనం విశ్వసిస్తున్నాం.

ఓంకారం యొక్క శక్తి గురించి ఆలోచించాలంటే ముందు చేస్తూ ఉంటే అదే తెలుస్తుంది. ఏ మంత్రమైనా దాని అనుభవంతో తెలుస్తుంది కానీ, వివరిస్తే తెలుస్తుందా? చేసే వానికి తెలుస్తుంది. భగవంతుడు ఉపాసించే వారికి అర్థం

అవుతాడు. భగవంతుడు అర్థం కావాలంటే ఉపాసన కావాలి. ఆయనకు, మనకు అనుబంధం ఉపాసన. ఆ అనుబంధంతో అర్థం చేసుకోవాలి.

ఓం అనే దాని గురించి ఒక్కసారి ఆలోచిద్దాం. ఇది ముందు వినగానే హిందూ అనిపిస్తుంది. కానీ ఓంకారం అర్థం తెలుసుకుంటే విశ్వజనీనం(యూనివర్సల్) అనిపిస్తుంది. హిందూమతంలో ఏ విషయం చెప్పినా, ముందు వినగానే అది మత విషయం అనిపిస్తుంది, ఆలోచిస్తే విశ్వంలో ఎక్కడ పుట్టినవానికైనా పనికి వచ్చే మతం హిందూమతం అని అర్థం అవుతుంది.

విశ్వజనీనమైన తత్త్వం(యూనివర్సల్ అప్పీల్, యూనివర్సల్ ఫిలాసఫీ) హిందూమతంలో కనబడుతుంది. 'ఈ పుస్తకాన్నే నమ్ము'. 'ఈ దేవునినే నమ్మకపోయినచో నరకానికి పోయెదవు' అనే పిచ్చి మాటలు హిందూమతం చెప్పదు.

**యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం**
**మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః**

– 'ఎవరు ఏ మార్గంలో వెళ్ళినా నన్నే ఉపాసిస్తున్నారని తెలుసుకో. వారు చివరకు నన్నే చేరతారు' అని పరమాత్మే తీర్మానించి చెప్పాక మనకెందుకు సందేహం?

ఓం అనేది వినడానికి సాహిత్య శబ్దం కాదు. సాహిత్యంలో ఒక పదానికి ఒక అర్థం ఉంటుంది. ఆవు అంటే ఒక అర్థం కనబడుతోంది, శివ అంటే ఒక అర్థం కనబడుతోంది – మంగళస్వరూపుడు, విష్ణు అంటే సర్వవ్యాపకుడు. ఇలా ఒకొక్క దానికి ఒకొక్క అర్థం కనబడుతోంది. కాని ఓం అనే దానిలో అలాంటి అర్థం ఉందా? అర్థం లేదు అనలేదు కానీ, దానిలో సాహిత్యార్థం వెతకరాదు. మంత్రానికి, సాహిత్యానికి సంబంధం ఉండదు. **సాహిత్యం లోకవ్యవహారం. మంత్రం దైవస్వరూపం.**

మంత్రస్వరూపానికి అర్థాలు వెతకలేరు. బీజాక్షరాలకు అర్థాలు ఎవరు చెప్తారు? దానిలో శక్తి దాగి ఉంటుంది అంతే. మంత్రానికీ, వాక్యానికీ భేదం తెలుసుకోవాలి.

**వాక్యమూ మాటే, మంత్రమూ మాటే. కానీ వ్యవహారానికి ఉపయోగించే మాట వాక్యం. శక్తిమంతమైన శబ్దం మంత్రం. ఏ శబ్దంలో శక్తి ఉంటుందో దాని పేరు మంత్రం.** అర్థం వరకు వెళ్ళనక్కర్లేదు, శబ్ద ఉచ్చారణ మాత్రం చేతనే ఒక శక్తి ఉత్పన్నం కావాలి. దీనిని ప్రకంపన అంటారు.

శబ్దం ఉచ్చరించినప్పుడు శక్తి ప్రకంపనలు పుడితే ఆ శబ్దానికి మంత్రం అని పేరు. అలాంటి మంత్రమయంగా ఉంటుంది వేదం. వేదాన్ని వాక్యం అనకూడదు... మంత్రం అనాలి. శక్తిమంతమైన శబ్దాలు అందులో ఉంటాయి. ఆ మంత్రాలకు అర్థాలు ఎవరు వెతకగలరు? ఏమి అర్థం అవుతుంది? ఋషి తపస్సమాధిలో దర్శించిన మంత్రాలకు అర్థం ఏం చెప్పగలం? అందులో ఉన్న అర్థం చెప్పడం కోసం పుట్టాయి ఇతిహాసపురాణాలు.

రామాయణం, భారతం, భాగవతం చదివేవారు కూడా వేదాన్ని అధ్యయనం చేసినవారే. వేదాలు వేరే చదవనక్కర్లేదు. అది మంత్రస్వరూపం కనుక దానికి మర్యాదలు పెట్టారు. అందులో ఉన్న జ్ఞానమంతా పురాణాల ద్వారా అందరికీ పంచి పెట్టారు. ఎందుకంటే **కొందరి చేతుల్లోనే బిగించి పెట్టారు హిందూమతాన్ని అనే అపవాదు హిందూమతానికి ఉంది. అది సరియైన అభిప్రాయం కాదు అని తెలుసుకోవాలి. అదే అయ్యుంటే హిందూమతం ఇంత కాలం బ్రతికేది కాదు. హిందూమతం జ్ఞానపథాలైన వేదాలు మొదలుకుని జానపదాలైన పల్లెపాటల వరకూ వ్యాపించి ఉన్నది.**

అంతే కాదు, వేదాలలో చెప్పిన అశ్వమేధ యాగానికి, ఒక పల్లెలో జరిగే అంకాలమ్మ జాతరకూ కూడా ఒకటే సూత్రం వ్యాపించి ఉన్నది. హిందూధర్మం అంత విస్తారమైనది. ఏ మార్గంలోనైనా తరించడానికి అన్ని పద్ధతులూ ఇక్కడ ఏర్పరచారు. అనేకమంది జీవుల అనేక జీవలక్షణాలని అనేక జ్ఞానస్థాయిలను అనుసరించి అనేక రకాల పద్ధతులు ఏర్పరిచారు. అది హిందూధర్మంలో కనబడే బహు మార్గాల అంశం.

# అంతా(అన్నీ) కలిపి మూడే..

ఒకే నాదం సృష్టి – స్థితిలో 'అ' అని, స్థితి – స్థితిలో 'ఉ' అని, లయ – స్థితిలో 'మ్' అని పిలిచినట్లే, ఒకే పరమాత్మ ఈ మూడు చేస్తున్నాడు. ఇప్పుడు మూడు విడివిడిగా చెప్పుకున్నాం కానీ మూడు కలిసే ఉన్నాయి. అదేవిధంగా మూడు కలిపి ఒకటే బ్రహ్మము.

ఈ మూడు ప్రపంచానికి సంబంధించిన అంశం. సృష్టి, స్థితి, లయ – ఈ మూడు చేసేటప్పుడు బ్రహ్మ, విష్ణు, రుద్ర. వారి శక్తులు సరస్వతి, లక్ష్మి, దుర్గ. అదేవిధంగా ఈ మూడు చెయ్యడానికి సత్త్వ, రజ, తమో గుణాలు. మనం చూస్తున్న భూతకాలం, భవిష్యత్ కాలం, వర్తమానకాలం. అన్నీ మూడు. ఈ మూడు ఈ మూడింటిలో ఉంటాయి.

ఓంకారం గురించి వివేచన చేస్తే ఓం అన్నప్పుడు దాని లోపల అ, ఉ, మ అనే మూడు భాగాలతో పాటు నాలుగవది తురీయం. ఈ నాలుగూ కలిపితే ఓంకారం. మొత్తం వేదసారం ఉపనిషత్తు. ఉపనిషత్సారమైన మాండూక్యోపనిషత్తులో ఓంకారం అంటే నాలుగు భాగాలుగా కనబడుతోంది. లోపల నాలుగు భాగాలు ఉన్నాయి కానీ కలిపి ఒక్కటిగా వినబడుతోంది. విడదీస్తే నాలుగు. కానీ, కలిపే తీసుకోవాలి. అకార, ఉకార, మకారాలు కనిపిస్తున్న సృష్టి, స్థితి, లయ. 'ఓం' అన్నప్పుడు 'అ' అని నోరు మొత్తం తెరచుకుంటుంది. 'ఉ' అంటే స్థితి(సస్టైన్), నిలిచి ఉంటోంది. 'మ్' అంటే మూసుకుపోతోంది. అ అంటే తెరవడం, ఉ అంటే నిలపడం, మ్ అంటే మూయడం. తెరవడమంటే సృష్టి, నిలపడమంటే స్థితి, మూయడమంటే లయ. సృష్టి స్థితి లయలు మూడు కలిపి 'ఓం'లో కనబడుతున్నాయి. సృష్టి, స్థితి, లయలు చేసే ముగ్గురూ ఓంలో ఉన్నారు.

ఆలోచిస్తే ప్రపంచానికి సంబంధించినవి ఈ మూడు. ఈ మూడు చేసేవాడు ప్రపంచమంతా వ్యాపించి చేస్తున్నాడు. ప్రపంచానికి పైన కూడా ఆయనే ఉన్నాడు. ఈ ప్రపంచమంతా ఆయనే ఉంటాడు, కానీ ప్రపంచానికి ఉన్న

వికారాలు ఆయనకు ఉండవు. ఈ రెండిటికీ చిన్న తేడా ఉంది చూడండి. ఈ మాటను అర్థం చేసుకోవడానికి పోతనగారి భాగవతంలో ఒక అత్యద్భుతమైన మాట చెప్పాడు గజేంద్రుడు -

**'ఎవ్వనిచే జనించు జగము**

**ఎవ్వని లోపల నుండు లీనమై**

**ఎవ్వని యందు డిందు'**

ముందు భగవంతుడు అన్న భావం అర్థం చేసుకోవాలి. కానీ ఇలాగే మిగిలిపోతే ఇతరులకు ఉన్న అపోహలకు, వారి సవాళ్ళకు మనం సమాధానం చెప్పలేం. ఓంకారం యొక్క సమగ్రస్వరూపం పరమాత్మను ఎలా చెప్తోందో పరిశీలించాలి.

## విశ్వం, విశ్వాతీతుడూ పరమాత్మే

పరమాత్మను రెండు విధాలుగా దర్శనం చేసుకోవాలి. ఒకటి - ప్రపంచాన్ని నడుపుతూ ఉన్నవాడు. రెండు - ప్రపంచానికి అతీతమైనవాడు. ప్రపంచంలో సృష్టి, స్థితి, లయ ఉంటాయి. కాని పరమాత్మకు ఆ మూడు ఉండవు. **ఆయన లేకపోతే సృష్టి, స్థితి, లయలు ఉండవు కానీ ఆయనకు సృష్టి, స్థితి, లయలు ఉండవు.** ఈ వాక్యం గుర్తు పెట్టుకుంటే చాలు. ఆయన వల్లనే సృష్టి జరుగుతోంది. ఆయనను ఎవరు సృష్టించారు? ఆయన వల్ల స్థితి జరుగుతోంది, ఆయనకు స్థితి అంటూ ఉన్నదా? ఆయన వల్ల లయం జరుగుతోంది, ఆయనకు లయం ఉన్నదా? ఆయన వల్ల మూడు జరుగుతున్నాయి కానీ, ఆయనకు మూడూ జరగడం లేదు. ఇదీ మనం పరిశీలించవలసిన అందమైన అంశం.

సృష్టి, స్థితి, లయలు... మూడూ చేసేవాడు ఆయన. మూడింటికీ అతీతమైన వాడు ఆయనే. ఇది అర్థం చేసుకోవాలంటే– సముద్రంలో కెరటాలు ఉంటాయి. కెరటం లేస్తుంది. నిలబడుతుంది. మళ్ళీ లయమైపోతుంది. కెరటం లేచినప్పుడు సృష్టి. నిలబడినప్పుడు స్థితి. తిరిగి పడిపోయినప్పుడు లయ. ఇప్పుడు సృష్టి స్థితి లయలు కెరటానికి ఉన్నాయి కానీ, సముద్రానికి లేవు.

సముద్రంలో లేచిన కెరటానికి, నిలిచిన కెరటానికి, లయమైన కెరటానికి

ఆధారం సముద్రమే. కెరటాలలో ఉన్నదీ సముద్రమే, కెరటాలకి అతీతమైనదీ సముద్రమే. కెరటాల వికారాలు సముద్రానికి లేవు. పరమాత్మ సముద్రంలాంటివాడు. ప్రపంచం కెరటాల వంటిది. ఈ ప్రపంచానికి జరిగే సృష్టి, స్థితి, లయలు పరమాత్మకు లేవు. కానీ పరమాత్మ లేకపోతే ప్రపంచానికి సృష్టి, స్థితి, లయలు లేవు.

భగవంతుని రెండు కోణాలలో చూడాలి. విశ్వమంతా పరమేశ్వరుడే అని చూడాలి. కానీ ఆ విశ్వ వికారాలు పరమేశ్వరునికి లేవని తెలుసుకోవాలి. ఆ తెలుసుకునే తీరు ఎలాగో శ్లోకాలలో చెప్పారు. స్తోత్రాలు చదివి మహిమలు మాత్రమే అని కాకుండా స్తోత్రాల ద్వారా భగవత్ జ్ఞానాన్ని సూచిస్తున్నారు ఋషులు అని తెలుసుకోవాలి.

**ప్రతి స్తోత్రం ఒక శాస్త్రం. ఈ కోణంలో ప్రతి స్తోత్రాన్ని పరిశీలించాలి.** అంతే కానీ స్తోత్రము చేయుదును, సంకీర్తన చేయుదును, నన్ను పాపముల నుంచి కడతేర్చుము ఇలాంటి ప్రార్థనలు మనకు చేతకావు. మన హిందూధర్మంలో ఒకొక్క స్తోత్రం ఈశ్వరజ్ఞానాన్ని అందించడం కోసం పెద్దలు ఇచ్చారు. జ్ఞానం లేనిదే భగవదనుగ్రహం లేదు. స్తోత్రం లేనిదే ఈశ్వరకృప లేదు.

స్తోత్రాలు ఊరికే క్యాసెట్లా చదివెయ్యడం కాకుండా అర్థస్పృహతో తెలుసుకుంటే ఈశ్వరుడంటే అర్థం అవుతాడు. అలా అని చదవడం మానెయ్యకూడదు. కొన్నాళ్ళు ఏదోలా అయినా చదివితే తరువాత అందులో ఏది ఉందో తెలుసుకోవాలన్న బుద్ధి పుడుతుంది. అప్పుడు తరించగలం. కొంతమంది చివరివరకూ అర్థస్పృహ లేకుండా చదువుతూనే ఉంటారు. ఈ పుణ్యానికి మళ్ళీ వచ్చే జన్మలో తెలుసుకునే జ్ఞానం వస్తుంది. ఈ అవకాశం ఒక్క హిందువుకే ఉంటుంది. మరో జన్మని అంగీకరించే మతం ప్రపంచం మొత్తం మీద హిందూమతం మాత్రమే.

ప్రపంచమంతా పరమేశ్వరుడు, ప్రపంచానికి అతీతమైనవాడూ పరమేశ్వరుడే – ఈ రెండూ పరిశీలిస్తే మనం ప్రపంచంలో ఉన్నాం కనుక ప్రపంచానికి

అతీతమైన పరమేశ్వరుని కూడా ప్రపంచంలోనే చూడాలి. ఇది మనం గ్రహించగలిగితే సృష్టి, స్థితి, లయ – అ, ఉ, మ – ప్రపంచానికి సంబంధించినది. దానికి అతీతమైనది మరొకటి ఉంది. ఇదీ వేదం చెబుతోంది. దాని పేరు 'తురీయం'. తురీయం అనే మాటకు అర్థం బయటికి వినబడదు, కనబడదు, కానీ అది లేకపోతే ఏదీ లేదు. ఇది ఎలాంటిది అంటే చెట్టు కనబడుతుంది, వేరు కనబడుతుందా? వేరు కనబడదు. కానీ వేరు కనబడాలి అని చెట్టును త్రవ్వితే చెట్టు బ్రతకదు.

భవంతి కనబడుతుంది, పునాది కనబడుతుందా? పునాదులు కూడా కనబడాలి అంటే భవంతి నిలబడదు. కనబడుతున్న భవంతిని చూస్తూ... కనబడని పునాది చూస్తానంటే కుదరదు. కనబడుతున్న చెట్టును చూసినప్పుడు కనబడని వేరు ఉంది అనే జ్ఞానం ఉండాలి. అదేవిధంగా కనబడుతున్న ప్రపంచం అకార, ఉకార, మకారాలు. దానికి పైన ఉన్నది తురీయం. ఇది కనబడదు, వినబడదు, వర్ణించడానికి కూడా వీలు కాదు.

'తురీయం' అంటే నిఘంటు పరంగా 'నాలుగవది' అని అర్థం. ఈ నాలుగు భాగాలు కలిపితే ఓంకారం. సృష్టి, స్థితి, లయలు చేసే పరమాత్మ 'ఓంకారం'లోనే ఉన్నాడు. సృష్టి, స్థితి, లయలకు అతీతమైన భగవంతుడు 'తురీయరూపం'లో ఉన్నాడు. తురీయం అంటే ఎక్కడ చూడాలో చెప్తూ ఓమ్మ్.... అన్నప్పుడు ఆ చివరికి చెప్పిన మకారం ఎందులో లయమైపోతోందో పరిశీలించాలి. అది ఒక మౌనంలోకి వెళుతోంది. ఆ మౌనంలోంచి పలికే ఓం మళ్ళీ ఆ మౌనంలోకే వెళిపోతోంది.

కెరటాలు సముద్రంలోంచే వచ్చి, తిరిగి సముద్రంలోకి వెళ్ళినట్టు. కెరటాలకు పైన సముద్రం ఎలా ఉందో, అకార, ఉకార, మకారాలకు పైన ఉన్న తురీయం వీటన్నిటికి అతీతం. ఈ నాలుగు కలిపే ఓంకారం. ప్రపంచమంతా పరమేశ్వరుడు అని తెలుసుకోవడానికి అకార, ఉకార, మకారాలు. ప్రపంచానికి అతీతుడూ పరమేశ్వరుడు అని తెలుపడానికి తురీయం. ఈ నాలుగూ కలిపి ఒకే

భగవంతునిగా దర్శించడమే ఓంకార స్వరూపం. ఒక్క మాటలో ఎంతో తేటగా శాస్త్రం చెప్పింది. దీన్ని తీసుకుని పోతనగారు చెప్పారు. నిజానికి వ్యాసుడు చెప్పిందే పోతనగారు అనువదించారు -

**విశ్వకరు విశ్వదూరుని విశ్వాత్మకు విశ్వమయుని విశ్వునవిశ్వున్**

**శాశ్వతునజు బ్రహ్మ ప్రభు ఈశ్వరునిన్ పరమపురుషు నే భజియింతున్**

పై దానికి అర్థం తెలుసుకుంటే, 'ఇంత జ్ఞానం ఉందా!' అని దండం పెడతాం. ఆలోచించ గలిగిన పాశ్చాత్యులైన మేధావులు భారతీయసంస్కృతికి మోకరిల్లడానికి కారణం ఇలాంటి భావాలే. మనం ఈ భావాలు సంగీతంలా బాగుంది అనుకుంటాం, విని తల ఊపుతాం. కానీ ఏం చెప్తున్నారో అర్థం చేసుకోవడం లేదు. ఇప్పుడు అర్థం చేసుకొనే ప్రయత్నం చేద్దాం.

**విశ్వకరు విశ్వదూరు విశ్వాత్మకు విశ్వమయుని విశ్వు అవిశ్వున్** - ఒకే పదం అటూ ఇటూ తిప్పినట్టు ఉంది కానీ అద్భుతమైన అర్థాన్ని చూపించారు.

విశ్వకరు - విశ్వాన్ని తయారు చేశాడు

విశ్వదూరు - విశ్వానికి దూరంగా ఉన్నాడు

విశ్వాత్మకు - విశ్వమే తన స్వరూపంగా ఉన్నాడు

అక్కడికక్కడే వైవిధ్యం. విశ్వాన్ని తయారు చేశాడు - ఒప్పుకుంటాం. విశ్వానికి దూరంగా ఉన్నాడు - ఒప్పుకుంటాం. మళ్ళీ విశ్వమంతా ఆయనే అంటున్నాడే - ఇదెలా? అంటే విశ్వమంతా తయారుచేశాడు. తయారైన విశ్వంలో తన శక్తినే నింపాడు. కాని విశ్వవికారాలకి దూరంగా ఉన్నాడు అని చెప్పడానికే 'విశ్వదూరుని' అన్నారు.

కెరటాల నిండా ఉన్నది ఆ సముద్రం నీరే. అది దూరంగా ఉందా ఏమిటి? కానీ కెరటాల కంటే అతీతంగా కూడా ఉంది. వికారాలు లేవు. అది చెప్పడం కోసం విశ్వకరు - విశ్వదూరుని - విశ్వాత్మకు. మొత్తానికి ఇప్పుడు ఏమి తెలిసింది? విశ్వమయుని - విశ్వంలో ప్రతి అణువు ఆయన స్వరూపమే.

**యచ్చకించిత్ జగత్ సర్వం దృశ్యతే శ్రూయతేపి వా**

**అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః**

యూరోప్‌కి చెందిన ఒక శాస్త్రవేత్త చెప్పిన మాట – **"ఉపనిషత్తులు చెప్పిన బ్రహ్మ సిద్ధాంతంలో ప్రపంచంలో ఉన్న అన్ని మతాలను తనలో దాచుకోగలిగిన విశాలత్వం కనబడుతోంది. అలాంటి ఉపనిషత్ సిద్ధాంతం కలిగిన ధర్మం ప్రపంచంలో హిందువులది తప్ప ఇంకేదీ లేదు కనుక దానికి నమస్కారం చెయ్యాలి"** అని చెప్పారు. ఇది గర్వించదగ్గ అంశం.

## హిందూమతాన్ని విశ్వవ్యాప్తం చేసిన 'వివేకం'

స్వామి వివేకానంద చికాగోలో ప్రవచించిన మూడవ రోజు జరిగిన ఒక అంశం – హిందూమతం సమగ్రస్వరూపాన్ని ఆవిష్కరించాడు. మొట్టమొదట నాలుగు నిమిషాలు మాట్లాడించడానికే నానా ఇబ్బంది పెట్టారు పాశ్చాత్యులు. ఆ మరుసటి రోజు ఆయన మాట్లాడేటప్పటికల్లా వారు– "మీరు మాట్లాడితే చాలు" అన్నారు. ఎవరు గొంతు విప్పితే మిగిలిన మతాల గొంతులు మూసుకుపోయాయో ఆ గొంతు వివేకానందది. అ గొంతులో ధ్వనించింది హిందూమత ధర్మం.

1893 సెప్టెంబరు 11వ తేదీ చికాగో నగరంలో జరిగిన ప్రవచనంలో జరిగిన అంశం – ప్రపంచం మొత్తం మీద ఉన్న సర్వ మతాల సమ్మేళనం. ఆ సంఘటన గుర్తు పెట్టుకోవాలి. చాలా ప్రధానమైనది. అది ఒక ఇంటర్ ఫైత్ సమ్మిట్ (Inter faith summit) – అన్ని మతాల వారు కూర్చుని వారి వారి మంచి అభిప్రాయాలు చెప్పుకోవడం కోసం ఏర్పరచినది.

స్వామి వివేకానందకి ఆ సభలో ఇచ్చిన సమయం చాలా తక్కువ. వేదిక మీద ఒకే మతానికి చెందినవారు పదేసి/ఇరవయ్యేసి మంది ఉన్నారు. ఇంకా ఇతర మతాల వాళ్ళూ ఉన్నారు. కానీ **స్వామి వివేకానంద చెప్పిన నాలుగు నిమిషాల మొదటి ప్రవచనం ఇప్పటికీ అమెరికా వారి గుండెలలో**

మారుమ్రోగుతోంది, మిగిలిన వందల మంది గొంతుల కంటే ఏముంది అందులో?

సుమారు ఒక రెండు మూడు ఏళ్ళ క్రితం చికాగో నగరంలో వివేకానంద మాట్లాడిన చోటు చూడాలని ఉత్సాహంతో వెళ్ళినప్పుడు ఆనందపడడం జరిగింది. అది చికాగో నగరం నడిబొడ్డు. అక్కడ ఉన్న 1893 నాటి భవనం ఇప్పుడు అలాగే ఉండే అవకాశం లేదు. అది ఇప్పుడు పెద్ద ఆర్ట్ గ్యాలరీగా మార్చేశారు. అందులో ఉన్న కన్వెషన్ హాల్స్ అన్నీ కూడా చిన్నగా చేసి ఆడిటోరియమ్స్ కట్టి అక్కడక్కడ గ్యాలెరీలు అభివృద్ధి చేశారు. అది అనేక అంతస్థులు కలిగి ఉన్నది. ఇలాంటప్పుడే వెనకాల ఏదో దైవికమైన కారణం ఉంటుంది అనిపిస్తుంది.

నా అదృష్టం ఏమిటో, నేను వెళ్ళినప్పుడు ఆశ్చర్యం అక్కడ రిసెప్షన్ దగ్గర ఉన్న అమెరికన్ ఒక పేపర్ నా చేతికి ఇచ్చాడు. ఆ పేపర్ చూసి నేను ఆశ్చర్యపోయాను. 'ఇక్కడే స్వామి వివేకానంద మొట్టమొదట మాట్లాడాడు' అని ఆ పేపర్లో వ్రాసి ఉంది. ఇన్ని జరిగితే కేవలం ఆయనదే ఎందుకు చెప్పారు? మరొక ఆశ్చర్యకరమైన అంశం అక్కడ స్టెయిర్ కేస్ మేడ మీద దాకా వెళుతున్నప్పుడు ప్రతి మెట్టు మీద నుంచి మనం చదువుకోవడానికి వీలుగా ఎలక్ట్రానిక్ లైటింగ్‌తో స్వామి వివేకానంద మొదటి ఉపన్యాసం అంతా పెట్టి ఉంచారు. అంతమంది ఆ సభకు పేపర్లు సబ్మిట్ చేసినా ఆయనదే ఎందుకు మిగిలిపోయిందో అర్థం కావడం లేదు.

మూడవరోజు ప్రవచనం చేసి బయటకు వస్తూ ఉంటే వెనకాల అనుకుంటున్నారట "విగ్రహారాధన మతంలోంచి వచ్చాడు కానీ, భలే మాట్లాడాడు" అని. మరుసటి రోజు – "మనం ఇంతకాలం భారతదేశంలో పుట్టిన హిందూమతాన్ని ఒక ఆటవికమైన, అనాగరికమైన విగ్రహాలను పూజించే మతంగా భావిస్తూ ఉన్నాం. ఇది కేవలం మన అహంకారంతో ఏర్పరచుకున్న అభిప్రాయం. మనం భారత దేశానికి కొత్తమతాలు చెప్పవలసిన అవసరం లేదు. హిందూమతం నుంచి మనందరం నేర్చుకోవలసింది చాలా ఉంది" అని అమెరికాలో ఉన్న ప్రతి ఇంగ్లీషు పత్రికలు వ్రాసినవి తేదీలతో సహా ప్రమాణాలుగా

ఉన్నాయి.

ఓంకారం విశ్వమంతా వ్యాపించిన విశ్వానికి అతీతుడైన ఒకే పరమాత్మను తెలియజేస్తుంది. ఆ పరమాత్మను మీరు ఏ రూపంతో ఆరాధించినా ఆయనకే చెందుతుంది. కనుక ఓంకారం ప్రధానంగా పెట్టుకుని మంత్రాలన్నీ పెట్టుకోవడానికి కారణం అదే. **హిందువు తన ధర్మాన్ని ముఖ్యమైనదిగా భావించడం లేదు. అదే ఇప్పుడు వచ్చిన సమస్య. ఇతరులు మాత్రం తమ ధర్మాన్ని ముఖ్యమైనదిగా భావిస్తున్నారు. వారికి 'నా ధర్మం గొప్పది. ఇదే ప్రపంచాన్ని బాగుచెయ్యగలదు. మేము మార్పు చేస్తాం. మార్పు చేసినా తప్పేమీ లేదు' అని వారు అనుకుంటున్నారు. వారిని ఏమీ అనవద్దు. ఆ భావం మనకెందుకు లేదని ప్రశ్నించుకుందాం.** వారి ధర్మంపై వారికి అంత ప్రేమ ఉన్నప్పుడు... యుగాల క్రితమే పుట్టిన మన ధర్మం మీద మనకెందుకు అంత ప్రేమ లేదు? మనకంత పట్టింపు ఎందుకు లేదు? అదే మనలో లుప్తం అవుతోంది.

## హిందువుల నేటి కర్తవ్యం

హిందువు ఏడాదికోసారి కొండకు వెళ్ళి దండం పెడితే చాలు అనుకుంటున్నారు. ఇంట్లో ఏ కార్తికమాసంలోనో పట్టుబట్టను కష్టం మీద కట్టుకుని సత్యనారాయణ వ్రతం చేసేసి హిందువునని చలామణి అయిపోతున్నాడు. కానీ హిందువుగా జీవించడం లేదు. హిందువుగా జీవించాలి. హిందూ భావాన్ని పట్టుకోవాలి. హిందూ ధర్మాలను అధ్యయనం చెయ్యాలి. అది జీవితంలోకి తెచ్చుకునే ప్రయత్నం చెయ్యాలి. అంతే తప్ప ఇతర మతాలను నిందించనక్కరలేదు.

ఇతర మతాలు మార్పిడులు చేస్తున్నారని అనకూడదు కూడా. ఎలా తయారవ్వాలంటే వారు చెప్పిన వాటికి మనం సమాధానం చెప్పగలగాలి. ఇతరులను గౌరవించడం మన సంస్కారం. ఇతర మతాలను అవమానిస్తూ, విమర్శిస్తూ మతాలను మార్చుతారు వారు. ఇతర మతాలను నిందించకుండా, ద్వేషించకుండా మన ధర్మాన్ని చెప్పుకుని బ్రతకగలిగే శక్తి మనకు ఉంది. ఇది ఎలా చెయ్యాలి? కొంచెం ఆలోచనా ధోరణి మార్చుకుంటే చాలు.

ఎవరైనా వచ్చి మనకొక పుస్తకం ఇవ్వబోతే వారికి ముందు ఈ పుస్తకం తీసుకో అని చెప్పి వారి చేతిలో భగవద్గీతో, రామాయణమో పెట్టండి. తారెత్తి క్రింద పడతారు. "నేను ఇది పుచ్చుకోను" అన్నారనుకోండి, "నేను కూడా నువ్వు ఇచ్చేది పుచ్చుకోను" అనండి. వారొక్కసారి వారి ప్రభువుని ఎలుగెత్తి పిలవగానే, మీరూ 'రామా! కృష్ణా!' అని ఎలుగెత్తి పిలవండి. నోరు మూసుకుని వెళతారు. వారికి ఎంత పిలిచినా ఒక పిలుపే. మన గొంతులోంచి వేల పిలుపులు పిలవగలం. ఎందుకంటే వెయ్యి నామాలు ఉన్నాయి కదా అందరికీ! **'విశ్వం విష్ణుర్వషట్కారః భూత భవ్య భవత్ప్రభుః'** అంటే కళ్ళు తిరిగి వెళిపోతారు.

"నీ కొరకు నేను ప్రార్థన చేసెదను" అంటే "నా ప్రార్థన నాకు ఉంది" అని 'ఎవ్వని చే జనించు జగము' వంటిది వారికి నేర్పండి, వెళిపోతాడు. ఈ తెలివి తేటలు తెచ్చుకోవాలి. ఇతరులను ద్వేషించకపోవడం అనేది మన మతం మనకు నేర్పిన సంస్కారం.

## దీనికి ఒక చిన్న కథ చెప్పుకోవచ్చు

ఒక ఊరిలో ఒక కుటుంబం ఉంది. భార్య, భర్త, పిల్లలు. చక్కగా కాలం గడుస్తోంది. కలిగిన కాడికి తింటూ అందరూ హాయిగా ఉన్నారు. ఒకసారి పిల్లలు స్కూల్‌కి వెళ్ళారు. భర్త ఆఫీస్‌కి వెళ్ళాడు. ఆ ఊరిలో ఒక పెద్ద ఇంటర్నేషనల్ మ్యారేజ్ బ్యూరో సంస్థ ఉంది. వారు ఏడాదికి వారి తరపున ఇన్ని సంబంధాలు ఖరారు చెయ్యాలని టార్గెట్ పెట్టుకున్నారు. దాని కోసం ఉద్యోగస్థులను నియమించారు.  వారు ఇంటింటికీ వెళ్ళడం, ఆ ఇంట్లో ఎవరికి పెళ్ళి కాలేదో తెలుసుకోవడం, వారికి సంబంధాలు చూపించడం, సంబంధాలు చెప్పడం వారి పని. వారిదేమీ తప్పు లేదు. వారి భుక్తి కోసం వారు పని చేస్తున్నారు.

సరే వారు వచ్చి తలుపు తట్టారు. 'అమ్మా! మేము ఫలానా పెళ్ళిళ్ళ సంస్థ నుంచి వచ్చాం. కొత్త కొత్త సంబంధాలు తెచ్చాం. చూస్తారా?' అని అడిగారు. అప్పుడు ఆమె ఏమి చెప్పాలి? "నాకు ఇప్పటికే పెళ్ళి అయింది. భర్త ఉన్నాడు.

అక్కరలేదు, వెళ్ళు" అని చెప్పాలి.

అంతే కానీ "ఏవో కొత్త సంబంధాలు వచ్చాయి కదా! కూర్చో చూద్దాం!" అనొచ్చా? ఎలాగూ ఇంక వాడు చెప్తాడు – ఫలానా సంబంధం ఉంది, వాడికి బోలెడంత ఆదాయం, వాడు సెకండ్ మ్యారేజ్‌కి కూడా రెడీ... ఇవి చెప్పగానే వెంటనే "నా మొగుడి కంటే ఆ మొగుడికి ఆదాయం ఎక్కువ. అందం కూడా ఎక్కువ. కొంచెం ప్రయత్నిద్దామా?" అనుకుంటే ఎంత దోషమో, మన మతం నుంచి మరో మతంలోకి మారడం అంతే దోషం. వారిది తప్పు లేదు, వారి టార్గెట్ వారు పూర్తి చేసుకోవడానికి మన ఇంటి తలుపు తట్టారు. తప్పంతా "నాకు ఇప్పటికే ఒక మొగుడు ఉన్నాడు, మరొక మొగుడు అక్కరలేదు" అని చెప్పలేదే... అది ఆవిడ తప్పు.

అలాగే మతం లేని వారికి మతం ఇచ్చుకోండి. ఇప్పటికే పుష్టి కలిగిన మతంలో ఉన్న మనకు ఇది అవసరం లేదు. ఈ ఒక్క విషయం సామాన్య ప్రజలకు అందించడం చాలా ప్రధానం. ఈ సమయంలో మన ధర్మం మీద వారు వేసే అనేక రకాల విమర్శలు... సానుకూలంగా ఉన్నవాటిని కూడా ప్రతికూలంగా చూపిస్తూ ఉంటే ఆలోచించని పరిస్థితిలో ఉన్నాం.

## విగ్రహారాధనలోని విజ్ఞానం

విగ్రహారాధన గురించి మాట్లాడేటప్పుడు చాలా మంది విమర్శించడం కనబడుతుంది. విగ్రహారాధనని విమర్శించి మన మతాలను మార్చడానికి ప్రయత్నించే వారికి విగ్రహాలు లేవా? ఒక్కసారి ఆలోచించండి. ఇప్పుడు ఈ మతమార్పిడి సంస్థలు వారి మత కేంద్రాలు పెట్టిన చోట్ల వారిని విగ్రహాలుగా పెట్టే ఆకర్షిస్తున్నారు కదా! విగ్రహం అంటే వారూ ఒక ప్రతీక పెట్టుకుంటున్నారా, లేదా? ఏదో ఒక గుర్తు వారూ పెట్టుకుంటున్నారు. ఆ గుర్తు లేనిదే వారికి భగవంతుడు గుర్తు రాడు.

విగ్రహం అనే దానికి మన సంస్కృతిలో పేరు 'లింగం'. లింగం అంటే

శివలింగం అని మాత్రమే కాదు. అసలు హిందూ మతస్వరూపం అర్థం చేసుకోవడం లేదు. లింగం అంటే భగవంతునికి గుర్తు. శంకరభగవత్పాదులవారు పాండురంగక్షేత్రానికి వెళ్ళి పాండురంగస్వామిని కీర్తిస్తూ "పరబ్రహ్మ లింగం భజే పాండురంగం" అన్నారు. లింగం అనేది పరబ్రహ్మమును గుర్తు చేస్తుంది. దాని సంకేతం. దీనికే ప్రతీక, సంకేతం అని కూడా చెప్తారు.

విగ్రహంలో కూడా హిందువు భగవంతుని ఆరాధిస్తాడు కానీ, విగ్రహాన్ని మాత్రమే ఆరాధించడు. సామాన్యులు విగ్రహంలో ఆరాధిస్తారు, మహాత్ములు ప్రపంచమంతా పరమేశ్వరుని చూస్తారు అని కొందరు అంటుంటారు. వినడానికి బాగుంది. కానీ ప్రపంచమంతా ఉన్న పరమేశ్వరునే విగ్రహంలో చూడాలని తెలుసుకోవాలి.

విగ్రహం అనే శబ్దానికి అర్థం **'విశేషేణ గ్రహతి ఇతి విగ్రహం'**–అంటే విశేషంగా దైవశక్తిని గ్రహించునది విగ్రహం. విగ్రహారాధన గురించి మాట్లాడేటప్పుడు మన క్షేత్రాలు, ఆలయాలు వస్తాయి. భారతీయుల ఆలయవ్యవస్థ చాలా విశేషమైనది. దేవాలయ వ్యవస్థకి ఆధారం – ఆగమాలు, నిగమం.

కొంతమంది చరిత్ర పరిశోధకులమనే హిందూప్రీతి కలిగిన పండితులు కూడా కొన్ని చోట్ల పొరపాటు పడేది ఏమిటంటే – "మన ఆలయాలు అన్నీ కూడా బౌద్ధమతం తరువాత వచ్చాయి... బౌద్ధమతానికి పూర్వం లేవు" అని అంటూ ఉంటారు. కానీ మనకు దేవతాయతనములు ఉండేవి అని రామాయణంలో అనేకచోట్ల వర్ణించారు.

రామచంద్రమూర్తికి మొట్టమొదట పట్టాభిషేకం చేసేటప్పుడే దేవతాయతనాలన్నీ అలంకరించారని అంటారు. రామచంద్రమూర్తి తిరిగి వనం నుంచి అయోధ్యకి వచ్చేటప్పుడు దేవతాయతనాలన్నీ అలంకరించబడి ఉన్నాయని వర్ణించారు. భారతంలో పాండవులు అనేక క్షేత్రయాత్రలకి వెళ్ళినట్లు కనబడుతుంది. నిజానికి క్షేత్రం, ఆలయం, విగ్రహం గురించి తెలుసుకొంటే విగ్రహారాధన గురించి స్పష్టమైన జ్ఞానం ఏర్పడుతుంది. భారతీయులకు క్షేత్రం అనేది ధర్మంలో

ప్రధానమైనది.

## తీర్థయాత్ర-క్షేత్రయాత్ర

తీర్థయాత్ర, క్షేత్రయాత్ర అనేవి హైందవధర్మంలో ఒక ప్రధానమైన అంశంగా చెప్పారు. సంవత్సరంలో ఒకసారి భారతదేశంలో ఉన్న కొన్ని క్షేత్రాలకైనా వెళ్ళడం అనే ఒక ప్రక్రియ పెట్టుకోవాలి. ఇది చాలా ప్రధానం. హిందూ కర్తవ్యాలలో ఇది ఒకటి.

ఇళ్ళలో చేసే సాధన కంటే తీర్థయాత్రలలో చేసే సాధన అధికంగా ఫలిస్తుంది. అక్కడ దైవశక్తి కేంద్రీకృతమై ఉంటుంది. అక్కడకు వెళ్ళి చేసే సాధన గొప్పది. పచ్చికట్టెని మండించడం మహాకష్టం. ఎండుకట్టెని ఇలా మంట పెడితే అలా మండుతుంది. అలా ఎండుకట్టెకి మంట పెడితే తొందరగా మండినట్టు, క్షేత్రాలలో చేసే భగవదారాధనకి చాలా శక్తి ఉంటుంది.

'భగవంతుడు అంతటా ఉన్నప్పుడు క్షేత్రాలకి ఎందుకు వెళ్ళడం?' అని కొందరు చెప్తూ ఉంటారు. భగవంతుడు అంతటా ఉన్నాడు అని చెప్పిన వారే క్షేత్రాలు కూడా చెప్పారంటే ఎందుకు చెప్పారో ఆలోచించాలి. భగవంతుడు అంతటా ఉన్నాడు అనేది దర్శించగలిగిన శక్తి ఏ ఒక్కనికో ఉంటుంది... కానీ అందరికీ రాదు.

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః**
**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః** (శ్రీమద్భగవద్గీత)

అన్నాడు పరమాత్మ. సర్వమూ పరమాత్మయే అనే ఎరుక కలిగినవారు ఒక్కరు ఉండడం కూడా కష్టమే. భగవంతుడు అంతటా ఉన్నాడన్న మాటను అందరూ చెప్తారు. కానీ భగవంతుని అంతటా అనుభవించేవారు ఏ ఒక్కరో ఉంటారు.

సాధకులలో **అనేవారు, అనుకునేవారు, అనుభవించేవారు** అని ముగ్గురు ఉంటారు. కొందరు ఊరికినే అంటూ ఉంటారు. కొందరు అనుకుంటూ ఉంటారు. దీని కంటే కొంత నయం. కొందరు అనుభవిస్తారు. అనడం నుంచి

అనుకోవడంలోకి వెళ్ళాలి, అనుకోవడం లోంచి అనుభవించడంలోకి వెళ్ళాలి. అనుభవించే స్థాయికి వెళితే ప్రపంచమంతా పరమేశ్వరుడే. ఎవరికైతే ఎక్కువ-తక్కువ, వేడి-చలువ, సుఖము-దుఃఖము, లాభం-నష్టం అనే రెండు భేదాలు ఉండవో అటువంటి వారి దృష్టిలో అంతా బ్రహ్మమే. కానీ ఇంకా సుఖము-దుఃఖము, వేడి-చలువ అనే భావం ఉన్నంత వరకు అంతా ఒక్కటే అనడానికి లేదు.

**నిస్త్రైగుణ్యే పథి విచరితే కో విధిః కో నిషేధః**

ఏ స్థాయిలో మాట్లాడవలసిన మాటను, ఏ స్థాయిలో మాట్లాడుతున్నారో తెలుసుకోవాలి. ఎంతవరకైతే మంచి-చెడు, నేను-నువ్వు, సుఖం-దుఃఖం, లాభం-నష్టం, రాగం- ద్వేషం అనే ద్వంద్వాలు ఉంటాయో అంతవరకూ వారు భగవంతుని సర్వత్రా దర్శించలేరు. ఒక శుద్ధమైన స్థానంలో, ఒక శుద్ధమైన ప్రతీకలోనే దర్శించాలి. అంతటా భగవంతుడైతే కొన్నిటిలోనే ఎందుకు దర్శించాలి? అని ప్రశ్న రావచ్చు. దీనికి ఒక చిన్న ఉదాహరణ చెప్పుకుందాం.

ఒక దీపం పెట్టి దానికి రెండు వైపులా నలుపు, తెలుపు రంగుల గాజు పెట్టండి. రెండు రంగుల గాజులలో నుంచి దీపకాంతి వస్తుంది. ఇప్పుడు దీపకాంతి తెల్లగాజులోనూ ఉంది, నల్లగాజులోనూ ఉంది. రెండిటిలో సమానంగా కాంతి ప్రసరిస్తోంది. కానీ దీపం అసలు స్వరూపం నల్లగాజులో నుంచి చూడలేం అది తెల్లగాజులోంచే చూడగలం. అదేవిధంగా భగవంతుడు అంతటా వ్యాపించి ఉన్నప్పటికీ ఉపాధులలో ఉన్న దోషాల వల్ల అందరిలో, అన్నిటిలో భగవంతుని దర్శించలేం. కొన్నిటిలో, కొందరిలో మాత్రమే దర్శించగలం.

సూర్యకాంతి బండరాయి మీద పడుతుంది, అద్దం మీదా పడుతుంది. కానీ బండరాయి మీద పడ్డ సూర్యకాంతి తిరిగి సూర్యకాంతిని ఇవ్వలేదు, అద్దంలో పడిన సూర్యకాంతి తిరిగి సూర్యకాంతిని ఇవ్వగలదు. అద్దము, బండరాయి - రెండిటి మీద సూర్యకాంతి సమానంగా ఉన్నా, అద్దమనే ఉపాధి ద్వారా సూర్యుని పొందగలుగుతున్నాం. బండరాయి ఉపాధి ద్వారా పొందలేకపోతున్నాం. అలాగే

భగవంతుడు సర్వవ్యాపకుడైనా కొన్ని చోట్ల మాత్రమే ఆ భగవత్‌శక్తిని తెలుసుకోగలం. ఇది గ్రహించగలిగితే చాలు.

ఉదాహరణకి కాశీక్షేత్రంలో గంగానదికి వెళ్ళి ఒకరు కేదారఘాట్‌లో స్నానం చేశారు. ఇంకొకరు దశాశ్వమేధఘాట్‌లో స్నానం చేశారు. ఇద్దరూ కేదారఘాట్‌లో చేశామని, అశ్వమేధఘాట్‌లో చేశామని చెప్తే తప్పేం లేదు కానీ ఇద్దరు చేసిందీ గంగలోనే అనే స్పృహ ఉంటే చాలు. ఆ స్పృహ లేకుండా, దశాశ్వమేధఘాట్‌లో చేస్తే మంచిదా, కేదారంలో చేస్తే మంచిదా... అని కొట్టుకుంటే దానిని అజ్ఞానం అనాలి.

అలాగే భగవంతుడు గంగ అయితే – ఒక క్షేత్రం, ఒక ఉపాసన ఒక ఘట్టం లాంటిది అని తెలుసుకోవాలి. ఎంత గంగ ప్రవహించినా స్నానం చెయ్యాలంటే స్నానఘట్టం ద్వారా వెళ్ళాలి కానీ కొండ మీద నుంచి గంగను చూసి దభీమని దూకితే ప్రాణాలు మిగలవు. నదికి స్నానఘట్టాలు ఉన్నట్లు భగవదారాధనకి క్షేత్రాలు ఉంటాయి. మన క్షేత్రాల గురించి అర్థం చేసుకోవడానికి, మన క్షేత్రాలను, తీర్థాలను ఎద్దేవా చేసేవారు వీధికొక ప్రార్థనా మందిరం ఎందుకు నిర్మిస్తున్నారో అడగండి.

సర్వవ్యాపకమైన బ్రహ్మమునే మనం క్షేత్రాలు, తీర్థాలలో పెట్టుకున్నాం. దేవాలయం అనే వ్యవస్థ అదృష్టవశాత్తు హిందువులకు మాత్రమే ఉంది. మిగిలినవారికి ప్రార్థనా నిలయాలు మాత్రమే ఉన్నాయి. పేర్లు మార్చుకుంటున్నారంతే. దైవశక్తిని కేంద్రీకృతం చెయ్యడానికి క్షేత్రం, దేవాలయం పుట్టింది.

**కేంద్రీకృతం ఎలా చేస్తారు? సర్వవ్యాపకమైన భగవంతుడు ఒకచోట కేంద్రీకృతం ఎలా అవుతాడు?** దీనికి ఒక పెద్ద ఉదాహరణ చెప్పవచ్చు.

భూమి మీద ఎండ ప్రసరిస్తూ ఉంది. ఆ ఎండలో ఒక కాగితాన్ని పెడితే అది కాలదు. కానీ అదే ఎండలో భూతద్దాన్ని ఆ కాగితం పైన పెడితే కొంతసేపటికి ఆ కాగితం కాలిపోతుంది. ఇప్పుడు కాగితాన్ని కాల్చింది భూతద్దమా, ఎండా?

అని ప్రశ్న వేసుకుందాం. భూతద్దమే కాల్చితే... నీడలోకి తీసుకుని వస్తే అది కాల్చలేదు. మరి కాల్చినదేది? ఎండ. ఎండ కాల్చగలిగితే ముందు ఎందుకు కాల్చలేదు? ఇది ఆలోచించవలసిన అంశం.

అదే ఎండ భూతద్దం ద్వారా కేంద్రీకృతం అయితే కాల్చ గలిగింది. అదేవిధంగా అంతటా వ్యాపించిన భగవంతుడు ఒక క్షేత్రంలో కేంద్రీకృతమైతే మనలను అనుగ్రహించగలడు. మన పాపాలను దహనం చెయ్యగలడు. అలా భగవచ్ఛక్తిని కేంద్రీకృతం చెయ్యాలంటే ఏం చెయ్యాలి? ఏకాగ్రత ఉండాలి. అయిదు నిమిషాలు ధ్యానం చెయ్యమంటేనే అయిదు వందల ఊర్లు మనసులో తిరిగి వస్తాం. ధ్యానం అనేది చేసేటప్పుడు ఏకాగ్రత అవసరం. ఆ ఏకాగ్రత ఉన్నవారు ఎవరో ఉంటారు. అటువంటివారి వల్ల క్షేత్రం ఎలా ఏర్పడుతుందో పరిశీలిద్దాం.

భగవంతుడు సర్వవ్యాపకుడైనప్పటికీ జీవులను అనుగ్రహించడం కోసం క్షేత్రరూపంలో, కాలం రూపంలో, పుణ్య తిథుల రూపంలో ఉన్నాడు అని శాస్త్రం చెప్తోంది. కాలం, దేశం – స్పేస్ అండ్ టైమ్ – ఈ రెండూ భగవత్ స్వరూపాలే.

**కాలమంతా భగవత్ స్వరూపమే. మరి కాలమంతా భగవత్ స్వరూపమే అయినప్పుడు ఈ తిథి మంచిది, ఆ తిథి మంచిది కాదు, ఈ రోజు మంచిది, ఆ రోజు మంచిది కాదు అని చెప్తారేంటి?** అనే దానికి సమాధానం.

అన్ని రోజులూ ఒక్కటే అని చెప్పడానికి విజ్ఞానం(సైన్స్) అక్కరలేదు. ఏ రోజు ఎందుకు గొప్పదో చెప్పడానికే విజ్ఞానం (సైన్స్) కావాలి. అన్ని నీళ్ళు ఒక్కటే అన్నాడు ఒకాయన. కానీ ఏ నీళ్ళలో క్రిములు ఉన్నాయో, ఏ నీళ్ళలో క్రిములు లేవో చెప్పడానికి విజ్ఞానం(సైన్స్) కావాలి. ఆ విజ్ఞానం(సైన్స్) పేరు హిందూమతం. ఒక తిథి, ఒక పర్వం, ఒక నక్షత్రం – కానీ ఒక్కటి గుర్తు పెట్టుకోవాలి, ఏ రోజూ చెడ్డది కాదు, ఏ తిథి చెడ్డది కాదు. దేనికి, ఏది మంచిదో తెలుసుకోవాలి.

ఏ తిథి దేనికి మంచిది? ఏ తిథి దేనికి చెడ్డది? అలాగే జ్యోతిషశాస్త్రం మీద అవగాహన ఏర్పడితే ఇవన్నీ తెలుస్తాయి. కాలంలో గొప్పతనం చెప్పడానికి

కాలంలో ఘట్టాలు తిథులు, నక్షత్రాలు. అలాగే దేశంలో ఘట్టాలు క్షేత్రాలు. ఒక కాలంలో ఒక పని చేస్తే ఒక ఫలితం ఉంటుంది. వానలు పడినప్పుడు విత్తనాలు వేస్తే మంచి పంట ఉంటుంది. మండువేసవిలో నాగలి పట్టుకు వెళితే ఏం ప్రయోజనం? కనుకనే ఆయా ఋతుకాలాలలో ఆయా క్రియలు చేసినప్పుడు, ఆయా ఫలాలు ఎలా పొందగలమో – ఆయా తిథులలో, ఆయా క్రియలు చేసి ఆయా ఫలాలు పొందగలం. అంతే తప్ప చెడ్డ తిథి లేదు, చెడ్డ రోజు లేదు. దేనికి ఏది మంచిదో తెలుసుకోవడం వరకే మనం చేసే ప్రయోజనం.

అలా క్షేత్రాల గురించి మాట్లాడాలంటే **'కాలరూపీ జనార్దనః', 'క్షేత్రరూపీ జనార్దనః'** – ఇదే మాటను శివపురాణం **'కాలరూపో మహేశ్వరః' 'క్షేత్రరూపో మహేశ్వరః'** అని చెప్పింది. ఏకేశ్వర ప్రతిపాదన ముందు చెప్పుకొన్నాం. ఒకొక్క క్షేత్రంలో ఒకొక్క ప్రత్యేకత కనబడుతుంది. అలా క్షేత్రాలు మూడు భాగాలు చెయ్యాలి. ఒకటి స్వయంభూ క్షేత్రాలు, రెండవది సిద్ధప్రతిష్ఠిత క్షేత్రాలు, మూడవది మానవ ప్రతిష్ఠిత క్షేత్రాలు. ఈ మూడూ శక్తిమంతమే. వేటి శక్తి వాటిదే.

**స్వయంభూ** అంటే – భగవంతుడు తనని తాను వ్యక్తపరచుకున్న చోటు. అంతటా వ్యాపించి ఉన్న భగవంతుడు ఒక చోటు నుంచి వ్యక్తమవుతాడు. తీగ అంతా విద్యుత్తు వ్యాపించి ఉన్నా – ప్లగ్ పాయింట్లోంచి, హోల్డర్లోంచి విద్యుచ్ఛక్తిని ఎలా పొందుతున్నామో, భగవంతుడు అంతా వ్యాపించినా క్షేత్రంలోంచి భగవచ్ఛక్తిని అలా పొందుతున్నాం. అక్కడే పొందగలం. అలా ఒకొక్క క్షేత్రానికి ఒకొక్క ప్రత్యేకత కనబడుతుంది. తనని తాను వ్యక్త పరచుకుంటే స్వయంభూ. అదే ఋషులు, దేవతలు ప్రతిష్ఠ చేస్తే **'సిద్ధ క్షేత్రం'.**

మానవుడు శాస్త్రనియమాలను అనుసరించి పద్ధతిలో దీక్షగా ప్రతిష్ఠిస్తే అవి **'మానవ ప్రతిష్ఠిత క్షేత్రాలు'.** స్వయంభూ క్షేత్రాలలో భగవంతుడు ఆలయరూపంలో, విగ్రహరూపంలో ఉండాలని నియమం ఏం లేదు. స్వయంభూ క్షేత్రానికి క్షేత్రంలోనే భగవంతుడు ఉంటాడు. క్షేత్రమే భగవత్ స్వరూపం. అది పూర్వకాలంలో సిద్ధపురుషులు, ఋషులు, సాధకులు, యోగులు వెళ్ళేటప్పుడు వారి తపశ్శక్తి

చేత ఆ క్షేత్రంలో మామూలు కంటికి కనబడకున్నా తేజోరూపంలో ఉన్న దేవతలను వారు గ్రహించేవారు, ఉపాసన చేసేవారు.

ఆ సూక్ష్మమైన భగవచ్ఛక్తి అక్కడ ఉంది అని చెప్పడం కోసం ఆలయాలను, దేవతలను, విగ్రహాలను ఏర్పాటు చేశారు. ఒకావిడ ఆ మధ్య కైలాస మానససరోవరం వచ్చి కొబ్బరికాయ పట్టుకుని తిరుగుతోంది. ఏంటమ్మా? అని అడిగితే 'ఇక్కడ శివాలయం ఎక్కడ ఉంద'ని అడిగింది. కైలాసమే శివుడు.

ఈ చాదస్తాలు ఉంటాయి. శాస్త్రం ఒకటి చెప్తోంది. చాదస్తం మరొకటి చేస్తుంది. వారికి వారు కొన్ని పెట్టేసుకుంటూ ఉంటారు. మా తాత చేశారు, మామ్మ చేసింది. వారు నిజానికి శాస్త్రాన్ని అనుసరించి చేశారో, లేదో తెలియదు. అతిక్రమిస్తే పూర్తిగా అతిక్రమించడం, లేకపోతే అతిగా చెయ్యడం – రెండూ ప్రమాదమే. శాస్త్రం ఏమి చెప్పిందో అది చేస్తే అసలు గొడవలే లేవు. ఇన్ని లక్షలు ఖర్చు చేసుకుని నేను కైలాస మానససరోవరం వస్తే ఒక్క శివాలయం లేదే అని ఆవిడ చాలా నిరుత్సాహపడింది. కైలాసంలో శివాలయం కాదు. కైలాసమే శివాలయం అని చెప్పాల్సి వచ్చింది.

అదేవిధంగా శేషాచలం. శేషాచలం కొండ మీద వేంకటేశ్వరుడు అంటారు. కానీ శాస్త్రం ఏమి చెప్తోందంటే శేషాచలమే వేంకటేశ్వరుడు. కొండ మీదే దేవుడు కాదు... కొండే దేవుడు అన్నారు. వేంకటాచలమే దేవుడు. అదే విధంగా అరుణాచలం. అచలమే దేవుడు. గోవర్ధనగిరి – గోవర్ధనమే దేవుడు. ఆ క్షేత్రంలో ఆ శక్తి తేజఃస్వరూపంలో ఉంటుంది. మానవుల సాధారణ దృష్టికి గోచరించదు.

మన కంటికి కనబడలేదని దైవశక్తిని లేదంటామా? తపశ్శక్తికి కనబడుతుంది. అదొక దృష్టి... ఆ దృష్టి లేనప్పుడు విశ్వాసం ఉండాలి. దృష్టి ఉంటే దర్శనం వస్తుంది, విశ్వాసం ఉంటే భావం వస్తుంది. ఒక క్షేత్రం గురించి, దేవత గురించి ఒక ఋషి చూసి చెప్తాడు. ఋషి చూసి చెప్తే ఆయన చెప్పిన దానిని నమ్మి దండం పెడదాం. అంతే. మనం నమ్మితే ఎప్పటికైనా చూస్తాం. ఆయన చూసింది నమ్ముదాం. 'నేను కనబడితేనే నమ్ముతాన'ని ఒకాయన అన్నాడు. 'నమ్మితే కాని

కనబడదు నాయనా!' అని చెప్పవలసి వచ్చింది.

ఒక క్షేత్రంలో భగవంతుడు తనని తాను ఎందుకు వ్యక్తపరచుకుంటాడో తెలుసుకోవాలి. ఒక మహాత్ముడు లోకక్షేమం కోసమో, లేదా తన ద్వారా ఒక మంచి జరగాలనో తనకి ఆ శక్తి సరిపోవడం లేదని భగవత్‌శక్తిని ఆరాధిస్తాడు. మనం భగవంతుడు ఇచ్చిన శక్తులతోనే పని చేస్తున్నాం.

ఒక కడివెడు నీళ్ళు గంగలోవి తెచ్చుకుంటాం. అది ఖాళీ అయ్యాక మళ్ళీ గంగ లోంచి నింపుకుంటూ ఉంటాం. అదేవిధంగా మన శరీరం అనే చిన్న కడవలో ఈశ్వరశక్తి ఉంటుంది. ప్రతి రోజు సెల్ ఫోన్‌ని ఎలా ఛార్జ్ చేసుకుంటామో అలా మన శరీరాన్ని కూడా ఈశ్వరశక్తితో ఛార్జ్ చేసుకోవాలి. అందుకే ఆరాధన, అనుష్ఠానం, ఉపాసన అన్ని ఉన్నాయి. అవి లేకుండా ఏమి చేస్తే లాభం ఏమిటి? ఇచ్చిన శక్తి వాడుకుంటూ ఉంటే అయిపోతుంది. ఇచ్చిన శక్తిని ఎప్పటికప్పుడు భగవత్ శక్తితో అనుసంధానం చేసుకుంటూ ఉంటే మనలో దివ్యశక్తి పెరుగుతుంది... ఇది ఒకటి. రెండవది – ఈ శక్తి అంతా ఈశ్వరుడే అనే జ్ఞానం కలుగుతుంది. ఈ రెండిటి కోసం ఆరాధన చెయ్యాలి.

మన శక్తి ఇంకా అభివృద్ధి చెందడం కోసం, మనలో ఉన్న శక్తి అంతా భగవంతుడే అనే తెలివి కోసం ఆరాధన చెయ్యాలి. ఈ తెలివి వస్తే అహంకారం పోతుంది. ఏది జరిగినా ప్రయోజనమే. మహాత్ములు ఒక క్షేత్రాన్ని ఎంచుకుని, దానిని ముందు వారు తమ మంత్రశక్తితో, తపశ్శక్తితో పవిత్రం చేస్తారు. పవిత్రం చేసుకుని అక్కడ కూర్చుని సాధన చేస్తారు. ఆ సాధనే తపస్సు. అది జపం, ధ్యానం, అర్చన, స్తోత్రం ఏదైనా కావచ్చు. **నియమానికి కట్టుబడి చేసే సాధన పేరు తపస్సు.**

కఠోరమైన నియమంతో ఏకాగ్రంగా తపస్సు చేస్తారు. తపస్సు ఎంత వరకు చెయ్యాలంటే... పండే వరకు. దీనిలో పెద్ద ప్రశ్న ఏముంది? బియ్యం పొయ్యి మీద ఎంత వరకు పెట్టాలి అంటే ఉడికే వరకు, అంతే.

తపశ్శక్తి వల్ల సాధనంతా అక్కడ ఏకాగ్రమైపోతుంది. అప్పుడు ఆ తపస్సుకు

సంతోషించి భగవంతుడు తనని తాను వ్యక్తపరచుకుంటాడు. ఎలా వ్యక్తపరచుకుంటాడంటే ఆయన తపస్సు ఏ భావంతో చేశాడో ఆ భావానికి అనుగుణంగా వ్యక్తపరచుకుంటాడు. పరమాత్మను శివభావంతో చేస్తే శివరూపంతో వ్యక్తమవుతాడు. విష్ణుభావంతో చేస్తే విష్ణురూపంతో వ్యక్తమవుతాడు. ఇప్పుడు ఆ చోటులో రెండు శక్తులు వచ్చాయి. ఇంత కాలం ఆయన చేసిన తపస్సు యొక్క శక్తి. తపశ్శక్తి ఆవిర్భవించిన భగవంతుని శక్తి. రెండూ అక్కడ కలిసి ఉంటాయి. అప్పుడు భగవంతుడు తపస్సు చేసిన వానికి ఫలితం ఇచ్చిన తరువాత– "నన్ను ఎలా అనుగ్రహించావో అందరినీ అలా అనుగ్రహించడం కోసం ఇక్కడ నువ్వు ఉండాలి" అని కోరుకుంటే, భగవంతుడు సంతోషించి అక్కడ ఉంటాడు. అలా ఏర్పడిన దాని పేరు క్షేత్రము.

క్షేత్రం అనే మాట లోకంలో వ్యవహరిస్తూ ఉంటాం. క్షేత్రం అంటే తెలుగులో పొలము అని అర్థం. పొలము అంటే పండించుకునే చోటు. క్షేత్రం అంటే మన ఆధ్యాత్మిక సాధన పండించుకునే చోటు. అంతే కాదు... ఫీల్డ్ అంటే ఎనర్జీ ఫీల్డ్. శక్తి యొక్క కేంద్రమే క్షేత్రము. క్షేత్రం ఎలా ఏర్పడిందో చెప్పుకున్నాం. ఆ విధంగా భగవంతుని సాక్షాత్కరింప చేసుకున్నారు ఋషులు, మహాత్ములు, సిద్ధులు.

భగవంతుడు దయతో తనని తాను వ్యక్తం చేసుకున్న క్షేత్రములూ ఉన్నాయి. ఉదాహరణకు తిరుమల వేంకటేశ్వరస్వామిని తెలుసుకుందాం. స్వామి సర్వవ్యాపకుడై ఉన్నాడు. భూదేవిని ప్రళయకాలం అయిన తరువాత మళ్ళీ సృష్టి ప్రారంభంలో ఉద్ధరించాడు. ఉద్ధరించిన తరువాత భూదేవి తపస్సు చేసి, "నన్ను ఉద్ధరించి నాకు ఒక ఉనికిని ఇచ్చావు కనుక నా పై నువ్వు ఉంటే బాగుండును" అని ఒక కోరిక కోరుకుంది. ఆ సమయంలో బ్రహ్మ కూడా తపస్సు చేసి "స్వామీ! నువ్వు భూమి మీద ఒక లీలగా విహరిస్తూ... అక్కడ ఉంటూ... నువ్వు భూమిని పాలించు, నువ్వు భూమిని రక్షించు" అని ప్రార్థించాడు. అప్పుడు బ్రహ్మ తపస్సు, భూదేవి తపస్సు రెండిటికీ సంతోషించి స్వామివారు, "సరే వెళతాను" అనుకున్నారు. అలా వచ్చిన చోటు పేరే శేషాచలం. ఇలా ఒకొక్క

కథ.

ఇలా భారతదేశంలో ప్రతి క్షేత్రం ఎలా వచ్చిందో చెప్పే స్థలపురాణాలు ఉన్నాయి. మహాత్ముల తపశ్శక్తి చేత పరమేశ్వరుడు వ్యక్తమయ్యాడు. ఆనాడు వారు చేసిన తపస్సు అక్కడ ఉంది కనుక మనం వెళ్ళి నమస్కారం చేసుకుంటే అక్కడి శక్తి మనలను అనుగ్రహిస్తుంది. భోజమహారాజు ఒక మాట అంటాడు – భగీరథుడు తపస్సు చేసి గంగను తీసుకువచ్చి వారి పూర్వీకులను తరింపచేసి వెళ్ళిపోయాడు. వారి పూర్వీకులూ తరించారు. ఆ గంగను దోసిట్లో పట్టి నీళ్ళు పోసి మనం మన పూర్వీకులను తరింపజేస్తున్నాం. భగీరథుడు తన పూర్వీకులను తరింపజేసుకోవడానికి, తాను తరించడానికి గంగను తీసుకు వస్తే ఆ గంగ మనలను కూడా తరింపజేస్తున్నది. అలాగే మహర్షులు తపశ్శక్తితో ఒక క్షేత్రంలో భగవచ్ఛక్తిని ఆవిష్కరింపజేసుకుంటే అక్కడికి వెళ్ళిన మనం కూడా ఆ శక్తిని తిరిగి పొందగలుగుతున్నాం.

ఎవరైనా ఒంటి నిండా సెంటు పూసుకుని వచ్చి మన ఇంటిలో ఒక గంట కూర్చుని వెళ్ళిపోతే ఆ రోజంతా ఆ గదంతా సెంటు వాసనే. అంత సెంటు పూసుకున్నవాడు వెళ్ళిపోయినా సెంటువాసన గదంతా ఎలా ఉందో, తపస్వి అక్కడి నుంచి నిష్క్రమించినా ఆ చోటులో ఆ తపశ్శక్తి అలా వ్యాపించిపోయి ఉంటుంది. సెంటుకి కొంత సమయమే ఆయువు, తపస్వి తపశ్శక్తికి యుగాల ఆయువు ఉంటుంది.

ఆలయాలకు వెళ్ళినప్పుడు ఆ మహర్షుల తపశ్శక్తిని, అక్కడ ఉన్న దైవశక్తిని పొందగలం. ఇది ఒక కారణం. అంతే కాదు, మహాత్ములు ఏ కోరికా లేనివారు. కానీ ప్రపంచంలో సంచరిస్తూ ఉంటారు. వారు ఎలా సంచరిస్తారో శంకరులు అద్భుతమైన మాట చెప్పారు – **వసంతవత్ లోక హితే చరంతః** – వారు వసంతంలా తిరుగుతారు అని చెప్పారు. వసంతం వచ్చింది, చెట్లన్నీ చిగురించాయి, పళ్ళూ వచ్చాయి. వసంతానికి ఏం లాభం? కానీ వసంతం రావడం వల్ల చెట్లన్నీ చిగురించడం వల్ల చెట్లకు లాభం. మనకు లాభం. అలాగే మహాత్ములు

వసంతంలా తిరుగుతారు. వసంతం రాగానే తోట మోడు నుంచి చిగురుదశకు ఎలా వెళుతోందో, మహాత్ములు రాగానే వారి శక్తి ప్రకంపనల వల్ల ఆ చోటు అంతా అద్భుతమైపోతుంది.

ఎందరో యోగులు, సిద్ధపురుషులు, మహాత్ములు వారు సిద్ధి పొందినా శరీర పతనం వరకూ జీవించి ఉంటారు. వారి శరీరం నుంచి వారు చేసిన తపశ్శక్తి వ్యాపించి ఉంటుంది. సిద్ధుల, సాధకుల శరీరాలకీ, సామాన్యుల శరీరాలకీ చాలా భేదం ఉంటుంది అంటారు పెద్దలు. సామాన్యుల శరీరాలు మాంసమయాలు. సిద్ధుల, సాధకుల శరీరాలు మంత్రమయాలు. వారు నిరంతరం ఆ దేవతను ఉపాసించడం, ఆరాధించడం, జపం చేయడం వల్ల వారిలో ప్రత్యణువు కూడా అంతే చైతన్యవంతం అవుతుంది.

అలాంటి సిద్ధపురుషులు ఎప్పుడూ భగవన్మయంగా ఉంటారు కనుక ఈ క్షేత్రాలకు, తీర్థాలకు వారూ వెళతారు. వారికి అవసరం లేకపోయినా గంగలో మునుగుతారు. మనం మునిగి తీర్థానికి అంటకట్టిన పాపాన్ని ఈ సత్పురుషులు మునిగి కడిగేస్తారు.

ఒకప్పుడు గంగానది ప్రవహిస్తూ ఉంటే నారదులవారు స్నానఘట్టాల ప్రక్క నుంచి వెళిపోతున్నారు. నారదులవారు దిగుతారా, లేదా అని గంగ ఎదురు చూస్తోంది. ఆయన దిగలేదు. తీర్థంలో స్నానం చెయ్యాలని మనం అనుకుంటాం. నారదమహర్షివంటి మహాత్ములు స్నానం చేస్తే బాగుండును అని తీర్థం అనుకుంటుంది. అలాంటివారు దిగితే **'తీర్థం కుర్వంతి తీర్థాని క్షేత్రం కుర్వంతి క్షేత్రాణి'** అంటారు నారదుడు భక్తిసూత్రాలలో. వారు అడుగు పెడితే ఆ చోటు తీర్థం అవుతుంది.

నారదమహర్షి అసిఘాట్ నుంచి వరణఘాట్ వరకు తిరిగాడు గాని ఎక్కడా మునగలేదు. చిట్టచివరికి వరణఘాట్ దగ్గరికి వెళ్ళేసరికి ఇంక గంగాదేవి ఉండబట్టలేక దేవతారూపం ధరించి వచ్చి నమస్కారం చేసి "మహానుభావా! నువ్వెందుకు గంగలో మునగలేదు" అని అడిగింది. "అమ్మా! నువ్వెవరు?"

అన్నారాయన. "నేను గంగాదేవిని" అన్నదా తల్లి. "తల్లీ! నీలో మునిగితేనే పుణ్యం వస్తుందని లేదమ్మా, నీ మీద వీచిన గాలి తగిలితే చాలు ధన్యులమైపోతాం" అన్నాడు ఆ మహానుభావుడు. అదీ తీర్థం... అదీ క్షేత్రం.

అన్ని దేశాలలో గొప్ప నదులు ఉండవచ్చు. కానీ భారతదేశంలో తీర్థాలు ఉంటాయి. భారతదేశంలో ప్రతి నీటిబిందువూ తీర్థమే. భారతభూమిలో అణువణువూ క్షేత్రమే. క్షేత్ర – తీర్థ భూమి నా భారత భూమి. **భారతదేశంలో క్షేత్రాలు కాదు, భారతదేశమే ఒక మహాక్షేత్రం.**

## దేశ స్వాభావిక లక్షణం

సుమారు పదిహేనేళ్ళ క్రితం ఒక మాట చెప్పడం జరిగింది. 'ప్రపంచమంతా నా కుటుంబమే/ఒక ఇల్లే. కానీ ఇంటిలో పడక గదులు, వంటగదులు అన్నీ ఉంటాయి. దేవుని గది కూడా ఒకటి ఉంటుంది. మొత్తం అన్ని గదులకీ కావలసిన శక్తిని ప్రసరింపజేసేది దేవుని గదే – శరీరానికి గుండెలాగ. అలాగే ప్రపంచమంతా నా ఇల్లే. కానీ కొన్ని దేశాలు పడక గదులు, వంటగదులు వంటివి. నా దేశం మాత్రం దేవుని గది'.

ఇక్కడ ఒక విషయం ఆలోచించాలి. **ఒకొక్క దేశానికి ఒకొక్క స్వభావం ఉంటుంది.** ఉప్పు స్వభావం ఉప్పగా ఉండడం, పటిక బెల్లం స్వభావం తియ్యగా ఉండడం. దీని స్వభావం ఇది, దాని స్వభావం అది. హిందూధర్మ స్వభావం అనడానికి కారణం అదే. **'స్వభావం న జహాత్యేవ'** అన్నారు – స్వభావం ఎవరూ విడిచి పెట్టలేరు. ఇప్పుడు ఉప్పు గొప్పదా? పంచదార గొప్పదా? దేని గొప్ప దానిదే కదా!

ఒక దేశం స్వభావం వ్యాపారం... ఆ దేశంలో సైన్స్ వచ్చినా, మతం వచ్చినా, కళ వచ్చినా, ఇంకేది వచ్చినా ఆ దేశంలో అన్నీ వ్యాపార ధోరణితో చూస్తారు.

మరొక దేశానికి స్వభావం రాజకీయం. ఆ దేశంలో ఏది వచ్చినా దానిని ఎలా రాజకీయం చెయ్యాలో చూస్తూ ఉంటారు. అక్కడా విజ్ఞానం, తత్త్వం, కళలు ఉంటాయి. కానీ అన్నిటిని రాజకీయంగా చేస్తారు వారు. వ్యాపారంగా

చేస్తారు మరొకరు. భారతదేశంలో యుగాల క్రితమే వైద్యశాస్త్రం, జ్యోతిషశాస్త్రం, తర్కశాస్త్రం, గణితశాస్త్రం... ఇలా అనేక శాస్త్రాలు ఉన్నాయి. శాస్త్రభూమి భారతదేశం.

ఇంకొక్కటి చరిత్ర చెప్తున్న గర్వించవలసిన అంశం– ప్రపంచం మొత్తం మీద మానవుని మొదటి సాహిత్యం ఋగ్వేదం. ఇంతవరకు ఒప్పుకుంటున్నారు. ఆ ఒక్క ఋగ్వేదం చూస్తేనే ఒక పండిపోయిన నాగరికత కనబడుతోందే, అలాంటి మొదటి సాహిత్యమైన ఋగ్వేదాన్ని ఇచ్చిన భారతదేశానికి నమస్కారం... అందులో ఇచ్చిన అపారమైన జ్ఞానానికి నమస్కారం.

ఒకొక్క దేశానికి ఒకొక్క స్వభావం అని చెప్పినట్లుగా ఈ దేశంలో విజ్ఞానం, తత్త్వం, జ్యోతిషం – ఇలా ఏది చెప్పినా... ఈ దేశం ఆధ్యాత్మికత అనే స్వభావంతో చూస్తుంది. అందుకే ఇక్కడ గణితం చెప్పినా ఆధ్యాత్మికతే, జ్యోతిషం చెప్పినా ఆధ్యాత్మికతే. అంటే అర్థం 'ఆధ్యాత్మికత' అనే కోణంతో అన్ని శాస్త్రాలని చెప్పారు. భారతదేశంలో ఏ శాస్త్రం ముట్టుకున్నా ఆధ్యాత్మికత అక్కడ ముడిపడి ఉంటుంది. ఆ శాస్త్రం ఒక వైపు భౌతికానికి పనికి వస్తూ, జీవుని ఉత్తమ స్థితికి తీసుకువెళ్ళే ఆధ్యాత్మికంగా కూడా పని చేస్తుంది. అదీ దాని గొప్పతనం. అది ఈ దేశం స్వభావం. అలాంటి స్వభావం కలిగిన దేశంలో ఒకొక్క క్షేత్రం ఎలా ఏర్పడిందో చెప్పుకుంటున్నాం.

## సిద్ధ క్షేత్రములు

సిద్ధ పురుషులైనవారు ఎన్నో లింగాలను, విగ్రహాలను ప్రతిష్ఠ చేశారు. ఇది ఇంద్రప్రతిష్ఠ అని, ఇది బ్రహ్మ ప్రతిష్ఠ అని చెప్తూ ఉంటారు. అలా ఏర్పడినవి ఈ క్షేత్రములు.

ఒకసారి బ్రహ్మ తపస్సు చేస్తే ఆయన తపస్సుకు సంతోషించి నారాయణుడు దర్శనమిచ్చాడు. ఆ సమయానికి ఆయనకు నారాయణుడు ఎలా కనబడ్డాడంటే పైన శంఖ, చక్రాలు పట్టుకున్నాడు క్రింద ఒక చేతిని కటిపై పెట్టుకున్నాడు, ఇంకొక చేతిని వరదహస్తంగా పట్టుకున్నాడు. బ్రహ్మ ఆనందించారు. "ఏమి

కావాలయ్యా నీకు?" అన్నాడు, "నాకేం కావాలి, నీ దర్శనమైంది చాలు. కానీ ఇదే రూపంతో ఇక్కడ అందరినీ అనుగ్రహించి కనబడాలి" అని అనగానే స్వామివారు "సరే!" అన్నారు. ఆ జ్యోతిస్వరూపాన్ని మన కంటితో చూడలేం కనుక విగ్రహరూపంలో ఆయన దర్శనమిస్తున్నారు. ఇలా ఏర్పడింది తిరుమల వేంకటేశ్వర విగ్రహం. కొన్ని క్షేత్రాలలో స్వయంభూ రూపాలతో ఉంటారు, సిద్ధక్షేత్రాలలో వారు ప్రతిష్ఠించిన రూపాలతో విగ్రహాలలో ఉంటారు.

అలాగే మానవులు ప్రతిష్ఠించిన క్షేత్రాలు ఎన్నో భారతదేశంలో ఉన్నాయి. అక్కడ కూడా నిత్యం అనుష్ఠానం, అర్చన, తపస్సు మొదలైనవి జరిగితే శక్తి మరింత కేంద్రీకృతమై ఉంటుంది. కేవలం విగ్రహం పెట్టినంత మాత్రాన సరిపోదు. భారతదేశంలో స్వయంభూ, సిద్ధ క్షేత్రాలు, మానవ ప్రతిష్ఠితమైన క్షేత్రాలు... ఏవైనా వాటికి మన నమ్మకంతో ప్రమేయం లేకుండా శక్తి ఉంటుంది. మనం నమ్మి దండం పెట్టుకోవడం అవసరం.

నమ్మినా, నమ్మకపోయినా ఆలయాలకు, క్షేత్రాలకు వెళితే దాని ప్రభావం తప్పకుండా ఉంటుంది. ఒక వేళ నమ్మి వెళితే ప్రభావం గాఢంగా, శీఘ్రంగా, అద్భుతంగా ఉంటుంది. నమ్మితే అనుబంధం కలుగుతుంది. నమ్మకపోతే కాదు. అంతే భేదం. సాధారణంగా చూస్తే వేంకటేశ్వరుడు అందమైన తొమ్మిది అడుగుల తొమ్మిది అంగుళాల విగ్రహం. అన్నమయ్యకు 'పొడగంటిమయ్యా మిమ్ము పురుషోత్తమా!' – పురుషోత్తముడై కనబడ్డాడు, విగ్రహం కనబడలేదు. హిందువు విగ్రహాన్ని ఆరాధించడు. విగ్రహంలో ఉన్న విశ్వవ్యాపక చైతన్యాన్ని ఆరాధిస్తాడు. ఏ హిందువూ, 'నేను విగ్రహానికి దండం పెడుతున్నాను', అనుకోడు. 'విష్ణువుకు దండం పెడుతున్నాను', 'శివునకు దండం పెడుతున్నాను' అనుకుంటాడు. అది గ్రహించబడుతుంది.

దర్శించేవారు ఋషులు, నమ్మేవారు(ఆస్తికులు) సాధకులు. నమ్మనివారు నాస్తికులు. దర్శించేవారు, నమ్మేవారు, నమ్మనివారు – ముగ్గురూ ఉంటారు. సాధారణంగా అధికశాతం మంది నమ్మేవారి దశలో ఉంటారు అప్పుడప్పుడు.

ఆ నమ్మకం ఉంటుందో, లేదో ఈశ్వరునికి ఎరుక. చాలామంది ఈశ్వరుడు కలడో, లేడో రకమే.

**కలఁడంబోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశమునం గుంభినిం**
**గలఁడగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం**
**గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం**
**గలడీశుఁడు గలండు దండ్రి! వెదుకంగా నేల యీ యా యెడన్**

– అన్నాడు ప్రహ్లాదుడు. కలండు... కలండు... కలండు... అని అంత స్థిరంగా చెప్పాడు కనుక అతనికి ఎక్కడ పడితే అక్కడ కనబడ్డాడు. కలడో, లేడో అంటే సందేహమే! ఆ **కలదు** అనే **స్థితి** రావాలి. **నమ్మే స్థితి** నుంచి **అనుభవం స్థితికి** వెళ్ళగలగాలి. ఋషులు దర్శిస్తారు, మనం నమ్ముదాం. నమ్మని వారిని వదిలేద్దాం. క్షేత్రంలో నమ్మినా, నమ్మకపోయినా శక్తి ఎలా ఉంటుందో చెప్పుకున్నాం.

## దేవాలయ విజ్ఞానం

స్వయంభూ క్షేత్రాలలో, సిద్ధక్షేత్రాలలో సహజంగా దైవశక్తి ఉంటుంది. ఇక ప్రతిష్ఠిత క్షేత్రాలలో శక్తి ఎలా ఉంటుందో పరిశీలిస్తే మన విగ్రహారాధన ఒక నమ్మకం మీద ఆధారపడి కాక, ఒక శాస్త్రం మీద ఆధార పడి తయారైందని తెలుస్తుంది. విగ్రహ నిర్మాణానికి, ఆలయ నిర్మాణానికి ఒక విజ్ఞానం ఉంది. దాని పేరు 'ఆగమ శాస్త్రం'. ఆగమ శాస్త్ర ప్రకారంగా విగ్రహాలను నిర్మాణం చేస్తారు. **రాజులు కట్టుకున్న కోటలు నాశనమైపోయినా, వారు కట్టిన ఆలయాలు నేటికీ మిగిలి ఉండడానికి కారణం- వాటి వెనకాల ఉన్న శాస్త్రబలం.**

ఏ ప్రాకారం ఎక్కడ కట్టాలి! ఏ పరివార దేవతని ఎక్కడ పెట్టాలి! క్షేత్రం యొక్క భూమిని ఎలా ఎంచుకోవాలి! ఆ భూమిని ఎలా శుద్ధి చెయ్యాలి! దానిలో వ్యతిరేక శక్తి(నెగెటివ్ ఎనర్జీ)ని తీసివేసి అనుకూల శక్తి(పాజిటివ్ ఎనర్జీ)ని ఎలా ఉత్పన్నం చెయ్యాలి! శుద్ధి చేసే ప్రక్రియ, ఆ తరువాత క్షేత్రంలో ఏ దేవతని నిర్మాణం చెయ్యదలచుకున్నారో ఆ దేవత ఆకృతి, విగ్రహం ఏ

కోణంలో పెట్టదలచుకున్నారో దానికి తగ్గట్టుగా గర్భగుడి ప్రమాణం, దానిపైనున్న గోపుర ప్రమాణం, అంతరాలయం, ప్రాకారం, పరివార దేవతలు – ఇవన్నీ ఏర్పాటు చేసుకుంటారు. దానికి తగ్గ నిర్మాణం జరుగుతుంది.

ఆ తరువాత విగ్రహాన్ని చెక్కడం. అక్కడి నుంచి పరిశీలిస్తే ఒక రాయి విగ్రహమై దేవుడై దండం పెట్టించుకునే స్థితికి వెళ్ళడం. ఈ మధ్యలో ఎన్ని పద్ధతులు ఉన్నాయో తెలుసుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఇవి నేటితరానికి తెలియాలి. లేకపోతే 'అందరూ ఏదో నమ్ముతారు, మనకూ ఒక నమ్మకం ఉంది' అనుకుంటారు. మనది నమ్మకం మాత్రమే కాదు. మన నమ్మకం వెనకాల ఒక విజ్ఞానం ఉంది. ఆ విగ్రహాన్ని నిర్మాణం చేసిన తరువాత ఏమి చేస్తారో ఆ విధానాన్ని తెలుసుకోవాలి. 'ప్రతిష్ఠా మహోత్సవం' అని చేస్తారు.

మన పదాన్నే కాపీ కొట్టి ఇతరులు పెడుతున్నారు. కానీ ఈ పనేమీ అక్కడ జరగదు. మనలను ఆకర్షించడం కోసం మన ధర్మంలో మనం పెట్టుకొనే పేర్లైతే తీసేసుకుంటున్నారు. కానీ, మనలా ఉందామని ప్రయత్నించినా మనలా అది అవడానికి ఆస్కారం లేదు. పులిని చూసి నక్క వాత పెట్టుకుంటే పులి అయిపోదు. హిందూమత శబ్దాలు వాడుకున్నంత మాత్రాన వాటికి ఈ ప్రతిపత్తీ రాదు, ఈ గౌరవమూ రాదు.

## ప్రతిష్ఠ అన్నప్పుడు ఏమి జరుగుతుంది?

ఏ దేవతను ప్రతిష్ఠ చెయ్యదలచుకున్నారో ఆ దేవతకు సంబంధించిన మంత్రం, యంత్రం, విగ్రహం – మూడు దశలు ఉంటాయి. **మంత్రం – శబ్దరూపం, యంత్రం – రేఖారూపం, విగ్రహం – ఆకృతి రూపం. ఆ మూడిటి ద్వారా ఆ దేవత సర్వవ్యాపకమవుతుంది.** మంత్రం ద్వారా ఆ దేవతాశక్తిని ఆకర్షించాలి.

**'మంత్ర వాచ్యార్థాః దేవతాః'** – మంత్రం చేత ప్రతిపాదింపబడేది దేవత. ముందు మనం స్వరూపం తెలుసుకోవాలి. **దేవత అనగా మంత్రం ద్వారా ప్రతిపాదింపబడేది.** ఓంకారం ఒక్కటే కానీ అక్షరాలెన్నో. ఓంకారం నుంచి పుట్టినవే అక్షరాలు. ఆ అక్షరాల కలయిక వల్ల మంత్రం ఏర్పడుతుంది. ఏ

మూలిక కలిపితే ఏ ఔషధం అవుతుందో వైద్యునికి తెలుస్తుంది, ఏ అక్షరం కలిపితే ఏ మంత్రం అవుతుందో ఋషికి తెలుస్తుంది. **'అమంత్రమక్షరం నాస్తి నాస్తిమూలమనౌషధం'** అని పెద్దలు చెప్పారు. ఔషధం కాని మూలిక లేదు, మంత్రం కాని అక్షరం లేదు.

అక్షరాల సంయోజనంలో మంత్రం పుడుతుంది. ఏ మూలిక పడితే ఆ మూలిక తింటే ప్రమాదం. శక్తి ఉంది సరే, కానీ అది ఎలా కలిపితే ఔషధం అవుతుందో వైద్యునకు తెలుస్తుంది అక్షరాన్ని ఎలా కలిపితే మంత్రమౌతుందో ఋషికి తెలుస్తుంది. ఒకొక్క మంత్రం నుంచి శక్తి ఒకొక్క రకంగా వస్తుంది.

ఒక దేవతకు ఒక మంత్రం ఉంటుంది. ఆ **దేవతాశక్తికి శబ్దాకారం మంత్రం. ఆకృతి రూపం విగ్రహం, రేఖా రూపం యంత్రం. ఈ మూడు ఒకే దేవత యొక్క మూడు రూపాలు.** ఒక దాని కంటే ఒకటి సూక్ష్మము. మనం చూడగానే పోల్చుకోలేనిది స్థూలం. కొంచెం ఆలోచిస్తే గ్రహించేది సూక్ష్మం. శక్తి ఎప్పుడూ సూక్ష్మంగానే ఉంటుంది. స్థూలం వేరు, సూక్ష్మం వేరు.

మీరు మాట్లాడే మైకుని చూస్తున్నారు. కానీ విద్యుచ్ఛక్తిని చూడగలుగుతున్నారా! లేదు. మైకు స్థూలం, విద్యుచ్ఛక్తి సూక్ష్మం. సూక్ష్మానికే శక్తి ఎక్కువ. అది గ్రహించేవానికి మోక్షము. దీనినే 'సూక్ష్మంలో మోక్షం' అంటారు పెద్దవారు. సూక్ష్మంలో మోక్షం అంటే కొద్దిలో వచ్చేస్తుంది అని కాదు. కనబడని దానిని గ్రహించగలిగితేనే మోక్షం. కనబడే ప్రపంచాన్ని కాకుండా కనబడే ప్రపంచంలో కనబడకుండా ఎవడు ఉన్నాడో వానిని గ్రహిస్తే మోక్షం.

ఆ సూక్ష్మశక్తిని గ్రహించడానికి ఇక్కడ మూడు విధానాలు చెప్పారు. మొదటిది శబ్దరూపం. ఆ శబ్ద రూప మంత్ర ఉచ్చారణ వల్ల ప్రభవించిన చైతన్యం దేవత అవుతుంది. ఆ దేవతని మన కంటితో చూడలేం.

ఒంగోలు దగ్గర ఒక సిద్ధ పురుషుడు ఉండేవారు. ఎవరైనా అక్కడ జపం చేసుకుంటూ ఉంటే వారు ఏ దేవతని జపం చేస్తున్నారో, ఆ దేవత ఏ రూపంలో ఉందో ఆయన చెప్పేవారు. అరే! ఎలా చెప్పగలిగారు? ఆయనకు ఆ దేవతా

రూపం దర్శించే శక్తి ఉంది. ప్రతి మంత్రం జపం చేసేటప్పుడు ఆ మంత్రంలోంచి ఒక దేవతాకారం ఉత్పన్నమవుతుంది.

విష్ణుసహస్రం చదువుతున్నప్పుడు విష్ణుస్వరూపం మన దగ్గర ఉంటుంది. 'నాకు కనబడలేద'ంటే... మనకి మనవంటి రూపాలే కనబడతాయి. దేవతారూపం ఎలా కనబడుతుంది? మనకు కనబడితే దేవత ఎలా అవుతారు? దేవతలవి తేజోమయ శరీరాలు. వాటిని చూసే శక్తి మనకు లేదు. ఒక్కటి మాత్రం స్పృహలోకి తెచ్చుకోవాలి. మనం క్షేత్రానికి వెళితే వేంకటేశ్వరుని విగ్రహం చూస్తాం కానీ, వేంకటేశ్వరుని చూడలేదు. కానీ మనం వేంకటేశ్వర స్వరూపాన్ని చూడలేకపోయినా వేంకటేశ్వరుడు మనలను చూస్తాడు. అదీ దర్శనం.

**దర్శనం అంటే మనం చేసేది కాదు, భగవంతుడు మనకు ఇచ్చేది.** ఆయన కంట్లో మనం పడతాము అని తెలుసుకుంటే చాలు. అలా మనం మంత్రజపం చేస్తున్నప్పుడు అక్కడ తప్పకుండా భగవంతుడు ఆ రూపంలో ఉంటాడు. మనకు అది కనబడదు. ఒక మంత్రానికి ఒక దేవతా రూపం ధ్యానశ్లోకంగా ఉంటుంది.

అనేకమంది మంత్రజపం చేసేవారు ఉంటారు. విష్ణుసహస్రం చదివేవారు ముందు ధ్యాన శ్లోకాలు చదివితే అందులో మూడు కనబడ్డాయి ఋషికి. ఒక రూపం **'క్షీరోదన్వత్ ప్రదేశే శుచిమణి విలసత్...'** ఇది విష్ణుసహస్రంలోంచి ఉత్పన్నమైన ఒక రూపం. రెండవ రూపం **'భూః పాదౌ యస్య నాభిః వియదసురనిలశ్చంద్ర..'**

మూడవ రూపం – **'శాంతాకారం భుజగశయనం...'** అంటే అంత మంత్రరాశిలో మూడు రూపాలు ప్రధానంగా కనబడ్డాయి. ఇంకా ఎన్నో రూపాలలో కూడా ఉండవచ్చు. అలా ఒక మంత్రానికి ఒక ధ్యానశ్లోకం చెప్పారంటే అర్థం ఆ మంత్రం ద్వారా ఉత్పన్నమైన దేవతామూర్తి ఇలా ఉంటుంది అని చెప్పేది ధ్యానశ్లోకం.

ఒక మంత్రం, ఒక శబ్దం ఉచ్చరించినప్పుడు ఏర్పడిన తేజస్సు ఆ రూపం

ధరిస్తుంది. ఈ మధ్య టోనోస్కోపీ అనే ఒక పరికరంతో శబ్దానికి ఒక రూపం తీసుకుని వస్తున్నారు. ఓం అనగానే ఒక రూపం వచ్చింది. టోనోస్కోపీలో అది ఎలా ఉన్నది అంటే మూడు అంకె పెట్టి, పక్కన తొండం పెట్టి, పైన చుక్క పెట్టినట్టు కనబడింది. అంటే **విజ్ఞానం పెరుగుతున్న కొద్దీ హిందూమతం గొప్పతనం ఋజువవుతోంది** అని చెప్పవచ్చు. వైశ్విక శబ్దం ఓంకారం అని చెప్పాం.

కొద్ది రోజుల క్రితం నాసా వాళ్ళు పంపిన ఒక ఫొటో రికార్డ్ మొత్తం చాలా మందికి తెలిసే ఉంటుది. సూర్యమండలంలోంచి ఒక శబ్దం వినబడుతోంది అన్నారు. ఏమిటా శబ్దం అని రికార్డ్ చేస్తే అది ఓం. ఇది మానవులు సృష్టించినది కాదు. సూర్యమండలంలో వినబడుతోంది. మనకి సంబంధించి సూర్యుడు పరమాత్మ అయితే, అందులోంచి వినబడుతున్న శబ్దం ఓంకారం. సృష్టి స్థితి లయలు నడిపే పరమాత్మని సూర్యమండలంలో మనం దర్శిస్తున్నాం. కనుక విజ్ఞానశాస్త్రం చెబుతున్నది ఓంకారం. మీరు, నేను అనేది కాదు, ప్రపంచంలో ఉంది. అది మనం కూడా అనగలిగితే ఆ పరమాత్మతో అనుబంధం ఏర్పరచుకోగలం. ఇలా మంత్రానికి ఒక దేవతాకారం ఉంటుంది.

లలితా సహస్రనామస్తోత్ర ధ్యానశ్లోకం – **'అరుణాం కరుణాతరంగితాక్షీం'.** ఇలా ఒకొక్క దానికి ఒకొక్క దేవతామూర్తిని చెప్పారు. కనుక ఒక మంత్రం, ఒక ధ్యాన శ్లోకం ఎందుకు చెప్పారంటే మంత్రదేవత ఆ రూపంలో ఉంటుంది. ఆ ధ్యానశ్లోకంలో వర్ణించిన దానిని విగ్రహంగా చెక్కుతారు. ఈ రెండిటికీ మధ్య యంత్రం అనేది ఒకటి ఉంటుంది. రేఖారూపంలో శక్తి(ఎనర్జీ)ని తీసుకుని వస్తారు. యంత్రం అంటేనే శక్తి కేంద్రం. మంత్రాక్షరాల సంఖ్యననుసరించి ప్రతిష్ఠ సమయంలో ఆ దేవతకి సంబంధించిన మంత్రాన్ని జపం చేస్తారు. జపం చేసి దానిని తర్పణ చేస్తారు. తర్పణ చేసిన దానిని అగ్నిహోత్రంలో యజ్ఞం చేస్తారు. ఈ శక్తినంతటినీ తీసుకుని వెళ్ళి యంత్రంలో ధారపోస్తారు. దాని మీద విగ్రహం పెడతారు.

ఆ విగ్రహాన్ని జలాధివాస, ధాన్యాధివాస, శయ్యాధివాస, క్షీరాధివాస,

పుష్పాధివాసములనే ప్రక్రియల ద్వారా ఈ మంత్రశక్తిని రోజుకొక విధంగా దానిలోకి పంపిస్తూ కళాన్యాసం అనేది చేస్తారు. ప్రపంచమంతా వ్యాపించిన పరమేశ్వరుని కళలు సూర్యకళలు, చంద్రకళలు, అగ్నికళలు, వాయుకళలు... ఈ కళలందు అంతటా పరమాత్మ వ్యాపించాడు. ఈ కళలను మంత్రరూపంలో తీసుకుని వచ్చి ఆ విగ్రహంలో ఒకొక్క అణువులో మంత్రరూపంలో వ్యాప్తి చేస్తారు. అలా తయారైన విగ్రహాన్ని ప్రతిష్ఠ చేస్తారు.

ఆ పెట్టుకున్న శక్తి నష్టపోకుండా కాపాడుకోవాలి. ఆ కాపాడుకోవడానికే నిత్య అర్చనలు, పూజాది విధానాలు... ఇవన్నీ ఏర్పరుస్తారు. **ఆలయంలో చూసుకోవలసింది రాబడి కాదు. ఆలయ వ్యవస్థలో అర్చనలు సరిగ్గా జరుగుతున్నాయా! లేదా! పరంపరగా పెట్టిన విధానాలు సరిగ్గా జరుగుతున్నాయా! లేదా! అని చూసుకోవాలి.** ఆ శక్తి అక్కడ కేంద్రీకృతమైతే అందరూ తరిస్తారు. అప్పుడు ఆలయానికి ఎవరు వెళ్ళినా అక్కడ కేంద్రీకృతమైన సూక్ష్మశక్తి తరంగాలు వాళ్ళపై ప్రసరించి వ్యాపింపజేస్తాయి. ఈ విధంగా ప్రతిష్ఠితమైన ఆలయాలలో దేవతాశక్తి వస్తుంది, స్వయంభూ ఆలయాలలో సహజంగా వస్తుంది.

## గుడి మనకోసం - దేవుని కోసం కాదు...

ప్రతిష్ఠ వల్ల వచ్చినా, సహజంగా వచ్చినా దైవశక్తిని కాపాడుకోవలసిన బాధ్యత మనది. గుడి దేవుని కోసం కాదు... మన కోసం. భగవంతుడు గుడి మన కోసం ఇచ్చాడు. గుడిలోకి వెళ్ళి దండం పెట్టే వారందరూ గుడిని కాపాడుకోవాలి అనే ప్రయత్నం చేయాలి. నా గుడికి నేను దండం పెడితే, నా గుడి మీద ఎవరో రాళ్ళు వేస్తే, నేను పారిపోతే అదేమిటి? గుడికి వచ్చే జనాలను చూసి భక్తి పెరిగిపోయిందని భ్రమించవద్దు. క్యూలో కొట్టుకుంటున్న వారిని భగవంతుడు ఏం అనుగ్రహిస్తాడో చెప్పండి. ఆశ పెరిగింది, దానికి ఆయనకు దండం పెడితే తీరుతుందేమో అనుకుంటారు. కానీ భక్తి చాలా గొప్పది. అది ఉండడం మహా కష్టం. ఆశ కంటే ధర్మాన్ని కాపాడుకోవాలనే నిష్ఠ ప్రస్తుతం చాలా అవసరం.

నా ఆలయాలు నన్ను అనుగ్రహిస్తాయనేది ఎంత ముఖ్యమో, ఆలయాలను నేను కాపాడుకోవాలి అనేది కూడా అంతే ముఖ్యం. అదే 'ధర్మో రక్షతి రక్షితః'.

## 'ధర్మో రక్షతి రక్షితః'

'ధర్మాన్ని రక్షించుకో!' అంటే అర్థం రెండు విధాలు – ఒకటి పాటించి రక్షించుకో. రెండవది ఇతరుల నుంచి దెబ్బ తగలకుండా రక్షించుకో. ఈ రెండూ చెయ్యడమే ప్రతివారి కర్తవ్యం. అది మనం చెయ్యగలుగుతున్నామా? లేదే. మన కళ్ళ ముందే మతాలు మార్చేస్తూ ఉంటే నాకెందుకులే అనుకుంటున్నాం. 'ఎవరు ఎలా మారిపోతే ఏముందండీ!' అంటాడు మరొకడు. కానీ వారి ఇంట్లో ఆస్తి దోచుకుపోతే మాత్రం కేసులు వేస్తాడు. ఇలా ఉంటే ఎలా? మన ఉనికికే ప్రమాదమైతే మనం తరువాత బ్రతకలేమని గుర్తు పెట్టుకోవాలి. దీనికి అనేక ఉదాహరణలు ఉన్నాయి.

క్షేత్రంలో వచ్చిన ఆ శక్తిని మనం కాపాడుకోవలసిన అవసరం ఉన్నది. ఒకొక్క ఆలయంలో ఆగమాలు విధానాలు ఏర్పరచాయి. ప్రాతఃకాలం ఏ అర్చన చెయ్యాలి! మధ్యాహ్నం ఏమి చెయ్యాలి! సాయంకాలం ఏమి చెయ్యాలి! నిత్యోత్సవాలు, వారోత్సవాలు, పక్షోత్సవాలు, మాసోత్సవాలు, బ్రహ్మోత్సవాలు... అన్నీ ఆగమాలు చెప్పాయి. బ్రహ్మోత్సవం అంటే పెద్ద ఉత్సవం అని అర్థం.

ఒకొక్క ఆలయానికి ఒక పెద్ద ఉత్సవం చేసి, ఏమైనా చిన్న చిన్న వ్యతిరేకశక్తులు కానీ దేవాలయంలో అప్పటికి చేరి ఉంటే సంప్రోక్షణ, కుంభాభిషేకం... ఇవన్నీ చేసి తిరిగి ఆ దేవతాశక్తిని కేంద్రీకృతం చేస్తారు. అలా ఒక వ్యవస్థని మహర్షులు ఏర్పరచారు. ఇలాంటి ఆగమవ్యవస్థతో ఏర్పడిన ప్రతి దేవాలయం కూడా ఒక శక్తికేంద్రమే. ఇంత స్పష్టంగా దేవాలయ వ్యవస్థని మనం అర్థం చేసుకోవాలి.

మనం మన ఇళ్ళల్లో పెట్టుకునే విగ్రహాలు, పటాలు వాటిలో శక్తి ఉంటుందా? మరి ఇంత క్రమపద్ధతి లేదు కదా? అని ప్రశ్న వెయ్యవచ్చు. తప్పకుండా ఉంటుంది. అందులో సందేహం లేదు. కొందరు అంటూ ఉంటారు, 'విగ్రహాలు ఏదో మన నమ్మకం కోసం పెట్టుకున్నామండీ' అని. మన నమ్మకం కోసమే

పెడితే స్టీలు పెట్టుకో, ప్లాస్టిక్ పెట్టుకో అని చెప్పేవారు. కానీ స్టీలు విగ్రహాలు పనికి రావు. ప్లాస్టిక్ విగ్రహాలు పనికిరావు అని ఎందుకు చెప్పారు? ఇంట్లో పెట్టుకున్న విగ్రహం వితస్తి ప్రమాణం దాటరాదు (వితస్తి అంటే అరచేయి అంత ప్రమాణం). 'నీ నమ్మకమే ప్రధానమైతే ఎంతైనా పెట్టుకో'! అని చెప్పేవారు కదా! ఇందులో ఏదో విజ్ఞానం ఉందన్నమాట. నమ్మకమే కాదు.

విగ్రహం ప్రమాణం మించి కానీ ఇంట్లో పెడితే దానికి తగ్గ శాంతి చెయ్యాలి. ఒక ఆలయంలో దానికి తగ్గ ప్రాకారం, గోపురం, శాంతి, అన్నములు, నైవేద్యాలు జరుగుతాయి కనుక సరిపోతుంది. 'భగవంతునికి కూడా ఇన్ని చెయ్యాలా?' అంటే సర్వవ్యాపకుడైన భగవంతునికి అక్కరలేదు, కానీ ఒక విగ్రహంలో ఒక ఆలయంలో పెట్టిన భగవంతునికి కావాలి. ఇది ఎలాంటిదంటే ప్లగ్‌లో కరెంటు ఉంది సంతోషమే. కానీ, వేలు పెట్టకూడదు. పెడితే షాక్ కొడుతుంది. శక్తిని ఎలా క్రమబద్ధీకరించాలో పెద్దలు పద్ధతి చెప్పారు.

## ఎక్కడ శక్తి ఉంటుందో అక్కడే నియమం ఉంటుంది

అంతటా ప్రవహించే నదీజలాలకి మూత పెట్టనక్కరలేదు. కానీ ఒక బిందెలో తెచ్చి ఇంట్లో పెట్టుకుంటే మూత పెట్టుకోవాలి. శుభ్రమైన చేతులతోనే తాకాలి. అదే విధంగా సర్వవ్యాపకుడైన దేవునకు నియమాలు లేవు. ఆలయాలలో విగ్రహాలలో ప్రతిష్ఠిస్తే మాత్రం నియమాలు వర్తిస్తాయి.

ఒకాయన మీ హిందూ ఆలయాలలో అందరినీ గర్భగుడిలోకి రానివ్వరు, ఎవరినీ ముట్టుకోనివ్వరు, అదే మాలో అయితే ఆ బాధ లేదు, ఎవరైనా లోపలికి వెళిపోవచ్చు అన్నాడు. ఎంతో బాగా చెప్పాడు! నిజమేనేమో అనుకుంటారు. అక్కడకి వెళ్ళి ముట్టుకుంటే ఏమి వస్తుంది! రాయి తగులుతుంది. ఏం లాభం లేదు. కానీ దేవాలయంలో అది ముట్టుకోవడానికి దానికంటూ సాధన చేసినవారు, దానికంటూ పని చేసినవారు, ఒక పరంపర ఉన్నవారు శుద్ధులై వెళ్ళి ముట్టుకుంటారు. దానికి చెయ్యవలసిన అర్చన చేస్తారు. శక్తి అక్కడ పెడతారు.

ఆ శక్తి అందరూ పుచ్చుకుంటారు. కానీ **ముట్టుకున్నవారి కోసమే దేవాలయం కాదు... దండం పెట్టిన ప్రతివారి కోసం దేవాలయం.** మనింట్లో ఎప్పుడైనా కరెంట్ పోతే 'నేనే వెళ్ళి మొత్తం తీసేస్తాన'ంటే షాక్ కొట్టి దెబ్బ తింటారు. అప్పుడు విద్యుచ్ఛక్తి నిపుణుని పిలిపించుకుని వాని చేత బాగు చేయించుకుంటారు. అతను వచ్చి ముట్టుకుని బాగు చేసింది మన కోసం, వాని కోసం కాదు.

అలాగే ఆలయంలో కొంతమంది అర్చన చేస్తారు. వారు చేసేది మన కోసం. అయితే అందరూ ముట్టుకుంటే ఏమవుతుంది? ఇది తెలియాలి కదా! అసలు ముట్టుకోవాలని ఎందుకు అనుకుంటున్నారు? ఏదో ఉంది అనే కదా! అక్కడ ఒక శక్తిని కేంద్రీకృతం చెయ్యడం అనే ఒక పద్ధతి పెట్టారు. ముట్టుకుంటే అది నీతో పోతుంది. అయితే అందరూ ముట్టుకోరు కదండీ, మరి దేవుడెలా అవుతాడు అంటే ఒక చిన్న ఉదాహరణ.

ఒక రాగి తీగలోంచి విద్యుత్ ప్రసరిస్తూ ఉంటుంది. దానిని ముట్టుకుంటే ప్రమాదం. కానీ ఒక కర్రపుల్లని ప్లగ్ పాయింట్లో పెడితే ఏమీ విద్యుత్ ఉండదు, ఎవరైనా ముట్టుకోవచ్చు. కానీ ప్లగ్‌లో రాగి తీగ పెడితే షాక్ కొడుతుంది. కనుక ఎక్కడ శక్తి ఉంటుందో అక్కడే నియమం ఉంటుంది. **మన ఆలయాలకి నియమాలు ఎందుకు ఉన్నాయంటే – శక్తి ఉంది కనుక.** కొందరు "మీ పూజలకి చాలా నియమాలండీ" అని అంటే "అందుకే మావి దేవతలు" అని చెప్పాలి.

నియమాలు ఉంటాయి. ఆ నియమాలతో శక్తిని ప్రోది చేసుకుని **రక్షించుకోవాలి.** అర్చకులు నియమంగా ఉంటే శిల అయినా శివుడు అవుతాడు. అర్చకులు నియమం తప్పితే శివుడైనా శిల అయిపోతాడు. అర్చనా వ్యవస్థలో ఒక శుద్ధము, నియమము ఉండాలి. అలాంటి పద్ధతిని మన ఆగమము, వ్యవస్థ ఏర్పాటు చేశాయి. ఆ పద్ధతి లోపం లేకుండా చూసుకోవాలి. అదీ నిర్వహణ బాధ్యత. ఇదే ఆలయ నిర్వాహకుల ప్రధాన బాధ్యత.

# వర్ణవ్యవస్థ

**చాతర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః** (భగవద్గీత)

గుణములను అనుసరించి నాలుగు వర్ణముల విభాగం శాస్త్రంవల్ల ఏర్పడింది. అది 'సహజాతం' – పుట్టుకతోనే వస్తుంది అని భగవానుడు చెప్పాడు. పుట్టుకతో వచ్చినంత మాత్రాన ఎక్కువ తక్కువలు లేవు. ఎవరు దేనిలో ఉన్నారో దానిని అనుసరించి శాస్త్రవిహితమైన కర్మని ఆచరించడం చేత సద్గతులు పొందుతారు. ఆ శాస్త్రవిహిత కర్మయే భగవంతుని మీద ప్రేమగా అర్పణ బుద్ధితో చేస్తే మోక్షానికి కావలసిన జ్ఞానాన్ని గ్రహించడానికి అర్హమైన సిద్ధిని పొందుతారు.

ఏ యజ్ఞం జరిగినా మంత్రబలం, దైవబలం ప్రోగు చేయడానికి కొందరు దీక్ష కట్టుకుని ఉంటారు. ఆ యజ్ఞంలో లోపం ఏం జరగకుండా చూసుకోవడానికి కొందరు ఉంటారు. ఆ యజ్ఞానికి కావలసిన ఖర్చు, జమ చూసుకోవడానికి, సరఫరా చెయ్యడానికి కొందరు ఉంటారు. ఆ యజ్ఞంలో సేవ చెయ్యడానికి, తగినవి ఉత్పత్తి చేసి అందించడానికి కొందరు ఉంటారు. అప్పుడే నలుగురు వచ్చేశారు. అంత చేస్తే యజ్ఞం ఫలిస్తుంది. నలుగురికీ సమాన ఫలం వస్తుంది.

ఆ మంత్రం చేసేవారిని మొదటి వర్ణం వారు అన్నారు, పరిపాలన చేసే వారిని క్షత్రియుడు అన్నారు, బట్వాడా చేసేవారిని వైశ్యుడు అన్నారు. అందరికీ కావలసినవి సమకూర్చి, సేవచేసి అందించే వారిని శూద్రులు అన్నారు. నాలుగు ఉంటేనే యజ్ఞం అయింది. **'చత్వారః సమభాగినః'** – నలుగురూ యజ్ఞంలో ప్రధానం. అందరూ అన్నీ చెయ్యలేరు, పంచుకున్నారు. అందరికీ భగవత్ఫలం ఒకేలా లభిస్తుంది.

కృష్ణ పరమాత్మే చెప్పాడు, **'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః'** – **'ఎవరైనా సరే వారి ధర్మాన్ని వారు ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తూ నిలబడగలిగితే వారు తరించిపోతారు'**. అంతే కానీ ఒక మతంవారు తరిస్తారు, ఒక వర్ణంవారు తరిస్తారని ఎక్కడా చెప్పలేదు.

శ్రీ కృష్ణదేవరాయలు 'ఆముక్తమాల్యద'లో ఒక గొప్ప మాట చెప్పారు. విష్ణువు భూదేవితో మాట్లాడుతూ – "జాత్యుచిత కర్మము మత్ప్రీత్యర్థంబూని" అంటాడు. తన స్థితి, ఉచితమైన కర్మ, ఈశ్వరబుద్ధితో చేసిన ప్రేమ ఉంటే వారు తరించిపోతారు.

**స్వామి కోసం మంగళకైశికి రాగం ఆలపించిన ఒక అట్టడుగు వర్ణం వారిని ఎత్తుకుని తెచ్చి తనలో లీనం చేసుకున్న విష్ణువు ఈ దేశం ఆరాధించే దైవం. ఒక నందనార్, ఒక కన్నప్ప, ఒక మంగళకైశికీ రాగం ఆలపించిన దాసరి... ఇలా ఎందరెందరెందరో అట్టడుగు వర్ణాలవారు... ఎందరెందరు అగ్రవర్ణాల వారు... ఎందరెందరు మధ్యవారు... ఒకరేమిటి? ఎందరు భక్తులు కనబడతారో... అందరికీ నమస్కారం. వారి వారి పద్ధతులలో వారు ఆరాధించినప్పుడు, భారతీయ సంస్కృతి అందరికీ సంబంధించినదే.**

పతనం కాకుండా ఉండాలంటే వారికి విధింపబడిన కర్మలు వారు చేయాలి. మోక్షం రావాలంటే విధింపబడిన కర్మని నిష్కామంగా, నిస్సంగంగా చేయాలి. అది క్రమంగా జ్ఞానాన్ని గ్రహించగలిగే స్థితిని ఇస్తుంది. దానిద్వారా కైవల్యం పొందుతారు. ఇందులో ఈ నలుగురూ కూడా పురుషార్థం పొందడానికై నాచే సృష్టింపబడినవారు అని జగద్గురువు మాట. మానవుడు పుట్టాడు అంటేనే పురుషార్థం పొందడానికి. కనుక ఈ నాలుగు వర్ణాలలో ఒక వర్ణం వారు మాత్రమే మోక్షం పొందుతారు అని కృష్ణపరమాత్మ చెప్పలేదు.

భగవద్గీత వర్ణవ్యవస్థ చెప్తోంది గనుక అది విశ్వజనీన గ్రంథం కాదు అన్నారు కొందరు. ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా ప్రపంచం అంతా కూడా వర్గాలతోనే ఉంటుంది. వర్గం లేకపోతే ప్రపంచం నడవదు. ఎందుకంటే భగవంతుడు అందరికీ అన్నిరకాల పనులూ చేయగలిగే సమర్థత ఇవ్వడు. ఇచ్చినా అందరూ అన్నిరకాల పనులూ చేయగలిగే స్థితి కూడా ఉండదు. అందుకే ఒకరికొకరు ఒక్కొక్క పనులతో సహకరిస్తూ ఉండేదే సమాజం. ఒకప్పుడు ఇటువంటి చక్కని వ్యవస్థ ప్రమాదం లేకుండా యుగాలతరబడి కొనసాగింది. కానీ పరాయి దాడులలో మనకి ఉన్న మంచి లక్షణాలను చెడుగా వ్యాఖ్యానించడం

మొదలుపెట్టగానే మనలో మనకి పడకపోవడం అనేది పుట్టింది. అది క్రమక్రమంగా పెరిగిపోయి వర్గవైషమ్యాలకు హేతువయింది. ఒక్కటి తెలుసుకోవాలి – అనేకరకాల దాడులు జరిగినా హిందూధర్మం ఇలా నిలబడింది అంటే కేవలం వర్ణవ్యవస్థ వల్లనే. అది మేధావులు ఒప్పుకుంటున్నారు. దీనిని అడ్డం పెట్టుకొని ముక్కలు చేద్దాం, చీల్చేద్దాం అనుకున్న పడమటి బుద్ధుల మేధావులు వైషమ్యాలు కల్పించారు.

## శ్రమ విభజనకు వైషమ్యమా?

నాలుగు వర్ణాల వారి గురించి భగవానుడు చెప్తూ ఏ వర్ణం వారు మోక్షం పొందుతారు? అంటే ఎవరైనా సరే ఇలా ఉంటే మోక్షం పొందుతారు, ఇలా ఉంటే సద్గతి పొందుతారు, ఇలా ఉండకపోతే నాశనమైపోతారు అని తేల్చేశాడు. **మోక్షానికి ఒక వర్ణం వారే అర్హులు అని మాత్రం ఎక్కడా ఏ గ్రంథములోనూ లేదు.**

**బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,**
**కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః.**

ఓ పరంతప! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల కర్మలునూ, అట్లే శూద్రుల కర్మలునూ వారి వారి స్వాభావికములైన గుణములను బట్టి విభజింపబడియున్నవి.

**ఏతావానేవ చ సర్వవేదస్మృత్యర్థ పురుషార్థమిచ్ఛద్భిరనుష్ఠేయః ఇతి** – సర్వవేదస్మృతులూ చెప్పిన పురుషార్థం పొందడానికి ఒక వ్యవస్థ ఏర్పరచబడింది. ఆ వ్యవస్థ పేరే చాతుర్వర్ణ్య వ్యవస్థ అని జగద్గురు శంకరాచార్యులు తెలియజేశారు.

**జన్మాంతర కృత సంస్కారః ప్రాణినాం వర్తమాన జన్మని స్వకార్యాభిముఖత్వే నాభివ్యక్తస్వభావః** – ఇదివరకటి జన్మలలో చేసిన కర్మలయొక్క వాసనల బలం ఈ జన్మలో దేహరూపంలో, బుద్ధిరూపంలో, ప్రాణరూపంలో అభివ్యక్తం అవుతుంది. దీనిపేరు స్వభావం.

ప్రతిదానికీ ఒక స్వభావం ఉంటుంది. ఇన్నిరకాల స్వభావాలు ఉండడం వల్లనే సమాజం క్షేమంగా ఉన్నది. ఒకడు కష్టించి పనిచేస్తాడు. ఇంకొకడు

ఆలోచించి చేస్తాడు. అంతేకానీ, 'మీరేమీ కష్టపడరు, ఆలోచించరు, పనిచేయరు, కూర్చుంటారు' అంటే వాడు ఆలోచించడం వల్లనే ఇంకొకడు పనిచేస్తున్నాడు. ఇంజనీరు టేబుల్ మీద కూర్చుని ప్లాన్ గీస్తాడు. కార్మికుడు దానిని తీసుకొని ఒక బిల్డింగ్‌గా రూపకల్పన చేస్తాడు. ఆలోచించే వారు కొంతమంది, అమలుపరచేవారు కొంతమంది, నిర్వహణ చేసే వారు కొంతమంది, లెక్కలు చూసేవారు కొంతమంది, చిట్టచివరికి దానిని నిర్మించేవారు కొంతమంది ఉన్నారు. ఏ పనికైనా వీరందరూ ఉంటారు, వాటినే చాతుర్వర్ణ్యాలు అన్నారు.

**భారతదేశానికి వచ్చేసరికి వర్ణవ్యవస్థ ఎత్తి చూపిస్తారు కానీ మీరు గమనించినట్లయితే ప్రతి నాగరిక సమాజంలో ఇది ఉన్నది. అయితే భారతదేశంలో ప్రబలమైన కుటుంబ వ్యవస్థ ఒకటి ఉన్న కారణంగా ఇటువంటివి ఎక్కువ తక్కువలు లేకుండా పరంపరాగతంగా కొనసాగుతూ ఒక వ్యవస్థ ఏర్పరచారు. ఆ వ్యవస్థ వల్ల అనేకరకాల ప్రయోజనాలు పొందారు.**

ఇందులో ప్రతివారికీ ఇలా ఉండాలి అని శాస్త్రం విధులు చెప్పింది. సామాన్య ధర్మాలు, విశేష ధర్మాలు అని రెండు రకాల ధర్మాలను ఇచ్చింది. అన్ని వర్ణములకూ సామాన్య ధర్మములు ఉన్నాయి. సత్యము, అహింస ఇత్యాదులన్నీ చెప్పారు. విశేష ధర్మములు అంటే ఒక్కొక్క వర్ణానికి ఒకొక్కటి.

అక్కడినుంచి ఇక్కడి వరకూ వీరందరూ ఒకే పరమపురుషునియొక్క శరీర స్వరూపము అని చెప్పారు. అద్భుతమైన రూపకల్పన పురుషసూక్తంలో కనబడుతున్నది.

**బ్రాహ్మణోస్య ముఖమాసీత్, బాహూ రాజన్యః కృతః ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత** – ఇందులో చెప్పిన విశాలమైన భావాన్ని గ్రహించలేక దీనినీ సంకుచితంగా చూడడం మొదలుపెట్టారు. దానినే తామసబుద్ధి అనుకుంటే సరిపోతుంది. స్పష్టంగా సమాజ స్వరూపాన్ని చూపిస్తున్నాడు. ముఖం అంటే అవయవం కాదు, స్థానం. ఇది తెలియక పరమపురుషునికి కాళ్ళ దగ్గరా మేము? మీరేమో నెత్తిమీదా? అని. పరమేశ్వరా అని పాదాలు పట్టుకుంటారు కానీ నెత్తి

పట్టుకోరు ఎవరూ! పైగా ఇది బొమ్మ కాదు, విరాట్పురుషుని స్థానములు.

ఆలోచించి, ఆచరణ చేసే స్థానం – బుద్ధి. రక్షించి నడిపే స్థానం – చెయ్యి, వీటిని సమతులన(బ్యాలెన్స్) చేసే స్థానం – ఊరువులు. ఈ సమాజానికి ఒక గతిని ఇచ్చే స్థానం పాదములు. ఈ నాలుగూ కలిపి పరమేశ్వర చైతన్యం.

ఈ చాతుర్వర్ణ్యములు విడివిడిగా కనబడడమే కాకుండా ప్రతివ్యక్తిలో చాతుర్వర్ణ్యం ఉంటుంది. ఆలోచించినప్పుడు బ్రాహ్మణుడు, తనకి తాను వ్యవస్థ ఏర్పరచుకొని రక్షణాదులు కల్పించుకున్నప్పుడు వాడే క్షత్రియుడు, వాడికంటూ లెక్క వ్రాసుకొని కుటుంబ నిర్వహణ చేసుకునేటప్పుడు వాడే వైశ్యుడు. వాడి సేవ వాడు చేసుకునేటప్పుడు వాడే శూద్రుడు. పరిశీలిస్తే ప్రతివాడిలోనూ ఈ నాలుగు ఉంటాయి.

అయితే ఇందులో ప్రధానంగా వ్యవస్థ ఏర్పరచినప్పుడు ఒక క్రమం ఉన్నది గనుక ఒకరికొకరు సహకరించుకుంటూ ఉంటారు. అంతేకాక ఈ స్వభావం ఉన్న కారణంగా వాడికి ఆ పనిమీద ప్రీతి కలుగుతుంది.

వారు ఎండలలో కష్టం ఓర్చి పంటపొలాలలో కష్టపడుతున్నారు అని ఒకాయన అంటే, అతను ఏసి కారులో వెళ్తూ అతని స్థితిని వారిమీద ఆరోపించుకొని అయ్యో వాళ్ళు కష్టపడుతున్నారు అనుకున్నారు కానీ వారు అతనిలా బాధపడట్లేదు. వారి శరీరం దానికి తగ్గట్లు పనిచేస్తోంది. కొందరికి నెత్తురు చూస్తే భయం. ఇలా అందరూ అయితే డాక్టర్లు ఉండరు. వాడి ప్రవృత్తి వాడిది. భగవంతుడు ఇలా వివిధములైన ప్రవృత్తులు సమాజగతి కోసం వారి గుణాలను అనుసరించి పెట్టాడు. ఎక్కువ తక్కువలు ఎక్కడా లేవు. వీరందరూ తరిస్తారు అనే చెప్పాడు.

ఆ మాట గౌతముడు ధర్మసూత్రాలలో చెప్పాడు – **వర్ణాశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫలం అనుభూయ తపః శేషేణ విశిష్ట దేశజాతికులధర్మ ఆయుశ్రుత వృత్త విత్త సుఖమేధసో జన్మప్రతిపద్యంతే** – వర్ణాశ్రమాలలో వారికి శాస్త్రం విధించిన దానిని చక్కగా చేస్తే, జన్మాంతరం స్వర్గాదిలోకాలలో ఉత్తమమైన సుఖాలు అనుభవించి, ఇప్పటి జన్మను మించిన ఉత్కృష్టస్థితిని పొందుతారు.

ఎవరెవరి గుణములు ఏమిటో వివరిస్తున్నారిక్కడ.

## అన్ని వర్ణముల వారికి సామాన్య ధర్మాలు

**ధృతిః క్షమా దమోఽ స్తేయం శౌచం ఇంద్రియనిగ్రహః,**

**ధీర్విద్యా సత్యం అక్రోధో దశకం ధర్మలక్షణమ్.**

సత్యము, అహింస, శౌచము, అక్రోధము, మొదలగునవి సర్వవర్ణములకూ సామాన్య ధర్మములుగా చెప్పారు.

ప్రొద్దున లేచి జపం, తపం, హోమాలు చేసుకుంటూ కూర్చుంటాము అంటే పండించేవాడు ఎవడు? వాడు ప్రొద్దున లేచి నోరు పుక్కిలించి నాగలి భుజాన వేసుకొని వెళ్ళాల్సిందే. వాడిదీ యజ్ఞమే, వీడిదీ యజ్ఞమే. సమాజంలో అన్నిరకాలూ ఉండాలి. ఎప్పుడు ఎవరి అవసరం పడుతుందో వాడే దేవుడు.

అందుకే మేం అందరిలో దేవుడిని చూస్తాం. కుండలు చేసే వాడిలో, కుమ్మరి, కమ్మరి ఎవరైనా భగవత్ స్వరూపమే. **'నమో కులాలేభ్యః కర్మారేభ్యశ్చ నమో నమః'**. వివిధ వృత్తులలో భగవంతుని చూసేటటువంటి భావాన్ని వేదసంస్కృతి నేర్పుతున్నది. **'వాణిజాయ కక్షాణాం పతయే నమః'** – వాణిజ్యవేత్తలుగా ఉన్న రుద్రునికి నమస్కారం. కులాలుని రూపంలో ఉన్న రుద్రునికి నమస్కారం. **'క్షేత్రాణాం పతయే నమః'** – పొలాలను నడిపేవారికి నమస్కారం. **'ఉపవీతినే నమః'** – యజ్ఞోపవీత సంస్కారం కలిగి యజ్ఞాలు చేసేవాడికి నమస్కారం. ఇన్ని రూపాలతో ఉన్న పరమేశ్వరునికి నమస్కారం. సమాజ స్వరూపాన్ని అలా చూడాలి.

భేదభావంతో చూస్తూ ఒకరిపట్ల ఒకరు ద్వేషం పెట్టుకోవడం అనేది తగదు. రాజస–తామసాల ప్రవృత్తి. అది లేకుండా ఒకరినొకరు గౌరవించుకోవడం, సామరస్య భావనతో ఉండడం తెలుసుకోవాలి.

వర్ణాలను సాంకర్యం చేయడం కాదు, వర్ణాలలో సామరస్యం సాధించాలి. వర్ణాశ్రమ వ్యవస్థ లేని ఒకానొక సమాజాన్ని ఏర్పరచుకోవడం భ్రాంతిమాత్రమే. ఎందుకంటే ఈ పేర్లు కాకపోతే వేరే పేర్లతో ఉంటాయి. ఇక్కడ caste ఉంటే అక్కడ class ఉంటుంది. ఎక్కడికక్కడ classification లేకపోతే society లేదు.

classification ఉన్నది అంటేనే వర్గవిభజన ఉన్నది.

ఒక కార్యాలయం ఉంటే అక్కడ ఉన్నతాధికారి మొదలుకొని కూలీల వరకూ ఎన్నో విభాగాలు ఉంటాయి. అందులో ఎవడు గొప్పవాడు? ఎవడి స్థానం వాడికి గొప్ప. తన స్థానానికి తాను న్యాయం చేసేవాడే భగవంతుడి దృష్టిలో ఉత్తముడు. ఒక స్తంభం భవంతిలో ఎంత ముఖ్యమో దానిని బిగించే శీల కూడా అంతే ముఖ్యం. శీల స్తంభమైనా, స్తంభం శీల అయినా భవంతి కూలిపోతుంది. దేని స్థానం దానిదే.

ఒకసారి చేతి అయిదువేళ్ళు యుద్ధం చేశాయిట. బొటనవ్రేలు అనుకుంది – నేను మీ అందరికంటే లావుగా ఉంటాను, కనుక నేను చాలా ముఖ్యం అని. అప్పుడు చూపుడు వేలు – నేనేం తక్కువా? ఎవరిని చూపించాలన్నా నేనే, చిన్ముద్ర పెట్టాలంటే నీకు నేను తగలాలి. లేకపోతే నీ బ్రతుకేమిటి? అన్నది. వెంటనే మధ్యవేలు అందరికంటే నేనే పొడుగు అన్నది. రాజుగారికి కిరీటం పెట్టినట్లు ఉంగరమైనా, పవిత్రమైనా నాకే పెడతారు అన్నది అనామిక. నమస్కారం చేయాలన్నా మొదట నేనే కనబడతాను, కనుక నేనే గొప్ప అన్నది చిటికెన వ్రేలు. ఇలా అయిదూ కొట్టుకుంటే ఏమౌతుంది? ప్రతిదీ గొప్పదే. ఇది సమాజం యొక్క స్వరూపము. **ఎప్పుడూ ఏకత్వం కాదు, భిన్నత్వంలో ఏకత్వం ప్రధానమైన సూత్రం.**

**'అవిభక్తం విభక్తేషు** – భేదదృష్టితో చూడకు, భేదములన్నింటిలో ఒక్కడే ఉన్నాడు' అని భగవానుడే చెప్పేశాడు. సమత్వం ఆత్మదృష్టితో ఏర్పడుతోంది. **ఉపాధి దృష్టితో సమత్వం సాధ్యం కాదు. సామరస్యం సాధ్యం చేసుకోవాలి. విషమంగా కనబడుతున్న ఉపాధులలో సామరస్యం ఉంటే సమత్వాన్ని తెలుసుకోగలరు.** సమాజంలో సామరస్యం ఆవశ్యకత ఉన్నది. కనుక ఒకరు ఇంకొకరిని గౌరవించడం నేర్చుకోవాలి. దేని అవసరం వచ్చినప్పుడు వాడే భగవంతుడు. ఇది సమాజంలో తెలుసుకోవలసిన విషయం.

భారతదేశంలో ఒక వర్ణానికి చెందినవాడే తరిస్తాడు అని ఎక్కడా చెప్పలేదు.

ఈ విషయంలో మహాభారతం అద్భుతమైన చర్చ చేస్తుంది. అన్నీ చదవాలి. అవన్నీ చదవకుండా మాట్లాడుతున్నారు. వీరి దృష్టి హిందూధర్మం అర్థం చేసుకోవడం కాదు, హిందూధర్మాన్ని ముక్కలు చేయడమే కనుక వాళ్ళు విభేదాలు, విషాలే చెప్తారు, అవే మనవారు చూస్తారు. అవి పట్టుకొని మతాల పేరుతో వచ్చి హిందూధర్మాన్ని చీల్చేవారు చాలామంది కనబడుతున్నారు. సరిగ్గా అర్థం చేసుకుంటే తెలుస్తుంది.

ఒకసారి భారత కథలలోకి వెళ్ళినా, ఇతర పురాణములలోకి వెళ్ళినప్పటికీ సమాజం ఎలా ఉండేదో తెలుస్తుంది. అంత ఎందుకు? ఒకప్పుడు భారతదేశంలో పల్లెలు ఎలా ఉండేవో చూడాలి. అక్కడ ఒక విప్రుడు ఉంటాడు, ఇతర వర్ణాల వాళ్ళు ఉంటారు. వాళ్ళందరూ అమ్మ, అక్క, బాబాయ్, బావ అని పిలుచుకుంటూ ఉంటారు. కానీ ఎవరి ఆచారం, ఎవరి విహారం, ఎవరి ఆహారం వారిదే. నిన్నమొన్నటి వరకూ చక్కగా కొనసాగింది ఈ వ్యవస్థ. వైషమ్యాలు ఎందువల్ల ఏర్పడ్డాయి అంటే కలి ప్రభావం. అది తెలుసుకునే ప్రయత్నం చేయాలి.

భారతంలో నహుష ప్రశ్నలో 'ఎవరు గొప్పవాడు?" అనే దానిని చక్కగా చూపిస్తారు.

సమాన ధర్మములు 'ధృతి క్షమాదమోஉ స్తేయం' అని అందరికీ చెప్పుకున్నాం. ఇవి ఎవరిలో ఎక్కువగా ఉంటే వాడు శూద్రవర్ణుడు అయినప్పటికీ బ్రాహ్మణసముడై తప్పకుండా తరిస్తాడు. ఈ గుణాలు కానీ బ్రాహ్మణునిలో లేకపోతే 'నిజము శూద్రుకన్న నీచతముడు' – ఎఱ్ఱనగారు అనువాదంలో చెప్పారు. ఈ గుణాలు ఉండాలి. అయితే ఈ గుణాలు ఎలా ఉన్నప్పటికీ కూడా పరంపరాగతంగా ఏ వర్ణం వారికి వచ్చిన ధర్మాన్ని వారు కాపాడుకుంటూ తరువాతి తరాల వారికి అందివ్వాలి.

ఈ భేదం ఎక్కడైనా ఏదో ఒక రూపంతో ఉంటుంది. ఇక్కడ జన్మతః వచ్చిన వర్ణరూపంలో కనబడుతోంది. మరొకచోట వృత్తిరీత్యా వచ్చినవి వాటి వాటి పద్ధతులలో కనబడుతున్నాయి. ప్రపంచం అంతా మూడు గుణాలతో ఉన్నప్పుడు

ఈ విభాగం ఎక్కడైనా ఉంటుంది.

ఇప్పుడు వర్ణములు, కులములు లేవు అంటే ఎవరు ఒప్పుకుంటారు? ముందు రాజకీయనాయకులు ఒప్పుకోరు. వర్ణాలు, కులాలు లేవంటే ముందు వారి పబ్బం గడవదు. వాళ్ళు ఆ చీలికలు తెస్తూనే ఉంటారు. సమాజ హితైషి, అందరికోసం శ్రమిస్తున్నాం అని పేర్లు పెడతారు కానీ వాడు వచ్చాక వాళ్ళ వాళ్ళ కోసమే శ్రమిస్తాడు. అన్ని స్థానాలలో వాళ్ళ వాళ్ళనే పెడతాడు. ఇదివరకు వాళ్ళ వాళ్ళు ఎవరైతే ఉన్నారో వారందరినీ ధ్వంసం చేయడమే తన పాలనలో ప్రధానంగా పెట్టుకుంటారు. ఇలాంటి సమాజంలో కులాతీత, వర్ణాతీత అని మాట్లాడడం అనేది వెట్టిమాట. నిజాయితీగా మాట్లాడితే పూర్తిగా వర్ణాల వైషమ్యం వ్యాపించింది కానీ వర్ణవ్యవస్థ లేదు. వర్ణవ్యవస్థ అంటే ఒకరినొకరు గౌరవించుకోవడం, ఎవరి పని వారు చేయడం. ఒకరిపట్ల ఒకరికి సామరస్యం, సహకారం వర్ణవ్యవస్థ స్వరూపం. పరస్పర వైషమ్యాలు కావు.

ఒకాయన మహాతపస్సు చేశాడు, వేదవేదాంగాలు చదివాడు. తపస్సుతో వచ్చిన కోపంతో కాకిని చూడగానే అది తగులడింది. దాని తర్వాత పశ్చాత్తప్తుడై మాంసవిక్రయశాల నడుపుతున్న ధర్మవ్యాధుని దగ్గరికి వెళ్ళాడు. ధర్మవ్యాధుడు ఆయనకు ధర్మాన్ని బోధించాడు. ఆయన తన కర్మ తాను చక్కగా చేస్తున్నాడు. కానీ శమము, దమము, విచారణ, పితృభక్తి, మాతృభక్తి, దైవభక్తి... అన్నీ ఆయన దగ్గర ఉన్నాయి. ఆయన బోధక స్థానంలో ఉన్నాడు, ఈయన శిష్యస్థానంలో ఉన్నాడు.

**జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరా యా సంవిదుజ్జృంభతే**
**యా బ్రహ్మాది పిపీలికాంత తనుషు ప్రోతా జగత్సాక్షిణీ**
**సైవాహం న చ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తి చే**
**చ్చాణ్డాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ.**

అని చెప్పిన జగద్గురువుల పరంపరకు చెందినవాళ్ళం మనం.

అందుకే సామరస్యం కావాలి, సాంకర్యం కాదు. ప్రతిదానిని వారి మర్యాదను

పూజ ముందు పసుపు ముద్ద చేసి గణపతిని దానిలో కూర్చోబెట్టగలుగుతున్నామంటే ఎంత గొప్పసంస్కృతి మనది!

వరలక్ష్మీ వ్రతాలు చేస్తాం. అమ్మవారి నవరాత్రులు చేస్తాం. విష్ణుపూజ చేసినవారు కూడా కలశం పెడతారు. కలశంలో నీళ్ళు పోసి, పైన ఒక కొబ్బరికాయను పెడతాం. కలశానికి ముక్కు ఉందా? చెవి ఉందా? ఏమీ లేవే! మరి అక్కడ ఏం ఉంది? కలశం పెట్టి సత్యనారాయణ స్వామిని పెడితే అందులోకి సత్యనారాయణ స్వామి వచ్చాడు. పసుపు ముద్ద పెడితే గణపతి వచ్చి కూర్చున్నాడు. వరలక్ష్మీ వ్రతానికి కూడా కలశమే ప్రధానం. రూపం అంటే ఒక ప్రీతి ఉండడం చేత రూపాన్ని అక్కడ పెడుతున్నారు. తప్పేం లేదు కానీ కలశమే ప్రధానం. అందులో నీరే ప్రధానం. కలశానికి రూపం ఉందా? దీనిని బట్టి మనం విగ్రహాలనే పూజిస్తున్నామా? కలశంలోని నీటిలో కూడా భగవంతుని పూజిస్తున్నాం.

గుండ్రటి సాలగ్రామశిలలో పూజిస్తున్నాం. ఏం? సాలగ్రామశిలలో సహజంగా విష్ణుస్వరూపం ఉంది. నర్మదబాణంలో సహజంగా శివస్వరూపం ఉంది. స్ఫటికంలో సహజంగా సూర్యరూపం ఉంది. శోణానదిలో ఉన్న ఎర్రటిరాతిలో సహజంగా గణపతి రూపం ఉంది. సువర్ణముఖరిలో దొరికే ఒక శిలలో అమ్మవారిరూపం ఉంది. వీటిలో ప్రతిష్ఠ చెయ్యకపోయినా దేవత ఉంటుంది. వీటిని ఇంట్లో పెట్టుకున్నప్పుడు నియమం ఇంకా ఎక్కువ ఉండాలని చెప్పారు. అర్చన లేకుండా ఉండరాదు. అదే మామూలుగా విగ్రహాలైతే మనం ఏ ఊరో వెళ్ళినప్పుడు పూజ చెయ్యకపోయినా తిరిగి వచ్చి శుభ్రం చేసుకొని, సంప్రోక్షణ చేసుకుని పూజ చేసుకోవచ్చు. ఇవి పెట్టుకుంటే మాత్రం జాగ్రత్తగా ఉండాలని చెప్పారు పెద్ద వాళ్ళు.

ముంబైలో జరిగిన ఒక సంఘటన – ఒకరి ఇంట్లో యజమానికి ఏదో తెలియని అనారోగ్యం. ఎన్ని రకాల చికిత్సలు చేయిస్తున్నా బాగుండడం లేదు. దానికై వారు జ్యోతిష్య, మంత్రశాస్త్రవేత్తను కలిశారు. ఆయన ధ్యానం చేస్తూ

ఉంటే ఆయనకు ధ్యానంలో స్ఫురణ వచ్చింది. ఆధ్యాత్మిక సాధకునికి భగవంతుడు కొన్ని సత్యాలు స్ఫురింపజేస్తూ ఉంటాడు. ఆ స్ఫురణతో వారు చెబుతారు. 'మీ ఇంట్లో పూజించకుండా ఏదో ఉంది, వెతకండి' అని చెప్పారు. 'మా ఇంట్లో విగ్రహాలు ఉన్నాయి, రోజూ పూజ చేస్తాం' అన్నారు. 'కాదు ఏదో ఉంద'ని చెప్పారు. 'వెతికాం, కనబడలేదు' అన్నారు. ఆయనేదో అబద్ధం చెప్పాడు అనుకున్నారు.

వారం రోజుల తరువాత వారి ఇంటి పుస్తకాల అరని సర్దుతూ ఉంటే పుస్తకాల వెనకాల ఒక పొట్లం ఉంది. ఆ పొట్లంలో సాలగ్రామం ఉంది. పూజ లేకుండా అది అక్కడ ఉంది. 'దొరికిందండీ' అని వెంటనే ఫోన్ చేసి చెప్పారు. ఆ సాలగ్రామాన్ని ఎప్పుడో ఏడాది క్రితం ఇంటికి వచ్చినవారు కానుకగా ఇచ్చారు, ఈయన పక్కన పడేశాడంతే. 'మళ్ళీ దానిని కడిగి పూజ ప్రారంభించండి' అన్నారు. ప్రారంభించిన రెండవరోజు నుంచి ఆయన ఆరోగ్యం బాగుపడి స్వస్థుడు అయ్యాడు. అక్కడ అది ఉందని కూడా తెలియలేదే! దాని ప్రభావం అది చూపించిందా! లేదా! అంటే మన నమ్మకంతో పని లేకపోయినా సాలగ్రామం ప్రభావం చూపించగలదు.

## మనం ఆవాహన చేస్తే భగవంతుడు వస్తాడా!

ఇంట్లో విగ్రహం పూజించేటప్పుడు ఎలా జరుగుతుందో ఆ క్రమపద్ధతి తెలియాలి. దీనిని శాస్త్రాలు ఎంతో అద్భుతంగా చెప్పాయి. **'ఆహూత, సన్నిహిత, వ్యాపక'** అనే మూడు పద్ధతులతో దైవశక్తి విగ్రహంలోకి వస్తుంది. ఇక్కడ విగ్రహం అని మనం అంటాం. బింబం అంటుంది శాస్త్రం. అది యంత్రమైనా కావచ్చు. ముగ్గు పెట్టి దేవతను ఆహ్వానించడం కూడా కనబడుతోంది. పసుపు ముద్ద కావచ్చు, నీరు కావచ్చు, రాయి కావచ్చు, మట్టి కావచ్చు.

మట్టిముద్దను కూడా చేసి భగవంతుని ఆవహింపజేస్తాం. ఆవాహన అని ఒక ప్రక్రియ ఉంది కదా! అంటే ఉన్న శక్తిని దానిలోకి తీసుకుని వస్తున్నాం. రాగితీగలోకి విద్యుచ్ఛక్తిని ప్రవేశింపజేసినట్లు, విగ్రహంలోకి దైవశక్తిని

ప్రవేశింపజేస్తున్నాం. ఈ ప్రవేశింపజేసే పద్ధతి మూడు విధాలుగా వెళుతుంది.

భావంతో ప్రవేశింపజేస్తే భగవంతుడు వస్తాడు. కానీ అంత భావనాబలం మనకు లేదు కాబట్టి మరొక బలం సహాయం తీసుకోమని శాస్త్రం చెప్పింది. ఉదాహరణకి ఒక కుర్చీని ఎత్తుదామని ప్రయత్నిస్తే మన వల్ల కాకపోతే ఎవరినైనా సహాయం చెయ్యమని పిలుస్తాం. బలం చాలకపోతే ప్రక్క బలం తీసుకోవాలి. ఇప్పుడు భగవంతుని విగ్రహంలో పెట్టడానికి మన భావనాబలం చాలలేదు కదా! మరొక బలం కావాలి. ఆ బలం పేరు – మంత్రబలం. మన భావనాబలంతో పాటు మంత్రబలం కలిస్తే అందులోకి భగవచ్ఛక్తి ప్రవేశిస్తుంది.

మన భావం మనది కనుక లోపం ఉండవచ్చు. మంత్రం ఋషులు ఇచ్చారు కనుక దానికి లోపం ఉండదు. దేవతని ఆవాహన చేసినప్పుడు మంత్రం చెప్తూ దర్భ పెట్టడం, అక్షతలు వెయ్యడము, పువ్వు పెట్టడము చేస్తూ ఆవాహన అనే ప్రక్రియ చేస్తాం. అప్పుడు మనం నమ్మినా, నమ్మకపోయినా మన భావానికి మంత్రం కలిసి అందులోకి దేవతాశక్తి ప్రవేశిస్తుంది. ఆ ప్రవేశించిన దేవతాశక్తిని మనం పూజ చేస్తాం.

పూజంతా చేసిన తరువాత ఉద్వాసన అంటాం. ఉద్వాసన అంటే ఆ సర్వశక్తిమంతుడైన భగవంతుని అందులో ఆవాహన చేసి అందులో పెట్టిన ఈశ్వరశక్తిని మన లోపలికి తీసుకుని మన శరీరమంతా దైవశక్తిమయం చేసుకుంటాము. ఇదీ ఉద్వాసన.

విగ్రహమే దేవుడు అనుకున్నట్లైతే... ఇవాళ పూజ చేసి రేపు నిమజ్జనం ఎందుకు చేస్తాం? కనుక కొన్నింటిని అప్పుడు పూజించి అప్పటికప్పుడే నిమజ్జన చెయ్యాలి. కొన్నింటి యందు ప్రతిష్ఠ చేసి రోజూ పూజ చేసుకోవచ్చు. ఆహూత, సన్నిహిత, వ్యాపక అని దాని పద్ధతులు పెద్దలు ఏర్పరచారు.

ఈ మధ్య ఒక అణుశక్తి శాస్త్రవేత్త ఒక పరికరం కనిపెట్టాడు. ఆ పరికరంతో ఒక వస్తువు నుంచి వచ్చే సానుకూల శక్తితరంగాలు(పాజిటివ్ ఎనర్జీ), ప్రతికూల శక్తితరంగాలు(నెగెటివ్ ఎనర్జీ) కూడా కొలవగలుగుతున్నారు. దానిని ప్రత్యక్షంగా

చూడడం జరిగింది. అతను వ్రాసిన వ్యాసాలు పాశ్చాత్య మేధావులు కూడా అంగీకరించారు. ఆ వ్యాసాలలో ఆయన 'ఈ పరికరం కొన్ని వస్తువుల దగ్గర పెడితే సానుకూలశక్తి తరంగాలు వస్తాయి. కొన్ని చోట్ల నుంచి ప్రతికూల శక్తితరంగాలు వస్తాయి' అని చెప్పాడు. అంతేకాదు ఆ పరికరాన్ని తులసి చెట్టు దగ్గర పెడితే సానుకూల శక్తితరంగాలు కొన్ని మీటర్లు వచ్చాయి. అలాగే మనం పూజించే ఆలయాలలో ఆ పరికరాన్ని పెడితే ఆ శక్తిని చాలా అద్భుతంగా అది కొలవగలిగింది.

అంతకు ముందు కెర్లియన్ ఫొటోగ్రఫీలో ఒక ఆలయం, ఒక దేవుని చుట్టూ ఉన్న తేజస్సును కూడా అది ఫొటో తీయగలిగింది. అలాంటి శక్తులు ఉన్నాయి. అలా తులసి, మారేడు, రావి, మర్రి చెట్లు నుంచి దివ్యశక్తి తరంగాలు రావడం ఆ పరికరం కొలవగలిగింది. పరికరం ఇప్పుడు వచ్చింది కానీ చెట్టులో శక్తి ఎప్పుడూ ఉంది. **ఇప్పుడు పరికరం చూపిస్తే నమ్ముతున్నాం, అంతకు ముందు మన ఋషిశాస్త్రజ్ఞులు ఏ పరికరంతో ఈ శక్తిని తెలుసుకున్నారో మనకు తెలియదు. పెద్దలు చెప్పింది నమ్ముతూ మనం పాటిస్తూ ఉంటే ఎప్పటికైనా విజ్ఞానవేత్త వచ్చి అది సత్యం అని ఋజువు చేస్తాడు. అంతవరకు పాటించకపోతే నష్టపోతాం.**

మరొక అద్భుతమైన విషయం – ఒక చిత్రపటానికి చందనం పెట్టి, కుంకుమ పెట్టి ఆ పరికరంతో చూసినా ఎంతో శక్తి వస్తోంది. దేవతాచిత్రపటాలను పటాలే కదా అని తీసిపారేయవద్దు. వాటిలో ఉండే శక్తి సామాన్యమైనది కాదు. అత్యద్భుతమైన శక్తితరంగాలు దానిలో వస్తూ చుట్టూ ఉన్న ప్రతికూలశక్తులను తీసివేస్తాయి.

ఇంతవరకు శాస్త్రసమ్మతితో చూపించాం. అద్భుతమైన చిన్న తర్కంతో చెప్పి విగ్రహారాధన విషయాన్ని మనం ముగించుకుందాం. విగ్రహం అంటే ఒక చిత్రపటం. దానిని చూడడం వల్ల భగవంతుడు గుర్తుకు వస్తాడు.

సృష్టిలో విగ్రహారాధకులు కానివారు ఎవరో చెప్పండి! ప్రతివారు ఒక అద్భుతమైన దృశ్యం చూస్తే వెంటనే ఫొటోలు తీసి చూసుకుంటూ ఉంటారు.

ఇది చూసుకున్నప్పుడు వానికి అది గుర్తుకు వస్తోంది. అంతే కాదు, ఒక నాస్తికుడు వాడి నాస్తిక గురువు పోయిన తరువాత ఆయన విగ్రహం పెట్టాడు. పెట్టిన తరువాత ఎవరో ఒక ఆస్తిక గుంపు వచ్చి ఆ విగ్రహాన్ని కొట్టి వేసింది. ఇంక వారికి కోపం వచ్చి కనిపించిన ప్రతి దుకాణం తగులబెట్టారు, బస్సులు తగులబెట్టారు. ఎందుకంటే 'మా నాస్తిక నాయకుని విగ్రహం పగులగొడతావా!' అని.

విగ్రహం మీద నమ్మకం లేని వారికే వారి నాయకుని విగ్రహం తగులబెడితే అంత భావం కలిగిందే! నమ్మకం ఉన్నవారికి ఎంత శక్తి ఉంటుందో ఆలోచించాలి. ఇంతవరకు శాస్త్రం అంతా చెప్పుకున్నాం. సాధారణ జ్ఞానంతో ఆలోచించినా హిందూమతానికి మించిన మతం లేదు.

ఒక ఇంట్లో తండ్రి ఊరు వెళ్ళాడు. పిల్లవాడు– "అమ్మా! నాన్న ఎప్పుడు వస్తాడు?" అని పదే పదే అడుగుతూ ఉంటే వారం రోజులలో వస్తారని చెప్పింది. వాడు రోజూ లెక్క పెట్టుకుంటూ అనుకుంటున్నాడు. ఏడు రోజులైంది, వాళ్ళ నాన్నకి ఏదో పని వచ్చి రాలేదు. పిల్లవానికి ఏడుపు వచ్చింది. నాన్నని చూడాలనే తపన. అమ్మ ఎంత ఓదార్చినా వీడి తపన పోవడం లేదు. ఒక రోజు గదిలో కూర్చుని వాళ్ళ నాన్న ఫొటో చూసుకుని, "నాన్నా! ఎప్పుడొస్తావు?" అని ఏడుస్తున్నాడు.

"తింటావా నాన్న! ఇదిగో చాక్లెట్ తీసుకో" అని అంటున్నాడు. ఈ లోపల నాన్న వచ్చాడు. కానీ వాళ్ళ నాన్న వచ్చినట్లు పిల్లాడు గమనించలేదు. కిటికీ లోంచి నాన్న గదిలోకి చూశాడు. ఆ పిల్లవాడు, "నాన్నా! తీసుకో నాన్నా! తీసుకో నాన్నా!" అని ఫొటోకి చాక్లెట్ పెడుతున్నాడు. ఆ ఫొటో వల్ల వాడికి నాన్న గుర్తు వచ్చాడు, నాన్న ప్రేమ గుర్తు వచ్చింది. ఇన్ని గుర్తు వచ్చి, "నాన్నా! తీసుకో నాన్నా! తీసుకో" అని ఏడుస్తూ ఉంటే కిటికీ లోంచి చూసిన వాళ్ళ నాన్నకి మనసు కరిగిపోయింది. "నా మీద ఇంత ప్రేమా!" అని ఒక్కసారిగా వచ్చి ఆ పిల్లవాడిని గట్టిగా ఆలింగనం చేసుకున్నాడు.

ఇప్పుడు ఆ పిల్లాడు ఫొటోని ప్రేమిస్తున్నాడా? నాన్నని ప్రేమిస్తున్నాడా? వాడు ఆ ఫొటో చూస్తూ నాన్నా.. నాన్నా.. అని ఏడుస్తూ ఉంటే కిటికి లోంచి చూసిన నాన్న ఎత్తుకున్నాడే, ఎందుకంటే కిటికీ లోంచి చూశాడు కనుక, అక్కడ ఉన్నాడు కనుక. నాన్న అక్కడ ఉన్నాడని వీడికి తెలియదు. తెలియక పటాన్ని చూసుకుంటూ ఉంటే, తెలిసి నాన్న పట్టుకున్నాడు. వాడి నాన్న అప్పుడు కిటికీలోకి చూశాడు కనుక పిల్లవాని ప్రేమ తెలిసింది. కాని అందరికి తండ్రి అయిన పరమాత్మ ఎప్పుడూ ఉంటాడు, చూస్తూ ఉంటాడు. ఆయన ఫొటో పెట్టుకుని, "నాన్నా! నారాయణా! నాన్నా! కృష్ణా! నాన్నా! వేంకటేశా!" అంటూ ఉంటే ఆయన తప్పకుండా చూస్తాడు. "నాపై ఇంత ప్రేమ ఉంది కదా" అని నిన్ను గట్టిగా ఆలింగనం చేసుకుంటాడు. అదే చాలు!

ఒక వస్తువును ఒక ప్రతీకగా చూడడం మానవ స్వభావం!. ఒక దేశానికి ఒక జెండా ఉంటుంది. ఒక సంస్థకి ఒక లోగో ఉంటుంది, ఒక చిహ్నం ఉంటుంది. ఒక మతానికి ఒక విగ్రహం ఉంటుంది, ఒక ప్రతీక ఉంటుంది. ఇది సహజం. **మానవ స్వభావం బొమ్మని చూసి భావాన్ని తెలుసుకోవడం. ఒక చిత్రాన్ని చూసి తాదాత్మ్యం చెందడం. ఈ స్వభావాన్ని సాధన కోసం మలచారు ఋషులు. సాధనకు ఎలా వాడుకోవాలో దానిని శాస్త్రీయం చేశారు ఋషులు. ఇదీ భారతీయ సనాతనధర్మంలో విగ్రహారాధనకి ఉన్న ప్రాధాన్యం. అయితే భగవంతుని విగ్రహంలో కూడా పూజించాలి కానీ విగ్రహంలో మాత్రమే కాదు.**

ఈశ్వరశక్తి అంతటా వ్యాపించి ఉన్నప్పటికీ కొన్నిటిలో అధికంగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ ప్రకాశిస్తున్న దానిలో ఈశ్వరభావంతో ఉపాసన చేస్తే సంపూర్ణమైన ఈశ్వరశక్తిని తెలుసుకునే అవకాశం ఉంటుంది. ముందు కిటికీలో సూర్యుని చూడు, అంతేకాని కిటికీలోనే సూర్యుడు ఉన్నాడు అని అనుకోకు. ఆ తరువాత తలుపు తెరిచి బయటకు వెళితే అంతా సూర్యుడే అని తెలుసుకుంటావు. అలా పరిమితంగా ఒక చోట ముందు భగవంతుని ఉపాసించగలిగితే తరువాత అంతా భగవంతుడే అనే ఎరుకలోకి వెళతాము. పరమాత్మ దీనికే 'విభూతియోగం'

అని పేరు పెట్టాడు. అది చిన్న ఉదాహరణతో తేటతెల్లం చేసుకుందాం.

**యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జితమేవవా,**

**తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశ సంభవం.** (శ్రీమద్భగవద్గీత)

ఆయనను ఎక్కడెక్కడ దర్శించాలో తెలియజేస్తూ భగవద్గీతలో పరమాత్మ చెప్పిన మాట – **"రసోహమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశి సూర్యయోః – సూర్యునిలో, చంద్రునిలో వెలుగును నేను. నీటిలో దాహాన్ని పోగొట్టే శక్తిని నేను"** అని తానెక్కడుంటాడో ఆయనే చెప్పాక, తాను ఎలా ఉంటాడో కూడా చెప్పాక అది అవునో, కాదో అనే సందేహం మనకెందుకు? ఆయనే స్పష్టం చేశాడు.

ఇప్పుడు మనకు ఉండవలసింది అక్కడ నుంచి వస్తున్న శక్తి ఆయనే అనే భావన బలపరచుకోవడం. అదే ఆధ్యాత్మిక సాధన. ఆ భావన బలపరచుకోవడానికి ఎక్కడెక్కడ నుంచి ఈశ్వరశక్తిని పొందుతున్నామో, వాటిని ఎలా ఆరాధించాలో స్వామి చెప్తున్నాడు.

మొట్టమొదటగా 'సూర్యమండలమునందు నన్ను ఆరాధించినవారు నన్ను పొందగలరు'. ఇదే వేదము, వేదాంతము కూడా చూపిస్తున్నది. **'అంతరాదిత్య ఉపాసన'** అని ప్రత్యేకంగా ఉపనిషత్తే చెప్పింది. ఆదిత్యమండలంలో పరమాత్మ ఉన్నాడని భావించాలి. మనకు భూమండలానికి వస్తున్న శక్తి అంతా ఆదిత్యమండలంలో ఉంది. అంతరిక్షంలో ఎందరో సూర్యులు ఉన్నారు, ఆ రోజులలో ప్రపంచంలో ఎవరికీ తెలియదు కనుక అందరూ ఒకే సూర్యుడు ఉన్నాడు అనుకున్నారు. కాని ఒక్క భారతదేశంలో మాత్రమే సూర్యుడు ఒక్కడు అని ఆ రోజులలో కూడా అనలేదు. వేదంలో **'సహస్ర సూర్యతయా భాంతి'** అనే మంత్రం ఉంది. అనంతమైన సూర్యులు అంతరిక్షంలో ఉన్నారని యుగాల క్రితమే చెప్పినది భారతీయసంస్కృతి.

విజ్ఞానం ఎలా ఉందో చూడండి. అంతే కానీ భూమి బల్లపరుపుగా ఉండెను, సూర్యుడు అస్తమిస్తూ, ఉదయిస్తూ ఉంటాడు అనే భ్రాంతి హిందూధర్మంలో లేదు. స్పష్టమైన నిర్వచనం, దీనికి ప్రమాణాలు ఉన్నాయి. **'నోఽ దేతి నోఽ**

స్తమేతి' అని మంత్రం వేదంలో ఉంది. సూర్యుడు అస్తమించడు, ఉదయించడు. చూసేవారికి అలా కనబడుతున్నాడని కూడా వేదం చెప్పింది అంటే సూర్యసంబంధమైన జ్ఞానం ఎంతో చెప్పింది.

అలాంటి సూర్యుడు సాధారణ దృష్టితో చూస్తే ఎండని, వేడిని ఇచ్చే ఒక వస్తువు. సూర్యుడు అంటే వేసవికాలంలో వడియాలు ఎండబెట్టేవాడు అనుకున్నారట ఒకరు. అది పాశవిక దృష్టి. సూర్యుని వల్ల మనకి ప్రాణశక్తి వస్తోంది, జ్ఞానం వస్తోంది. ఆ సూర్యుడే అన్నప్రదాత అనేది వైజ్ఞానిక దృష్టి. ఇందాక చెప్పినది 'సాధారణ దృక్పథం'(లే–మ్యాన్ యాటిట్యూడ్). రెండవది 'వైజ్ఞానిక దృక్పథం'(సైంటిఫిక్ యాటిట్యూడ్). మనం ఈ రెండూ పట్టుకుని బ్రతికేస్తున్నాం. దీని పైన 'ఆధ్యాత్మిక విజ్ఞానం'(సూపర్ సైంటిఫిక్ యాటిట్యూడ్) ఉంది. అదే ఆధ్యాత్మిక ధృక్పథం, ఉపాసనా దృష్టి (స్పిరిచ్యువల్ యాటిట్యూడ్). ఉపాసనా దృష్టితో చూస్తే సూర్యుడు ఒక మండుచున్న అగ్నిగోళం, ప్రాణశక్తిని ఇచ్చే జ్యోతి మాత్రమే కాదు. మన కోసం భగవంతుడు తన స్వరూపాన్ని సూర్యరూపంలో ఆవిష్కరించుకున్నాడు.

సూర్యుడే భగవంతుడు అనం. సూర్యునిలో భగవంతుడు, సూర్యుని ద్వారా భగవంతుడు మనలను అనుగ్రహిస్తున్నాడు. సూర్యమండలంలో భగవంతుని ఆరాధించడమనే పద్ధతి మన పెద్దవారు పెట్టారు. ఇక్కడ చెప్పేటప్పుడే సాధన ఎలా చేసుకోవాలో కూడా చెబుతున్నాం. సూర్యోదయ, సూర్యాస్తమయ, మధ్యాహ్న సమయాలలో(సంధి కాలాలలో–సంధ్యలలో) సూర్యభగవానుని యందు భగవంతుని ధ్యానించి ఆరాధించాలి.

## భగవంతుడు నిరాకారుడా! సాకారుడా!

భగవంతుడు నిరాకారమని ధ్యానించినా, సాకారమని ధ్యానించినా ఫరవాలేదు. ఎంత అందమైన మాట! భగవంతుడు నిరాకారుడా! సాకారుడా! అని మిగిలినవారు కొట్టుకుంటూ ఉంటే, ఆయన నిరాకారుడూ కాగలడు..., సాకారుడూ కాగలడు – అని యుగాలనాడే చెప్పిన భారతీయసంస్కృతికి నమస్కారం చేసుకుందాం.

పురాణం భగవత్ స్వరూపాన్ని గురించి చెప్తూ...

**పుంరూపం వా స్మరేద్దేవీం స్త్రీ రూపం వా విచింతయేత్**

**అథవా నిష్కళాం ధ్యాయేత్ సచ్చిదానంద లక్షణం**

అంటోంది. మంత్రశాస్త్రంలో కూడా ఇదే శ్లోకం కనబడుతోంది. ఒకే శ్లోకం పలుచోట్ల ఎందుకు వస్తుంది అంటే అన్నీ వ్రాసినవాడు ఒక్కడే కనుక. సత్, చిత్, ఆనందమైన వాడు భగవంతుడు. భగవంతునికి ఉన్న మూడు లక్షణాలు ఈ సత్, చిత్, ఆనందం. 'సత్' అంటే ఎప్పుడూ ఉండువాడు. ఇక 'చిత్' అంటే చైతన్య స్వరూపుడు, జ్ఞానస్వరూపుడు. భగవంతుడు జడం కాదు, చైతన్యస్వరూపుడు. మూడవది ఆనందస్వరూపుడు. కనుక సత్, చిత్, ఆనందస్వరూపుడు. అలాగే సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడు. ఇవన్నీ పరమాత్మ లక్షణాలు, పరమేశ్వర లక్షణాలు.

అలాంటి భగవంతుని 'స్త్రీ రూపం వా స్మరేత్' – స్త్రీరూపంలో స్మరించుకో, లేదా 'పుంరూపం వా స్మరేత్' – పురుషరూపంలో అయినా పూజించుకో. 'అథవా నిష్కళాం ధ్యాయేత్' – అసలు ఏ రూపం లేని 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అని కూడా ధ్యానించుకో. నీ మానసిక పరిణతి బట్టి నువ్వు ఎలా భావించినా ఫరవాలేదు. ఆ అఖండమైన సచ్చిదానందశక్తి ఆ సూర్యమండలంలో నిరాకారంగా ఉందనీ భావించుకో, సాకారంగా ఉందనీ భావించుకో. తప్పు లేదు.

భగవంతునికి ఆకారం లేదు అనే సంస్కృతి 'ఆకారం ధరించ లేదు' అనలేదు. అర్థం చేసుకోవడానికి పురాణాలలో, స్తోత్రాలలో చెప్పే ఒక్క వాక్యం చాలు. కానీ ఫలశృతి మీద తొందరలో స్తోత్రాన్ని అర్థం చేసుకోరు. **'బ్రహ్మజ్యోతి స్వరూపంచ భక్తానుగ్రహ విగ్రహం'** అని చెప్తోంది శాస్త్రం. భగవంతుడు బ్రహ్మజ్యోతి.

**బృహత్వాత్ బృంహణత్వాత్ ఇతి బ్రహ్మ** అన్నిటి కంటే గొప్పది ఏదో, ఏది అంతటా వ్యాపించి ఉందో దాని పేరు బ్రహ్మ. ఆ బ్రహ్మమే జ్యోతి. జ్యోతి అంటే దీపమే కాదు. జ్యోతి అనగా చైతన్యం. బ్రహ్మజ్యోతి అంటే సర్వవ్యాపకమై

సర్వోన్నతమైన ఒక మహాచైతన్యమే భగవంతుడు. 'భక్తానుగ్రహ విగ్రహం' – అలాంటి చైతన్యమూర్తి భక్తులను అనుగ్రహించడం కోసం విగ్రహాన్ని ధరిస్తాడు. అలా భగవంతుని నిరాకార, సాకారాలను ఎంతో అందంగా సమన్వయించారు.

రామకృష్ణ పరమహంస ఎంత అందంగా చెప్పారంటే 'నాయనా! నీటికి ఆకారం లేదు. మంచు బొమ్మకు ఆకారం ఉంది కదా!' అన్నారు. నీరు నిరాకారం, మంచు బొమ్మ సాకారం. మంచు బొమ్మలో నీరు తప్ప మరొకటి లేదు. అంటే నీరులో ఏం చూస్తున్నారో మంచు బొమ్మలో అదే ఉంది. మంచు బొమ్మకి, నీటికి భేదం ఏమిటి అంటే చల్లదనం చేత నీరు గడ్డ కడితే మంచు అయింది. కనుక దానిలో చల్లదనం అనే స్వభావం కలిసి నిరాకారమైన నీరు సాకారమైన మంచుగా మనకు ఘనరూపంలో కనబడుతోంది. అదే విధంగా పరమాత్మ నిరాకారమైన నీటి వంటి వాడైతే, దయ అనే చల్లదనం చేత విగ్రహంగా కనబడతాడు.

## శ్రద్ధ – ధర్మం – చట్టం

సాకారం మనం కల్పించుకున్నది కాదు. భక్తులను అనుగ్రహించడం కోసం ఆయన దయతో ఒక ఆకారాన్ని స్వీకరిస్తాడు. ఆ విగ్రహాన్ని ఋషులు దర్శించి వర్ణిస్తారు. ఆ వర్ణించిన దానిని మనం ధ్యానం చేసి, శిల్పం చేసి పూజిస్తాం. **ఋషులు దర్శించినవే భగవద్రూపాలు. అంతేకాని ఏది ఊహించుకుంటే అది కాదు. శాస్త్రం చెప్పినది ఊహించుకోవాలి.** శ్రద్ధకి, విశ్వాసానికి తేడా చెబుతుంది శాస్త్రం. **'తోచింది నమ్మితే విశ్వాసం, శాస్త్రం చెప్పింది నమ్మితే శ్రద్ధ'.**

శాస్త్ర శబ్దానికి నిర్వచనం చెప్పుకుంటే, **శాస్త్రమనగా ఋషుల అనుభవం.** మనకు అనుభవం రాలేదు కనుక వారి అనుభవం మనకు నమ్మకం. మనం అనుభవాన్ని పొందాలంటే నమ్మి పొందవలసిందే. ఋషుల అనుభవం పేరు శాస్త్రం. శాస్త్రాన్ని నమ్మితే ఆ నమ్మకం పేరు శ్రద్ధ. శ్రద్ధ తప్ప భగవంతుని తెలుసుకోవడానికి మరొక సాధన లేదు.

**'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం', 'అజ్ఞశ్చ అశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి'**

అన్నాడు పరమాత్మ. మూర్ఖులు, శ్రద్ధ లేనివారు, సందేహం కలవారు సిద్ధిని పొందలేరు. పరమాత్మ బోధన అంత గొప్పగా ఉంటుంది. ఇలా చేస్తే బాగు పడతావు, అలా చెయ్యకపోతే నాశనమైపోతావు అంటాడు. మొదటిది చెప్పడం ఒక తరహా, రెండవది చెప్పడం మరో తరహా. మొదటిది చెప్తే కొందరికి నాటుకోదు. రెండవది చెప్తే నాటుకుంటుంది. 'శ్రద్ధ లేకపోతే నాశనమై పోతావు జాగ్రత్త' అన్నాడు. శ్రద్ధ ఒక్కటే శరణ్యం. ధర్మానికి శ్రద్ధయే ప్రమాణం. ఒకవేళ శ్రద్ధ లేకపోతే ఇమ్మని ప్రార్థించాలి. అది తప్ప మరో దారి లేదు.

వేంకటేశ్వరుని దగ్గరికి వెళ్ళి, "ఎంత చెప్పినా దేవుడు అనిపించడం లేదు, రాయే అనిపిస్తోందం"టే అది వారి పాపం. మరి ఏమి చెయ్యాలి? ఆ పాపం అనే బురద కడుక్కోవడానికి కూడా ఆ వేంకటేశ్వరుని విగ్రహం ముందే నిలబడాలి. ముందు చెప్పుకున్నట్టుగా విగ్రహానికి నీ నమ్మకంతో పని లేదు. అందులో శక్తి ఉంటుంది కనుక నమ్మినా, నమ్మకపోయినా దాని ప్రభావం అది చూపిస్తుంది. **మాత్రలో ఏమి పెట్టారో తెలియకపోయినా మింగితే జబ్బు తగ్గుతోంది. విగ్రహంలో ఏమి పెట్టారో తెలియక పోయినా దండం పెడితే పాపాన్ని పోగొడుతుంది.** అయితే తెలిసి చేస్తే తొందరగా, గొప్పగా ఫలిస్తుంది. విశ్వసించి చేస్తే ఫలితం ఎక్కువ. విశ్వాసం లేకుండా చేస్తే కొంచెం తక్కువ. విశ్వాసం, శ్రద్ధ చాలా ప్రధానం. అఖండమైన శ్రద్ధ కావాలి.

## చట్టం విఫలమైన చోట...

ధర్మాచరణకి శ్రద్ధయే ఆధారం. అమ్మని గౌరవించాలి, నాన్నని గౌరవించాలి. గౌరవించకపోతే కోర్టు శిక్ష వేస్తుందా? లేదు. కోర్టు శిక్ష వెయ్యదు. కానీ ధర్మం శిక్షిస్తుంది. 'నేను ఇవాళ అమ్మని, నాన్నని గౌరవించకపోతే అధర్మమవుతుంది, దానికి నేను శిక్ష అనుభవించక తప్పదు' అనే ఒక విశ్వాసం చేత ధర్మాన్ని ఆచరిస్తారు. లోకవ్యవహారానికి పనికొచ్చే చట్టం వేరు, మతం చెప్పే ధర్మం వేరు. రెండిటికీ చాలా తేడా ఉన్నది.

మనం ఒక బస్సులో ప్రయాణం చేస్తూ మన సీట్లో మనమే కూర్చున్నాం.

స్త్రీలకు కేటాయించిన సీట్లు, వికలాంగుల సీట్లు, వృద్ధుల సీట్లు వంటి వాటిలో కూర్చోలేదు. కేటాయించిన సీట్లన్నీ నిండిపోయాయి. అప్పుడు నడవలేని, నిలబడలేని వృద్ధుడొకడు నీ సీటు పక్కన నిలబడ్డాడు. అప్పుడు అతను నిలబడి ఉన్నాడే, నేను హాయిగా నిలబడ గలిగినా కూర్చున్నానే, నేను లేచి ఆయనకి సీటు ఇస్తాను అని... ధర్మం ఉంటే అనిపిస్తుంది.

అదే చట్టమనుకోండి – వారిని ఏమీ శిక్షించదు. అమ్మా, నాన్నలను చూడాలి లేకపోతే బ్రతుకు ఏమవుతుంది అనే మాట ధర్మం చెప్తుంది, తప్ప చట్టం ఏం చెయ్యలేదు. చట్టం విఫలమైన చోట ధర్మం విజయం సాధిస్తుంది. ప్రపంచంలో ఎన్ని చట్టాలు చేసినా, వాటిని అమలు పరచడానికి ఎందరు మనుషులను పెట్టినా మంచి నాయకుడు ఒక్కడుంటే మంచి చట్టం చేస్తాడు. కానీ ఆ చట్టం అమలు పరచడానికి దుర్మార్గులైన అధికారులు ఉంటే అమలు పరచబడకుండా వికృతరూపం ధరించి అందులో అవినీతి చోటు చేసుకుంటుంది.

చట్టం చెయ్యలేని పని ధర్మం ఎలా చేస్తుందో చూద్దాం. మహాభారతంలో భీష్ముడు అనేక ధర్మాలు చెప్తూ అక్రమార్జన కూడదని ఒక చోట చెప్పాడు. ఇది ప్రవచనంగా చెప్తున్నపుడు సరిగ్గా మూడవ రోజు ఒక ప్రభుత్వ ఉద్యోగి వచ్చి చెప్పిన మాట – "నాది వద్దన్నా లంచాలు వచ్చే సీటు. ఏమి చెయ్యను? వస్తూ ఉన్నాయి. మీ ప్రవచనం విన్నాక నేను ఇవాళ లంచం పుచ్చుకోకూడదని అనుకున్నాను. నాకు డెబ్భై అయిదు వేల లంచం రాబోతుంటే వద్దని పక్కకి తిప్పి పంపిచేశాను. ఇవాళ కలిగిన తృప్తి నా జన్మలో ఎప్పుడూ కలగలేదు?" అన్నాడు. ఇదండి ధర్మం ఇచ్చే ప్రభావం.

ధర్మాన్ని అనుష్ఠిస్తూ ఉంటే ధర్మం మనలను ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూ ఉంటుంది. లేకపోతే ప్రతిచోటా ప్రతివారు దొరికితేనే దొంగ అనుకుంటే ఎలా? భగవంతుడు ఒకడు ఉన్నాడు అనే స్పృహ ఉంటే ధర్మం ఉంటుంది. ప్రతివ్యక్తికీ పెద్ద పెద్ద వేదాంతాలు, జపాలు, ఉపాసనలు, సాధనలు అక్కర్లేదు. 'భగవంతుడు ఒకడు ఉన్నాడు, ఆయన సర్వవ్యాపకుడు, ఆయన ఎక్కడో ఉండి గమనించడం

కాదు, నా హృదయంలో కూర్చుని గమనిస్తున్నాడు. నేను ఎవరి కళ్ళైనా మూయగలను కానీ నా కళ్ళు మూసుకుని చేసిన తప్పు కూడా నా హృదయంలో ఉన్నవాడు తెలుసుకుంటాడు' – అనే ఒక స్పృహ ఉంటే మనం తప్పు చెయ్యం. ఈ స్పృహని చిన్ననాటి నుంచీ పిల్లలకు కలిగించగలిగితే అవినీతి రహిత సమాజాన్ని సాధించగలం.

ధర్మం సాధించగలిగిన నైతిక సమాజాన్ని సాధారణ చట్టాలు, న్యాయాలు సాధించలేవు. చట్టాలు, న్యాయాల కంటే శాస్త్రం చెప్పిన ధర్మానికి అంత గొప్పగా స్థానం ఉన్నది. ఉదాహరణకు – ఒక ఆఫీసులో ముఖ్యాధికారి ఉన్నప్పుడు అందరూ సిన్సియర్‌గా పని చేస్తారు. రోజూ ముఖ్యాధికారి 11.30కి వస్తాడు. కానీ 9.30కి ఆఫీసుకు వచ్చిన సహోద్యోగులందరూ 11.30 వరకు పిచ్చాపాటి మాట్లాడుతూ అల్లరి చేస్తూ 11.30కి ఆయన కారు చప్పుడు వినగానే ఎవరి మానాన వారు కూర్చుని పని చేస్తుంటారు.

ఒక రోజు సహోద్యోగులలో ఒకడు ఆఫీసుకు వెళ్ళేటప్పటికి అతను ఊహించినది ఏమిటంటే తోటి ఉద్యోగులందరూ అల్లరి పెడుతూ ఉంటారని. కానీ అందరూ చక్కగా ఎవరి స్థానంలో వారు కూర్చుని పని చేసుకుంటున్నారు. 'ఏమిటీ! మీరిలా పని చేస్తున్నారు, మనం పదకొండున్నర వరకూ పని చెయ్యం కదా!' అంటే 'బాస్ ఇవాళ తొందరగానే వచ్చాడు, లోపల ఉన్నాడు' అని చెప్పారు. ఈయన కూడా కూర్చుని పని చేస్తున్నాడు. ఇక గందరగోళం ఏం లేదు. పదకొండున్నర తరువాత అన్నారు, 'బాస్ రాలేదు, ఏమీ లేదు, ఇవాళ ఆయన రాడు, నిన్ను కేవలం ఫూల్ చేద్దామని ఆ పని చేశాం' అని. అక్కడ లేడు కానీ ఆయన ఉన్నాడన్న స్పృహే తప్పు చేయకుండా పని చేయించింది.

అలాగే ప్రతి వానిలో పరమాత్మ గమనిస్తున్నాడని శాస్త్రం చెప్తూ ఉంటే అది శ్రద్ధతో నమ్మితే తప్పు చేయగలరా? కనుక గమనించేవాడు ఒకడున్నాడన్న స్పృహ కలిగించడమే ధర్మం చేయవలసిన పని. ఆ స్పృహ కలగడం కోసం మన పెద్దవారు ఎక్కడెక్కడ భగవంతుని ఆరాధించాలి అనేది చెప్పారు.

**ఈశ్వరస్పృహతో బ్రతుకుతూ శాస్త్రం చెప్పినది చేయడమే ధర్మము.** ఈశ్వరస్పృహ అని పదిమార్లు అంటున్నాం. ఆయన ఒకడున్నాడు, గమనిస్తున్నాడు అని ఎప్పటికప్పుడు ఆ మాట గుర్తు పెట్టుకుంటూ ఉంటే చాలు.

## ధర్మం ఎవరి కోసం చేస్తావు?

'ఏముందయ్యా, ధర్మం చెయ్యకపోయినా బ్రతికెయ్యగలము' అనేది ప్రస్తుతానికి ఫరవాలేదు కానీ, తరువాత దెబ్బ తింటారు. దీనిని నిరంతరం గుర్తు పెట్టుకోవాలి. ఇవాళ విత్తనం వేస్తే రేపే పండు రాదు. సమయం తీసుకుంటుంది. ధర్మానికైనా, అధర్మానికైనా అదే సూత్రం. ఇవాళ చేసిన దానికి ఫలితం ఎప్పటికైనా అనుభవించక తప్పదు. అది హిందూధర్మం మాత్రమే ఇవ్వగలిగిన అత్యద్భుతమైన కర్మ సిద్ధాంతం. హిందూధర్మం కర్మసిద్ధాంతం నమ్ముతుందని ఎవరైనా అవహేళనగా మాట్లాడితే అందుకే మా మతం గొప్పదని చెప్పాలి.

కర్మ సిద్ధాంతంలో ఉన్న గొప్పతనం మనం పరిశీలిస్తే కార్య - కారణ సంబంధం(కాజ్ అండ్ ఎఫెక్ట్ థియరీ) చాలా హేతుబద్ధంగా ఉంటుంది. ప్రపంచంలో కార్య - కారణ సంబంధం అందించిన ఒకే ఒక్క మతం హిందూధర్మం. కారణం లేకుండా కార్యం లేదు. ఎలా ఉంటుంది? లేకపోతే, ఇతరుల ప్రకారంగా మనం ఆలోచించినట్లైతే భగవంతుడు సృష్టి చేశాడు. జన్మలు, పూర్వజన్మలు ఇతరులు నమ్మరు. జన్మను అంగీకరించే మతం హిందూమతమే.

## బౌద్ధ-సిక్కు-జైనమతాలు హిందూమతానికి భిన్నమా!

హిందూమతానికి శాఖలైన జైన, బౌద్ధ, సిక్కు - వీరు కూడా పూర్వజన్మలు నమ్ముతారు. బౌద్ధ, జైన మతాలు హిందూధర్మానికి వ్యతిరేకాలు కావు. హిందూ మార్గాలలో ఒక పది చెప్తే తనకు నచ్చిన ఒకటి తీసుకుని మిగిలిన తొమ్మిదిని విడిచి పెట్టి తయారైనవే బౌద్ధ, జైనాలు. జైన, బౌద్ధ మతాలనగా హైందవధర్మంలో ఉన్న శాఖలే. హైందవధర్మంలో ఉన్న సిద్ధాంతాలు పూర్వ జన్మ సిద్ధాంతం, కార్య-కారణ సంబంధం ఇవన్నీ కూడా ఆ మతాలలోను కనబడుతున్నాయి.

ఈ మధ్య హర్యానా, పంజాబు వెళ్ళి వస్తుంటే అక్కడ సిక్కులు, హిందువులు కలిసి ఉన్న ప్రాంతంలో ఒక చోట చక్కని చిత్రం చూడడం జరిగింది. ఒక చెట్టు వేసి కొమ్మలు వేశారు. చెట్టు హిందూ ధర్మం, కొమ్మలు జైన, బౌద్ధ, సిక్కులు అని చెప్పారు. ఆహా! ఎంత బాగుంది! అనుకున్నాను.

స్వామి వివేకానంద ఇదే మాట చెప్పాడు. వేదము చెప్పిన దానిలో యోగభాగాన్ని, జ్ఞానభాగాన్ని మాత్రమే తీసుకుంది బౌద్ధం. కర్మ భాగాన్ని విడిచి పెట్టింది. ఆ కర్మకు, జ్ఞానానికి ఉన్న సమన్వయాన్ని చెప్పారు ఆదిశంకరులు. అంతే భేదం. జైన, బౌద్ధ మతాలు కూడా కర్మ సిద్ధాంతాన్ని అంగీకరిస్తున్నాయి.

## కర్మసిద్ధాంతం

హిందూధర్మం అవగాహనలో కర్మసిద్ధాంతం చాలా ప్రధానం. అంటే పూర్వజన్మలో చేసిన కర్మలు ఈ జన్మలో అనుభవిస్తారు. ఈ జన్మలో చేసిన కర్మ తరువాత కూడా అనుభవిస్తారు. "ఈ కర్మ సిద్ధాంతం చెప్పడం వలననే మన జాతి నిర్వీర్యం అయిపోయింద"ని ఒకాయన అంటే "అయ్యా! మీకు సరిగ్గా అర్థం కాలేద"ని చెప్పవలసి వచ్చింది.

'నువ్వు చేసినది నీకు ఎప్పటికైనా నీ చేతికి వస్తుంద'నే గొప్ప ఆశ కలిగిస్తుంది కర్మ సిద్ధాంతం. ఇవాళ చేసిన దానికి అందుకోవడానికి ఈ జన్మ సరిపోకపోతే మళ్ళీ పుట్టైనా అందుకుంటారు. మంచి చేస్తే ఆనందం అందుకుంటారు, చెడు చేస్తే దుఃఖం పొందుతారు. ఇంతే కర్మ సిద్ధాంతం.

మనం చేసిన దానికి ఫలితం ఉంటుంది. ప్రతి చర్యకీ ప్రతిచర్య ఉంటుంది. అంత అద్భుతమైనది కార్య – కారణ సంబంధం. అది లేకపోతే కొందరు మూర్ఖులు, కొందరు పండితులు, కొందరు పేదవారు, కొందరు పెద్దవారు, కొందరు రోగులు, కొందరు ఆరోగ్యవంతులు... ఎందుకీ భేదాలు? భగవంతుడు సృష్టిని చేశాడు అని చెప్పినప్పుడు భేదాలతో సృష్టిస్తే ఆయన దుర్మార్గుడై ఉండాలి కదా! కనుకనే పూర్వజన్మ సిద్ధాంతాన్ని, కర్మ సిద్ధాంతాన్ని అంగీకరించకపోతే భగవంతుడు దుర్మార్గుడైపోతాడు.

ఎవరి కర్మని బట్టి వారికి సుఖము – దుఃఖము, ఎక్కువ – తక్కువ లభిస్తూ ఉంటాయి. ఎంత బాగుంది! దీని వల్ల మరొక ప్రమాదం వచ్చింది. ఎవరి కర్మ బట్టి వారికి వచ్చేటప్పుడు భగవంతుడు ఎందుకు? ఇక్కడ అద్భుతమైన విషయం ఉంది. మీరు మీ ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నారు. వెంటనే డబ్బు వచ్చేస్తుందా? మీ ఉద్యోగంలో ఎంత పని చేశారో తెలుసుకుని దానికి తగ్గ ధనం ఇచ్చే యజమాని పైన ఉన్నాడు.

అలాగే ఈశ్వరుడు అనగా మనం చేసిన కర్మకు తగిన ఫలాన్ని ఇచ్చేవాడు. ఆయనను లంచాలతో కొనలేరు. ఆయన  కర్మకి తగ్గ ఫలితమే ఇస్తాడు. ఇది ఎప్పుడైతే చెప్పారో మనకు ఒక ఆసరా వచ్చింది. 'నేను ఒక కర్మ చేసేసి దానిని నేను మర్చిపోయినా ఆయన మర్చిపోడు. తప్పకుండా ఫలితం ఇస్తాడు'. ఇది గుర్తు పెట్టుకుంటే, 'చెడు చేస్తే దుఃఖం ఇస్తాడు, మంచి చేస్తే సుఖం ఇస్తాడు కనుక నేను మంచే చేస్తాను' అని స్పృహ కలుగుతుంది.

మనలను ప్రపంచానికి పనికి వచ్చేలా తీర్చి దిద్దగలదు కర్మసిద్ధాంతం, ధర్మ సిద్ధాంతం. ఇది హిందూధర్మంలో కనబడే అద్భుతమైన వైజ్ఞానిక అంశం. ఇదివరకటి జన్మల సంస్కారాలు మనకు ఇప్పుడు ఉంటాయి అనడానికి అనేక ప్రమాణాలు కనబడుతూ ఉన్నాయి. దానికి సంబంధించిన పుస్తకాలు పాశ్చాత్యులు రచించారు. వారూ ఇదివరకు నమ్మలేదు. ఇప్పుడు వారికీ నమ్మక తప్పట్లేదు. అంతెందుకు, మానవుడు మళ్ళీ మానవుడవుతాడని లేదు. వారి సంస్కారం బట్టి కుక్క కావచ్చు, నక్క కావచ్చు.

తపోవన్ అని డెహ్రాడూన్‌లో ఉన్నది. అక్కడ ఒక కుక్క ఏకాదశి వస్తే ఉపవాసం చేస్తుంది. అది క్యాలండర్లు చూడదు, వాట్సాప్లు వెతకదు. కానీ ఏకాదశి ఎలా తెలుసు? అదే తెలియదు. దానిని పరీక్షించడానికి చాలా మంది ప్రయత్నించారు. దానికి ఇష్టమైన పదార్థం పెట్టినా ముట్టుకోలేదు. అయితే అది ఒక గురువు దగ్గర మఠం వేసుకుని కూర్చుంటుంది. ఎప్పుడూ రామ నామం భజన చేసేటప్పుడు వచ్చి కూర్చునేది. అలా బ్రతికింది అది. ఏదైనా ఇష్టమైన

పదార్థం పెద్దలు కానీ ఇస్తే ఏమి చేస్తుందంటే అది నోటితో కరచి పట్టుకుని వెళ్ళి ఒక రాతి క్రింద దాచుకుంటోంది. ద్వాదశినాడు పొద్దున్న వెళ్ళి తింటోంది. పారణ చేసుకుంటోంది. ఇలాంటి జరిగిన కథలు ఎన్నో ఉన్నాయి. ఎన్ని చెప్పుకోవచ్చో! ఆశ్చర్యకరమైన అంశం.

భారతీయసంస్కృతిలో చెప్పిన కర్మ సిద్ధాంతాలు, పరలోక విషయాలు అన్నీ సత్యమని అనేక పరిశోధనల వల్ల ఋజువు అవుతున్నాయి. వీటన్నిటికీ రికార్డ్స్ తేదీలతో, పేర్లతో సహా ఉన్నాయి. వ్యక్తులు అనేక జన్మలు తీసుకుంటూ గత జన్మలను గుర్తు చేసుకుని చెప్పడం కూడా కనబడుతుంది. **జాతస్మృతి** అని ఒకటి ఉన్నది. మానవుడు మళ్ళీ మానవునిగా పుట్టవచ్చు, ఇతర జంతువులుగాను పుట్టవచ్చు. ఈ జాతస్మృతి అనేది భాగవతంలో జడభరత ఉపాఖ్యానంలో కనబడుతుంది. చరిత్రలో ఎన్నో సంఘటనలు కనబడుతున్నాయి.

శ్రీ రామశరణ్ దాసు అనే మహాత్ముడు మొత్తం దేశమంతా తిరిగి ఈ పూర్వజన్మ స్మృతులకు సంబంధించిన విషయాలను పరిశోధించి హిందీలో పుస్తకం రచించాడు. వీలైతే వాటిని పరిశీలించండి. ఇంతకంటే ఎక్కువ విషయాలు తెలుస్తాయి. అద్భుతమైన అంశాలు ప్రస్తావన చేసి చూపించారు. కర్మసిద్ధాంతం అనేది ప్రధానం. మంచి చేస్తే మంచి, చెడు చేస్తే చెడు. ఇది మనకి కనబడుతున్నది.

'నేను ఇవాళ ధర్మం చేస్తున్నాను' – అంటే ఏ ప్రేరణతో చేస్తారు? దానివల్ల ఏదో ఒక మంచి లభిస్తుందండి అంటేనే చేస్తారు. దానం చేస్తే మంచిది. తల్లిదండ్రులను బాగా చూసుకుంటే మంచిది. నిజానికి మనం సుఖంగా బ్రతకవలసిన వయస్సులో తల్లిదండ్రులను చూస్తూ గడపడం కష్టమే కదా! అటువంటప్పుడు కష్టమైన పని చెయ్యి అని చెప్పాలంటే ఎవరు చేయించగలరు? ధర్మం మాత్రమే చెయ్యించగలదు. దాని వల్ల నిన్ను పెంచి పోషించిన తల్లిదండ్రుల ఋణం తీర్చుకోగలవు. ధర్మం ఆ పని చేయిస్తోంది.

సత్యం పలుకు, దానం చెయ్యి... ఇవన్నీ ధర్మం ప్రేరణ చేత చేస్తారు. ఇవాళ కష్టంగా ఉన్నా అది ఎప్పటికైనా పని చేస్తుంది.

ఒకప్పుడు హిమాలయాలలో ఉన్న ఒక యోగి కొందరు శిష్యులతో కలిసి ప్రయాణం చేస్తూ ఒక రైల్వే స్టేషన్లో దిగారు. అక్కడ మళ్ళీ ట్రైన్ మారి మరొక ప్రాంతానికి వెళ్ళాలి. దిగిన సందర్భంలో ఆ స్టేషన్ మాస్టర్ ఆ యోగి దగ్గరికి వచ్చి "ఏమండీ! ఇంతవరకూ నాకు ఏ ఆధ్యాత్మిక సాధన లేకుండా తినడం, తిరగడం, సంపాదించడం తప్ప మరొక బ్రతుకు లేదు. ఇవాళ మిమ్మల్ని చూశాక నా బ్రతుకు సార్థకం చేసుకోవాలనిపిస్తోంది. దయచేసి ఏదైనా ఉపదేశించండి" అన్నాడు.

ఇలా కనబడితే అలా మంత్రాలు ఇచ్చేయరు గురువులు. అలా ఇస్తే వారు సరైన గురువులు కారు. పరీక్షించాలి. ఈయన "నీకొక్క మాట చెప్తాను పాటించు" అన్నాడు. "ఇవాళ నుంచి నేను అసత్యం పలకను అనే ఒక్క మాట మీద నిలబడి ఉండు. కపటంగా జీవించకు. అసత్యం అంటే కపటము, అది వదిలెయ్" అని చెప్పి వెళ్ళిపోయాడు. "ఓస్! ఇంతేనా! ఏదో పెద్ద కష్టమైనది పెద్ద మంత్రం చెప్తారనుకున్నానే" అనుకున్నాడాయన. ఆ యోగి వెళిపోయాడు. ఈయన చాలా సులభమైనదే అనుకుని అసత్యం ఆడకుండా ఉందామని ప్రయత్నించాడు. మరుసటి రోజు నుంచి తెలిసింది ఎంత కష్టమో!

అంతవరకు స్టేషన్ మాస్టర్గా తానూ అవినీతి చేశాడు, తన క్రింద ఉన్నవారి అవినీతిని సమర్థించాడు. ఒకొకప్పుడు మంచివారు ఉన్నా పక్కవారి అవినీతిని సమర్థించకపోతే వీరి ఉనికి ఉండదు. అలాంటి పరిస్థితి ఏర్పడుతుంది. కానీ అడుగడుగునా గురువాక్యం గుర్తు తెచ్చుకున్నాడు. దీనికే 'శ్రద్ధ' అని పేరు.

**'గురువాక్యాన్ని, శాస్త్రవాక్యాన్ని తు.చ తప్పకుండా ఎట్టి పరిస్థితులలోనైనా పాటిస్తాను అనుకోవడమే శ్రద్ధ'.** గురువాక్యం, శాస్త్రవాక్యం అని రెండు చెప్పాం. ఇందాక శాస్త్రవాక్యం మాట మాత్రమే చెప్పాం. శాస్త్రవాక్యాన్ని చెప్పేవాడు గురువు. ఆ గురువాక్యాన్ని శ్రద్ధగా పాటించడం ఆయన దగ్గర కనబడింది.

అప్పటి నుంచి అతని జీవితంలో సత్యం తప్ప మరొకటి లేదు. కానీ ఎన్ని ప్రమాదాలు ఎదుర్కొన్నాడంటే తనవారు తనకు శత్రువులయ్యారు. తాను ఎంత

నీతిగా ఉన్నా చుట్టూ ఉన్నవారు శత్రువులయ్యారు. దానితో వీళ్ళందరూ కుట్ర పన్ని ఇతనిని ఉద్యోగం నుంచి తొలగించే పని చేశారు. ఉద్యోగం తొలగిపోయింది. దమ్మిడీ ఆదాయం లేదు. ఆఖరికి భార్యా పిల్లలు కూడా, 'ఆదాయం లేని నీ దగ్గర ఎక్కడ ఉండాల'ని పుట్టింటికి వెళిపోయారు. ఇది కూడా గొప్ప సత్యం. ఇలాంటప్పుడే తెలుస్తూ ఉంటుంది ఎవరి బంధాలు ఎంత వరకో.

**'యావత్ విత్తోపార్జన సక్తః తావన్నిజపరివారో రక్తః'** – అంటారు ఆదిశంకరులు. ఇది మనం తెలుసుకోగలిగితే ఎవరి కోసం అన్యాయపు సొమ్ము సంపాదిస్తున్నారనిపిస్తుంది. ఎవరూ నీ వారు కారు.

సంపాదించేదేదో ధర్మబద్ధంగా సంపాదిస్తూ, ధర్మబద్ధంగా సుఖపడదామనేది తెలుసుకోగలిగితే ఇంక ఏమి కావాలి? ఈ మహానుభావుడు ఆ విధంగా భార్యా పిల్లలు కూడా వెళిపోయినా గురువాక్యం మీద నమ్మకంతో ఉన్నాడు. అక్కడే ఉన్నాడు. నియమం పాటిస్తున్నాడు. కొంతకాలానికి ఆశ్చర్యంగా వెతుక్కుంటూ తన పుట్టిన ఊరి నుంచి ఒక వ్యక్తి వచ్చి "బాబూ! నీదైన ఆస్తి మీ నాన్నగారి కాలంలోనే అన్యాయంగా అన్యాక్రాంతమైపోయింది. దాని మీద అప్పటి నుంచి కేసు నడుస్తోంది. నీపట్ల ఆప్తులైనవారు దాని మీద పోరాడారు. మొత్తం ఆస్తి అంతా నీకు వచ్చిందయ్యా!" అని చెప్పారు.

ఇంతవరకు తాను ఉద్యోగంలో ఉండి సంపాదించి ఉంటే ఎంతో దానికి కొన్ని రెట్లు అధికంగా డబ్బంతా తిరిగి వచ్చింది. వచ్చిన తరువాత ఆశ్చర్యపోయాడు. అంతే కాదు అవినీతి కేసులో పోలీసులు ఆయనని అరెస్టు చేసి కోర్టులో ప్రవేశపెట్టినప్పుడు ఆయన జడ్జితో ఒకటే మాట చెప్పాడు "నేను నా గురువాక్యం పాటించి నీతిని పాటిస్తున్నాను తప్ప అవినీతిని పాటించడం లేదు" అని. ఆ జడ్జి నీ గురువు ఎవరు అని అడిగితే చెప్పాడు. దానికి ఆయన "ఆయన నాకు కూడా గురువేనయ్యా" అని ఇతని న్యాయాన్ని నమ్మి విడిచి పెట్టాడు. అలా జైలు శిక్ష తప్పింది. ఆస్తి అంతా తిరిగి వచ్చింది. మళ్ళీ భార్యా

పిల్లలు వచ్చారు, ఉద్యోగం వచ్చింది. చూశారా! తాత్కాలికంగా కష్టం వచ్చినా ధర్మం ఎలా నిలబెడుతుందో! ఇదీ ధర్మం గొప్పతనం.

## పురుషార్థాలు - మానవునిగా సాధించాల్సినవి

భారతీయసంస్కృతి గొప్పతనం ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే నాలుగింటిని పురుషార్థాలుగా పెట్టడం. ఈ నాలుగు గురించి పిల్లలకు నేర్పండి. ఎప్పుడో జీవిత చరమాంకంలో కాదు. అర్థం, కామం సంపాదించే వయసులో నేర్పాలి. అర్థం, కామం ఎప్పుడు సంపాదిస్తారు? రిటైర్ అయ్యాకా? అప్పుడు భోజనం చక్కగా చేద్దామన్నా కుదరని పరిస్థితి. ఎందుకంటే 'కేరాఫ్ హాస్పిటల్సే' తప్ప అప్పుడు ఇంకేమీ ఉండదు. అటువంటప్పుడు ఏమి చేస్తారు? అర్థ, కామాలు సంపాదించేవారికే ధర్మం చెప్పాలి.

మన పెద్దవారు జీవితానికి కావలసినవన్నీ చెప్పారు చూడండి. ధర్మం, అర్థం, కామం, మోక్షం. సంస్కృతంలో చెప్పాం కనుక ఇదేదో మాకు అక్కరలేదు అనిపించవచ్చు కానీ మనకు పనికి వచ్చేవి అన్నీ ఈ నాలుగింటిలో ఫ్రేమ్ చేసి పెట్టేశారు. ధర్మ, మోక్షాలకు మధ్యలో అర్థ, కామాలు ఉన్నాయి. అర్థ, కామాల గురించి ప్రతివారికీ తెలుసు. అర్థ, కామాలు సంపాదించండి అని ఉపన్యాసాలు చెప్పాలా? లేచిన దగ్గర నుంచి చేసే పని అదే. కామం అంటే కోరిక తీర్చుకోవడం. కోరిక తీర్చుకోవడం కోసం ధనం సంపాదించడం. కొందరికి ధనం సంపాదించడమే కోరిక. కనుకనే అర్థ, కామాలు కలిపి కామం కిందే పెట్టారు పెద్దవారు.

త్రివర్గం అంటే ధర్మం ఒక వర్గం, మోక్షం ఒక వర్గం, అర్థకామాలు కలిపి ఒక వర్గం. ఇదొక విభజన. కనుక అర్థ, కామాలు మధ్యలో కనబడుతున్నాయి. అర్థ, కామాలు సంపాదించడమనేది ప్రతివారు చేస్తున్న పనే. కానీ ముందు ధర్మం పెట్టారు. అర్థ, కామాలు సంపాదించి రిటైర్ అయిన తరువాత ధర్మం కాదు. ముందు ధర్మం, తరువాత అర్థ, కామాలు. అందుకే అర్థ, కామాలను ధర్మంగా సంపాదించాలి అని భారతంలో ఒక అద్భుతమైన మాట చెప్పారు.

మిగిలినవారూ సుఖపడతారు, వీరూ సుఖపడతారు. కానీ ఎవరైతే ధర్మబద్ధంగా అర్థ కామాలను సంపాదిస్తున్నారో వారు ధర్మబద్ధంగా సుఖపడుతున్నారు అంటే ధర్మబద్ధంగా సంపాదించిన దానితో తింటున్నారు. దానితో కుటుంబాన్ని పోషించుకుంటున్నారు. దానితో తృప్తి పడుతున్నారు.

ఎవరైతే ధర్మబద్ధమైన సంపాదనతో తృప్తి చెందుతారో వారికి వచ్చే ఫలితం చిత్తశుద్ధి. కనుక అర్థ, కామాలు వద్దని చెప్పలేదు. ధర్మబద్ధంగా అర్థకామాలను సంపాదిస్తూ ఉంటే అది చిత్తశుద్ధిని ఇస్తుంది. చిత్తశుద్ధి జ్ఞానాన్ని ఇస్తుంది, జ్ఞానం వల్ల మోక్షం లభిస్తుంది.

పురుషార్థాలు అంటే పురుషుడు సాధించవలసిన అర్థాలు. అవే ధర్మ అర్థ కామ మోక్షాలు. పురుష శబ్దానికి మగవాడు అని అర్థం కాదు. **'పురే శయనం కరోతి ఇతి పురుషః'.** జీవుడు అని అర్థం. సర్వజీవులకూ చెప్పారు. ధర్మ, అర్థ, కామ, మోక్షాలు. ఇందులో ఏ ఒక్కటి సంపాదించకపోయినా జీవితం వృథాయే.

ధర్మ, అర్థ, కామ, మోక్షాలు – నాలుగూ సాధిస్తే దాని పేరు 'జయం' అనే మాట మన సంస్కృతి చెప్పింది. జయం అంటే సక్సెస్. విజయానికి సూత్రాలు(సక్సెస్ టిప్స్) చెప్తే ఈ పోటీ ప్రపంచం చాలా ఆశ్చర్యకరంగా, ఆసక్తికరంగా ఉంటుంది. పర్సనాలిటీ డెవలప్‌మెంట్, సక్సెస్ టిప్స్ వీటి గురించి ఉపన్యాసాలు చెప్పి డబ్బులు దండుకునే ప్రొఫెసర్లు చాలా మందే ఉన్నారు. కానీ రామాయణ, భారతాలు చక్కగా చెప్తే సక్సెస్ టిప్స్, పర్సనాలిటీ డెవలప్‌మెంట్ అందులోనే ఉన్నాయి. ఇదీ అసలైన పర్సనాలిటీ డెవలప్‌మెంట్.

సక్సెస్‌ఫుల్ లైఫ్ అనే దానికి ఎవరైనా నిర్వచనం ఇవ్వగలరా? బాగా చదువుకునే వారికి పరీక్షలో ర్యాంక్ వస్తే సక్సెస్, ఉద్యోగం వస్తే సక్సెస్, అందులో డబ్బు వస్తే సక్సెస్. కాని ఇదే సక్సెస్సా? కాదు. జీవుడు పొందవలసిన ప్రయోజనాలన్నీ పొందినప్పుడు సక్సెస్(విజయం సాధించినట్లు) అవుతాడు.

ధర్మ, అర్థ, కామ, మోక్షాలు – నాలుగూ పొందిన జీవుడే పరిపూర్ణుడు. వాడే Successful Human being. నాలుగూ పొందగలగాలి. అదే పరిపూర్ణత. ఆ

పరిపూర్ణమైన మోక్షం పొందే వరకూ జీవుడు పుడుతూనే ఉంటాడు.

ఇలా సనాతనధర్మం నాలుగు పురుషార్థాలు చెప్పింది. ఆ నాలుగు పురుషార్థాలు పొందడానికి జీవితాన్ని ఎలా తీర్చిదిద్దుకోవాలో చెప్పింది. హోటల్ మేనేజ్‌మెంట్, బిజినెస్ మేనేజ్‌మెంట్, హాస్పిటల్ మేనేజ్‌మెంట్ కోర్సులు ఉన్నాయి. కానీ సనాతనధర్మంలో లైఫ్ మేనేజ్‌మెంట్ కోర్సు ఉంది. జీవితాన్ని ఎలా తీర్చిదిద్దుకోవాలో చెప్పారు. జీవితాన్ని ఎవరికి వారే తీర్చుదిద్దుకోవాలి. రెగ్యులేటర్ (నియంత్రణ) ఎవరికి వారే. సంపాదించడానికి అవకాశం ఉంది కదా అని ధర్మాన్ని విడిచి పెట్టి, ఆఖరికి శారీరకమైన స్థితిని విడిచి పెట్టి ప్రవర్తిస్తూ ఉంటే చిట్టచివరికి అనుభవించడానికి వాడు మిగలడు. కనుకనే ఏది ఎంతవరకు అనేది ఎవరు నియంత్రణ (రెగ్యులేట్) చేస్తారు? ఇది చాలా ప్రధానమైన అంశం.

అర్థకామాలు సంపాదించాలి కానీ, ఎంత వరకు? పరిమితి ఏమిటి? అర్థ, కామాలను నియంత్రణ చేసే దాని పేరే ధర్మం. ఇంట్లో ఫ్యాన్ ఉంటుంది, గాలి ఉండాలి కాని నియంత్రణ ఉండాలి. సంస్కృతిలో నిర్మూలన చెప్పలేదు, నియంత్రణ చెప్పారు. 'అర్థకామాలు అన్నీ విడిచి పెట్టు, ఎక్కడో మూల కూర్చుని ముక్కు మూసుకో' అనేది కాదు ఆధ్యాత్మికత అంటే. సమాజంలో ఉంటూ ధర్మబద్ధమైన అర్థ కామాలు సంపాదిస్తూ పదిమందికి ప్రయోజనకారిగా జీవించినప్పుడే పరమేశ్వరుని దృష్టిలో పడతారు. చిత్తశుద్ధి వస్తుంది, ఆయన అనుగ్రహం లభిస్తుంది. జ్ఞానాన్ని, మోక్షాన్ని పొందుతారు. ఇదే సనాతన ధర్మం చెప్తున్నది.

అలా ధర్మ, అర్థ, కామ, మోక్షాలలో ధర్మం ఒక నియంత్రణ(రెగ్యులేటర్). అర్థ కామాలు ఎంతవరకు? ఎప్పటి వరకు? లేకపోతే చచ్చే వరకూ సంపాదిస్తూ ఉంటే ధర్మం ఏం చేశారు? అర్థ, కామాలు సంపాదించేటప్పుడు కూడా ధర్మాన్ని పాటిస్తూ సంపాదించాలి. కాని అర్థ, కామాలు సంపాదించడంలో మన ధర్మం కొంచెం తగ్గించుకోక తప్పదు. ఉదయం పదకొండు, పన్నెండింటి వరకూ చెయ్యవలసిన ఆధ్యాత్మిక అనుష్ఠానం చేస్తే ఉదయాన్నే ఏడింటికి వెళ్ళి ఉద్యోగం

ఎలా చెయ్యగలరు? అప్పుడు ఏమి చెయ్యాలి? పొద్దున్నే లేచి కొద్దిగా చేసి అయినా వెళ్ళాలి, అసలు మానివెయ్యకూడదు. అక్కడి పనికి హడావిడిగా వెళుతూ ఉంటే తిండి మానివేస్తున్నారా? ఏదో ఒకటి తింటున్నాడు కదా! తీరిక సమయాలు వచ్చినప్పుడు ఎక్కువగా అనుష్ఠానం చేసుకోగలగాలి.

భగవత్ స్పృహ, భగవద్భక్తి ఇవ్వడానికి అనుష్ఠానం ఉండాలి. ఆచరించడానికి ధర్మం ఉండాలి. ఇవి ఎలా కలగాలంటే **ధర్మం ఆచరిస్తూ ఉండాలి, ఈశ్వరుని ఆశ్రయిస్తూ ఉండాలి.** కనుక ఈశ్వరుని ఆశ్రయిస్తూ ధర్మాన్ని ఆచరించాలి. అంతేకాని 'ఇప్పుడు ధర్మ, అర్థ, కామాలు సంపాదిస్తున్నాను కనుక రిటైర్ అయిన తరువాత భగవద్భక్తి చూస్తాను' అని కాదు. ధర్మబద్ధంగా అర్థ, కామాలు సంపాదించేటప్పుడు "స్వామీ! నా బుద్ధిలో ధర్మం నిలిచేలా, ధర్మబద్ధంగా జీవించ డానికి అవకాశాలు ఉండేలా, నేను చేసిన ధర్మం ఫలించేలా అనుగ్రహించు" అని **భగవంతుని ఆశ్రయించి ధర్మార్థకామాలను అనుభవిస్తూ ఈశ్వరస్పృహతో ధర్మార్థ కామాలు సంపాదిస్తూ ఉంటే దాని పేరు 'భక్తి'.**

ధర్మబద్ధంగా అర్థ కామాలు సంపాదించడమనే దానికి పేరు **'కర్మ'**. ఈ రెండిటి వల్ల వచ్చే జ్ఞానమే **'జ్ఞానం'**. కర్మ-భక్తి - జ్ఞానాలు... ఈ మూడూ చెప్పింది శాస్త్రం. **'కర్మ'లో ఆచారం, 'భక్తి'లో ఉపచారం, 'జ్ఞానం'లో విచారం ఉండాలి.** ఆచరించేది కర్మ, ఉపకరించేది భక్తి, విచారించేది జ్ఞానం. **'ఆచార ప్రభవో ధర్మః ధర్మస్య ప్రభురచ్యుతః'** అని గొప్ప మాట చెప్పాడు భీష్ముడు. ఆచరిస్తే ధర్మం వస్తుంది. 'ఇంత ధర్మం చేస్తే ఏం వస్తుందండీ?' అంటే ధర్మానికి ప్రభువు అచ్యుతుడు. కాబట్టి నీ ధర్మానికి ఫలం ఇచ్చి తీరతాడు. అని వెంటనే చెప్పాడు - **'ధర్మస్య ప్రభురచ్యుతః'.** ఇంత ధర్మం చేస్తే నాకు దిక్కు ఏమిటి అంటే అచ్యుతుడే దిక్కు. ధర్మం ఆచరించని వానికి దిక్కు లేదు.

భారతంలో ఒక అత్యద్భుతమైన సన్నివేశం - ధర్మరాజు అరణ్యాలలో వెళుతూ ఉంటే ద్రౌపది ఒక మాట అంటుంది. "ధర్మం అని పట్టుకుని కూర్చున్నావు. చేతనైనవాడివై కూడా పరాక్రమం చూపించి కౌరవులను చంపకుండా

ధర్మబద్ధుడవై అరణ్యానికి వచ్చేశావు. ధర్మం తప్ప నీ నోట వేరొక మాట లేదు. ఈ ధర్మం నీకేమి ఇచ్చింది? అడవులపాలు చేసింది. అధర్మం ధుర్యోధనుని రారాజు చేసింది. అధర్మంలో ఉన్నవారు సుఖపడుతున్నారు. ధర్మంలో ఉన్న నువ్వు దుఃఖపడుతున్నావు" అని అడిగింది.

ఒకొొక్కప్పుడు మనలో చాలా మందికి కూడా పొరపాటున ధర్మంగా ఉన్నామన్న భ్రాంతితో "ఇంత మంచివాడనైన నాకు ఎందుకు కష్టాలు వచ్చాయి" అని సెల్ఫ్‌పిటీ వస్తూ ఉంటుంది. కానీ ధర్మరాజును ద్రౌపది అలా అడిగితే ఎంతో అద్భుతంగా సమాధానం చెప్పాడు. చిత్తశుద్ధి ఉన్నవారే ఈ సమాధానం ఇవ్వగలరు. "ధర్మం ఆచరించడం నా స్వభావం" అన్నాడు. ఎంత అందమైన మాట!

ప్రభావధర్మం, స్వభావధర్మం అని రెండు రకాలుగా ధర్మం ఉంటుంది. స్వభావధర్మం అంటే ఎవరూ చెప్పక్కర లేకుండానే చేస్తారు. సత్యం వద, ధర్మం చర అని చిన్నప్పటి నుండి చెప్పాలి. అప్పుడు ఇంత కష్టపడి రోజూ చెప్పాడు కనుక ఒక్కసారైనా ధర్మం చేద్దామని జాలి పుట్టి చేస్తారు. అలా పదిసార్లు విని, పదిసార్లు చదివి చేసే ధర్మం పేరు **'ప్రభావ ధర్మం'**. అలా కాకుండా సహజంగా ధర్మం చేస్తారే, వారిది **'స్వభావ ధర్మం'**. స్వభావధర్మం మహాత్ములకు ఉంటుంది. ప్రభావధర్మం సామాన్యులకు ఉంటుంది. **'అభావ ధర్మం'** దుర్మార్గులకు ఉంటుంది. అభావం అంటే అసలు లేకపోవడం.

రామచంద్రమూర్తి సత్యం పలికాడు. విశ్వామిత్రుడు నూరిపోశాడా? కాదు, సహజం. సీతమ్మ పాతివ్రత్యంతో ఉంది. ఏం? పుస్తకాలు చదివిందా? లేదు, సహజం. మహాత్ములకు ధర్మం స్వభావం. వారి ప్రభావంచేత గొప్పవారం అవుదాం. స్వభావంగా లేకపోయినా, ప్రభావంగా వస్తే ఎప్పటికైనా తరించవచ్చు. స్వభావం, ప్రభావం - ఈ రెండూ ధర్మానికి కావాలి. అభావం వైపు మాత్రం వెళ్ళకూడదు.

ధర్మం అనగా కర్మ. ధర్మం - కర్మ, భక్తి - భావన, జ్ఞానం - విచారణ. ఈ

మూడూ విడివిడిగా ఉండవు. కలిపే వెళ్ళాలి. మన హృదయంతో భగవంతుని భావిస్తూ, మన శరీరంతో ధర్మం చేస్తూ, మన బుద్ధితో విచారణ చేయగలిగితే మూడింటిని కలిపి ఆరాధించగలం. పరమాత్మ "నువ్వు చేసే ధర్మం నా ప్రీతికై చేస్తే, నీకు తప్పకుండా జ్ఞానం, మోక్షం నేను ఇస్తాను" అని హామీ ఇచ్చాడు. ప్రత్యేకించి పూజలంటూ చెయ్యవద్దని చెప్తే మరొక నాస్తికం. పూజ చెయ్యాలి, అనుష్ఠానం చెయ్యాలి. వాటితో పాటు మనం చేసే ప్రతి పని అనుష్ఠానం కావాలి.

## ఆధ్యాత్మిక సాధన - భగవదాలంబన

ఆధ్యాత్మిక సాధన అంటే రోజుకు ఒక గంటో, రెండు గంటలో చేసే పూజ మాత్రమే కాదు. ఇరవై నాలుగు గంటలూ జీవించే విధానం, ఆలోచించే విధానం, ఆచరించే విధానం. ఇదే ఆధ్యాత్మికత అంటే. 'నేను విష్ణు సహస్రం పారాయణ చేశాను కనుక తరువాత ఏ బ్రతుకు బ్రతికినా సరిపోతుంది' అనుకోకూడదు.

కొంత సేపు ధ్యానం, అనుష్ఠానం చెయ్యడం వల్ల మన లోపలి ఈశ్వరశక్తిని రగుల్కొల్పుతాం. నివురు ఊది నిప్పు తీసినట్టుగా లోపలి మాలిన్యాన్ని ఊది ఈశ్వరశక్తిని జాగృతి చేస్తాము. అప్పుడు ఆయన మన బుద్ధిని ప్రేరేపిస్తాడు. అప్పుడు మనం ఏ పని చేసినా ఈశ్వర ప్రేరణ మీద ధర్మబద్ధంగా చేస్తాము. చేసినదంతా ఆయన చలువ వల్లే చేశామనే స్పృహ ఉంటుంది.

రోజూ భగవంతుని నమస్కరించి ఆరాధించేవారికి అడుగడుగునా ఆయనే నడిపించి ప్రేరేపిస్తుంటాడు. ఆయన చేస్తున్నాడు అనే స్పృహ ఉంటుంది కనుక అహంకారం ఉండదు. ఆవేదన ఉండదు. హాయిగా పని చేస్తాడు. వారిలో వారు తృప్తిగా ఉండగలరు. వారు తరిస్తారు. ఆచార, ఉపచార, విచారాలు ఉండాలి. కర్మ, భావన, విచారణ ఉండాలి. ఇవే మనకు కర్మ భక్తి జ్ఞాన యోగాలు అని చెప్పవచ్చు.

## ఆరాధన - పద్ధతులు

ధర్మంలో భగవంతుడు ఉన్నాడన్న స్పృహ కలగడం కోసమే ఆరాధన. అదే విధంగా స్పృహ చేత మీలో పరిమితంగా కనిపిస్తున్న ఈశ్వరశక్తిని రగుల్కొలిపి అపరిమితం చేసుకొని శక్తిమంతం అవడానికే ఆరాధన, మతము, పూజ పద్ధతులు వచ్చాయి.

ఎక్కడెక్కడ ఆరాధించాలో పరమాత్మ చెప్పారు.

**మొదటిది** – సూర్యుని యందు ఆరాధించాలని చెప్పారు. మనకు కనబడుతున్న విశ్వంలో మహజ్జ్యోతి సూర్యభగవానుడు. ఆదిత్యునిలో భగవంతుని గ్రహించలేకపోతే నిజమైన భగవంతుని కూడా గ్రహించలేరు అని చెప్తోంది శాస్త్రం. ఎవరి ఇష్టదైవాన్ని వారు సూర్యునిలో ఆరాధించవచ్చు.

**ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః**
**మహేంద్రో ధనదః కాలోహ్యమస్సోమో హ్యపాంపతిః**
**పితరో వసవస్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః**
**వాయుర్వహ్నిః ప్రజా ప్రాణా ఋతుకర్తా ప్రభాకరః**

ఇందులో ఏ దేవత లేడో చెప్పండి. సర్వదేవతాత్మకుడైన పరమాత్మను ఆదిత్యమండలంలో భావిస్తూ ఉన్నాం. అది మొట్ట మొదటగా చెప్తున్నారు.

**రెండవది** – భగవంతుని జలము నందు ఆరాధించమని చెప్పారు. కలశంలో నీళ్ళు పోసి ఆవాహన చేసి ఆరాధించడంలో ఇదే కనబడుతోంది. అంతేకాదు, నదులకు స్నానానికి వెళ్ళినప్పుడు నమస్కారం చేసుకుని దిగడం – ఇవన్నీ కూడా జలము నందు భగవంతుని ఆరాధించడం.

**మూడవది** – అగ్ని యందు ఆరాధించడం. ఇదే అగ్నిహోత్రం. **'అగ్ని ముఖావై దేవాః'**. అగ్ని యందు ఆరాధన చేస్తే ప్రకృతిలో ఎంత మంచి పరిణామాలు జరుగుతాయో, ఎంత అద్భుతాలు జరుగుతాయో శాస్త్రం చెప్పింది. ఇది చాలా ప్రధానం.

మనది యజ్ఞసంస్కృతి కనుక ఒక దేవతను మంత్రంతో పూజిస్తాం.

విగ్రహమునందు ఆరాధిస్తున్నాం. కానీ అగ్నిహోత్రము నందు చేసింది అద్భుతంగా దేవతలకు చేరుతుందని మన పెద్దవారు చెప్పారు.

**అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యక్ ఆదిత్యముపతిష్ఠతి**

**ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నాః తథా ప్రజాః**

ఇది శాస్త్రం చెప్తోంది. అగ్నిహోత్రంలో వేసిన ఆహుతులు అగ్నిహోత్రుడు అనే దేవత తీసుకుని వెళ్ళి ఆదిత్యమండలం ద్వారా సర్వదేవతలకు అందిస్తాడు. ఆ సర్వదేవతలు మనలను అనుగ్రహిస్తారు. ఇది ఎలాంటిది అంటే మన శరీరంలో ఏ ఇంద్రియానికి బలం కావాలన్నా నోటి ద్వారానే ఆహారం ఎలా పంపిస్తామో సర్వదేవతలను తృప్తి పరచడానికి అగ్ని ద్వారా మనం అలా ఆహుతులను ఇస్తామని చెప్పారు. ఎంత అందమైన ఉపమానం!

## అగ్నిహోత్రం వల్ల ఎలాంటి ప్రభావాలు వస్తాయి?

ఇప్పటికీ మన సంస్క ృతి బ్రతికి బట్టకట్టలిగింది అంటే... ఎంత కానికాలంలోనైనా మన ఆలయాలలో జరుగుతున్న అర్చనలు, కైంకర్యాలు, యజ్ఞయాగాల వల్లనే అని గ్రహించగలగాలి. ఇందులో సందేహం లేదు. యజ్ఞం వల్ల ఎలాంటి ప్రభావం ఉంటుందో మన వాళ్ళు చేసి చూపించారు. కలి ప్రభావం వల్ల యజ్ఞసంస్కృతి క్రమ క్రమంగా పోయి దుస్థితిలో ఉన్నాం. మనం చేయలేనప్పుడు యజ్ఞాలు చేయించడమన్నా చెయ్యాలి. యజ్ఞాల వల్లనే బాగుంటుందని కృష్ణపరమాత్మ గీతలో ప్రతిపాదన చేసి మరీ చెప్పాడు. భారతీయ సంస్కృతిలో యజ్ఞానికి అంత ప్రాధాన్యం ఉన్నది.

అగ్ని యందు ఆరాధించడం గురించి ప్రస్తావన చేసుకోవాలంటే పోలండ్‌కి సంబంధించిన సైంటిస్ట్ డా. హెన్రీ... భారతదేశ అగ్నిహోత్రం గురించి పరిశోధన చేసి 'అగ్నిహోత్ర' అనే పుస్తకం వ్రాశాడు. వీలైతే దానిని చదవాలి. అగ్నిహోత్రంలో ఆయన ఎన్ని పరిశోధనలు చేశాడో దానిలో చూపించాడు.

హైందవులు అగ్నిహోత్ర క్రియలో వాడే యజ్ఞ ద్రవ్యాలన్ని (దేశవాళీ)ఆవునేతితో హోమం చేస్తే ప్రకృతిలో వచ్చిన మార్పులను ఆయన పరికరంతో పరీక్షించాడు.

ఎలాగైతే విగ్రహాల నుండి వచ్చిన శక్తిని న్యూక్లియర్ సైంటిస్ట్ ఒక పరికరంతో పరీక్షించారని చెప్పుకున్నామో, ఈ అగ్నిహోత్ర ప్రభావం కూడా పరికరంతో పరిశీలిస్తే ఆ ప్రాంతమంతా కూడా ఓజోన్ పొర దృఢంగా ఉండడము, ఆ పరిసరాలలో వ్యాపించిన రేడియేషన్ మొదలైనవి పోవడం జరిగింది. ఇది ఆశ్చర్యకరమైన అంశం.

దర్భలు ఒంటికి చుట్టుకుని ఎక్స్‌రే తీస్తే ఆ ఎక్స్‌రే రాలేదట. అంటే ఎక్స్‌రేస్‌ను కూడా దర్భ ఆపగలదు. రేడియేషన్ ప్రభావం లేకుండా చూపించగలదు. ఆ న్యూక్లియర్ సైంటిస్ట్ మొదట ఒక సెల్‌ఫోన్ లోంచి ఎంత రేడియేషన్ వస్తోందో పరిశీలించాడు. ఆ పరిశీలన అలాగే పెట్టి ఒక నాలుగు దర్భలు సెల్‌ఫోన్ మీద వేసి మళ్ళీ రేడియేషన్ పరిశీలన చేశాడు. అప్పుడు రేడియేషన్ లేదు. వీటికి సాక్ష్యాధారాలు కూడా ఉన్నాయి. దీనిని బట్టి అగ్నిహోత్రంలో వాడే ద్రవ్యాలకు ఉన్న శక్తి, దాని వల్ల వాతావరణంలో వచ్చే మార్పు, దాని వల్ల ప్రకృతికి జరిగే మేలు... వీటన్నిటినీ పరిశోధించారు.

ఆయన ఇంకొక ప్రయోగం కూడా చేశాడు. ఒక గదిలో అగ్నిహోత్రంలో మంత్రం ప్రయోగించకుండా కేవలం ద్రవ్యాన్ని మాత్రమే వేశాడు. ఇంకొక దానిలో మంత్రం కూడా ప్రయోగిస్తూ అవే ద్రవ్యాలు వాడాడు. ఈ రెండు గదులలో వాతావరణంలో వచ్చిన మార్పులను విడివిడిగా పరిశోధించాడు. ఆశ్చర్యకరంగా మంత్రాలు లేనిదాని కంటే మంత్రాలతో చేసిన యజ్ఞంలో కనిపించిన ప్రభావం చాలా అధికంగా ఉంది. కనుక అగ్నిహోత్రము నందు భగవంతుని ఆరాధించడమనే పద్ధతి చెప్పారు.

ఇప్పుడు యజ్ఞాలు పోయాయి కదా! మరి ఆ ప్రయోజనం ఎలా పొందగలం? అనే దానికి మన పెద్దవారు ఒక మాట చెప్పారు. రెండు పూటలా ఇంట్లో దీపం పెట్టుకోవాలి. అదే అగ్నిహోత్రం. పరమాత్మని ధ్యానించాలి. **'లోకైక దీపాంకురాం'** అన్నారు. దేవతలు కాంతి శరీరులు. **దివ్** అనే మాటకు **ప్రకాశం** అని అర్థం. ప్రకాశస్వరూపులు. ప్రకాశస్వరూపులైన దేవతలను జ్యోతి ద్వారా ఆరాధించడం

దీపారాధన మహిమ. ఇలా ఇప్పటికి మూడు అయ్యాయి – సూర్యుడు, జలము, అగ్ని.

**నాలుగవది** – స్థండిలమునందు అంటే రాయి, రప్ప, మట్టి... వాటిని సంస్కరించి వాటి యందు భగవంతుని పూజిస్తాం. ఊరికినే యథాతథంగా కాకుండా మంత్రం ద్వారా సంస్కరించి పూజిస్తాం. అదే ప్రతిమారాధన.

**అయిదవది** – శ్రోత్రియుడైన మహాత్ముని యందు భగవత్ బుద్ధితో ఆరాధించుట. ఇది చాలా అద్భుతమైన విషయం. నవరాత్రులలో సువాసినులకు పూజలు చేస్తారు. అంటే అర్థం ఒక రాయి యందే భగవంతుని పూజిస్తున్నామే, సర్వజీవుల యందు ఆయన చైతన్యం ఉన్నప్పుడు ఆ జీవులలో కూడా భగవంతుని ఆరాధించడం మనకు నేర్పారు. పేరంటాళ్ళు, పెద్దలకు తాంబూలాలు, పూజలు చెయ్యడాలు నేర్పించారు. దీనినే కృష్ణపరమాత్మ '**దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవం**' అని చెప్పారు. పెద్దలను ఆరాధించాలి, అది కూడా శ్రోత్రియుని యందు అని చెప్పారు.

అందరిలోను భగవంతుడు ఉన్నప్పుడు వారిలోనే ఎందుకు ఆరాధించాలో అనే దానికి సమాధానం చెప్పుకోవాలి. బండరాయి, అద్దం ఉదాహరణ ముందే చెప్పుకున్నాం. నిన్నటి వరకూ ఇద్దరు స్నేహితులు కలిసి తాగుతూ తిరుగుతున్నారు. ఒరే అంటే ఒరే అనుకునేవారు. మరుసటి రోజు అందులో ఒక స్నేహితుడు అయ్యప్పమాల వేశాడు. వెంటనే నిన్నటి వరకూ ఒరే అని పిలిచిన వాడు స్వామీ స్వామీ అని పిలవవలసి వచ్చింది ఆ నలభై రోజులు. వాడిని తిడదామని నోటి దాకా వచ్చినా నిగ్రహించుకుంటున్నాడు. అరే! నిన్నటి వరకూ నానా తిరుగుళ్ళు తిరిగి ఇవాళ మాల వేస్తేనే వాడు పవిత్రుడైపోయాడే... అటువంటిది సంస్కారం పొందినది మొదలు చివరి వరకు వేదాన్ని, మంత్రాన్ని అనుష్ఠిస్తూ పూజిస్తూ జపం చేస్తూ నియమబద్ధంగా బ్రతికినవాడు ఇంకెంత పవిత్రుడైపోతాడో ఆలోచించండి.

నియమబద్ధంగా నిరంతరం ధర్మానుష్ఠానం చేస్తూ భగవంతునికి అంకితమై

జపము, తపము చేస్తూ పవిత్రమైన వాని యందు భగవంతుని భావించి ఆరాధించడం తరువాతి విషయం. ఇదే శ్రోత్రియుని యందు ఆరాధించుట అని పెద్దలు చెప్పిన విషయం. ఒక ఇనుప ముక్కను తీసుకు వచ్చి సూదంటు రాయికి రాస్తూ ఉంటే ఇనుప ముక్క సూదంటు రాయిగా మారిపోతుంది. అదేవిధంగా భగవంతుని నిరంతరం జపిస్తూ, తపిస్తూ మంత్రం చేస్తూ ఉన్నవారి శరీరం మాంసమయ శరీరం కాకుండా మంత్రమయ శరీరంగా ఉంటుంది. వారి అణువణువులో ఆ చైతన్యం వ్యాపిస్తుంది. వారు కనబడడానికి సామాన్యంగా ఉన్నా వారి యందు ఉన్న వేదము, వారి యందు ఉన్న నిష్ఠ, వారు చేసే అనుష్ఠానం వల్ల వారి యందు భగవంతుని భావిస్తాము.

ఇలా ఇప్పటి వరకు సూర్యుడు, జలము, అగ్ని, స్థండిలము, శ్రోత్రియుడు – వీటి యందు భగవంతుని ఆరాధించడం చెప్పుకున్నాం. అదే విధంగా చంద్రుని యందు, చంద్రమండలమునందు కూడా ఆరాధించాలి. **'చంద్రమండల మధ్యగా', 'భాను మండల మధ్యస్థా'** అని లలితాసహస్రంలో చదువుతూనే ఉంటారు. భగవంతుని ఎక్కడ ధ్యానించాలో అక్కడే చెబుతున్నారు.

**'ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణః సరసిజాసన సన్నివిష్టః'** అంటారు వైష్ణవులు. **'భానుమండలమధ్యస్థా'** అంటారు శాక్తేయులు. **'సౌరమండలమధ్యస్థం సాంబం సంసారభేషజం, అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుః సుమంగళః'** అంటారు శైవులు. మొత్తానికి శైవులు శివుని అన్నా, వైష్ణవులు విష్ణువుని అన్నా, శాక్తేయులు శక్తిని అన్నా సూర్యునిలోనే వారిని చూస్తున్నారు. సమన్వయం అక్కడ కనబడుతోంది.

దీనిని బట్టి ప్రపంచంలో దేని నుంచి ఒక మేలు పొందినా, ఒక శక్తిని పొందినా దానిని భగవంతుడు అని తెలుసుకో. అదీ హిందూధర్మం చెప్తోంది. అందుకే వీరికి నమస్కరిస్తున్నాం. చిట్టచివరికి ఇక్కడి దాకా వచ్చాం. ప్రతిమల యందు ఆరాధించుట, తరువాత హృదయమునందు ఆరాధించుట. ఇది ఆఖరికి చెప్పారు. ఎందుకంటే హృదయమందు చూడడమే మహాకష్టం. మిగిలినవన్నీ

చూడవచ్చు. ఇవన్నీ చేస్తే హృదయమునందు చూడగలం. ఒక దాని తరువాత ఒకటి చెయ్యమని కాదు, అన్నీ కలిపి చెయ్యాలి.

సూర్యుని యందు, చంద్రుని యందు, అగ్ని యందు, జలము నందు, విగ్రహము నందు, పెద్దల యందు, మహాత్ముల యందు చూస్తూ తరువాత మన హృదయంలో ధ్యానిస్తూ ఈ ప్రక్రియలు కలిపి సాగాలి. ఒక దాని తరువాత ఒకటి కాదు...ఒక దానితో కలిపి ఒకటి. అప్పుడు ఇన్ని చోట్ల భగవంతుని ధ్యానించడం అలవాటైపోయాక అన్నిచోట్లా పరమాత్మనే చూడగలము.

ఏకాగ్రంగా ఒక రోజు జాగ్రత్తగా సీరియల్ చూస్తేనే మరుసటి రోజు ప్రతివారు సీరియల్లో పాత్రలలా కనబడతారు కదా! ఈ రోజులలో ఇంట్లో ఉండి బాగుపడడానికి కూడా అవకాశాలు లేకుండా ఉన్నాయి. చెప్పుకుంటే పెద్ద బాధ. మంచైనా, చెడైనా అదే మాధ్యమం కనుక నమస్కరించక తప్పదు.

ఒక పెద్దావిడ కోడలు కాఫీ తీసుకు వస్తే 'అందులో విషం కలిపావా!' అని అడిగింది. ఎప్పుడూ లేనిది ఇప్పుడు అత్తగారు ఇలా ఎందుకు అంటున్నారా అంటే నిన్న సీరియల్లో కోడలు కాఫీలో విషం కలిపి మెట్లు దిగుతూ ఉండగా సశేషం అని ఆపేశాడు. ఇంక ఆవిడకు రాత్రంతా నిద్ర పట్టలేదు. ఆ మెట్లు దిగుతున్న కోడలే కనబడుతోంది. అదీ ధ్యానం అంటే. అప్పుడు ప్రొద్దున్న లేవగానే కోడలు విషం పట్టుకుని వచ్చినట్టు కనబడింది. అదే ధ్యానమైతే అంతా అదే కనబడుతుంది కనుక, **లేనిది ధ్యానిస్తేనే ఉన్నట్టు కనబడిందే, ఉన్న ఈశ్వరుని ధ్యానించడం నేర్చుకుంటే అంతటా ఉన్నవాడు కనబడతాడు.**

భగవంతుని ధ్యానించే పద్ధతి ఎంత గొప్పగా చెప్పారో చూడండి. పూజించేటప్పుడు 'ఆవాహనం' మొదలుకుని 'ఉద్వాసన' వరకూ ఉన్న ప్రక్రియను అర్థం చేసుకోగలిగితే పూజలో ఉన్న పరమార్థం అర్థం అవుతుంది. ఆహూత, సన్నిహిత, వ్యాపక అనే మూడింటి గురించి చెప్పుకున్నాం. ఇప్పుడు వివరించుకుందాం. భగవంతుడు ఒక విగ్రహంలోకి, బింబంలోకి, యంత్రంలోకి, లింగంలోకి, సాలగ్రామంలోకి, మీరు ఉండచుట్టిన పసుపుముద్దలోకి,

పార్థివ(మట్టి) లింగంలోకి గాని ఎలా వస్తాడో ఒక క్రమపద్ధతి చెప్పారు.

ఆ వచ్చినవాడు మూడు పద్ధతులలో వస్తాడు– అవే ఆహూత, సన్నిహిత, వ్యాపక.

**ఆహూత** – అంటే మంత్రం ద్వారా భగవంతుడు ఆహ్వానింపబడతాడు. ఆహ్వానం, రండి కూర్చోండి అన్నట్లుగా. **సన్నిహిత** – ఇలా ఆహ్వానింపబడ్డ భగవచ్ఛక్తి దేని యందు మనం కోరుకుంటున్నామో దానిలోకి వస్తుంది. వచ్చిన వాడు ఏమౌతున్నాడు...

**వ్యాపక** – ప్రతి అణువులో వ్యాపించిపోతాడు. ఈ ప్రక్రియలో మనం విగ్రహారాధన అంశాన్ని పరిశీలించాలి.

మనం నైవేద్యాలు పెడతాం. ఒకావిడ అడిగింది 'రోజూ నైవేద్యం పెట్టాలాండీ?' అని. 'రోజూ అన్నం తింటే పెట్టమ్మా!' అని చెప్పాను. మనం అనుభవించేది ఆయన ఇచ్చినది అనే స్పృహ కలగడం కోసం నైవేద్యం. ఎంతవరకు మనకు సుగంధం, దుర్గంధం అనే తేడా కనబడుతుందో అంతవరకు స్వామికి సువాసనలు ఇస్తూ ఉండాలి. ఎంతవరకూ వస్త్రం కావాలి అని శరీరస్పృహ ఉంటుందో అంతవరకూ 'వస్త్రం సమర్పయామి' అని చెయ్యాల్సిందే. ఎంతవరకు అన్నం కావాలని అనుకుంటామో అంతవరకూ నైవేద్యం.

పూజలు, పునస్కారాలు అక్కరలేదు అని చెప్పే కొత్త కొత్త సిద్ధాంతాలు వస్తున్నాయే అవి చాలా నచ్చుతాయి. ఈ రోజులలో బద్ధకాన్ని నేర్పేవారే గొప్ప గురువు. 'నేను ఇవన్నీ మానేసి యోగాకి వెళుతున్నానండీ' అంది ఒకావిడ. వెళ్తే ఏమి సాధించారు? యోగం ఈశ్వర ఆరాధనకు పనికి రావాలి తప్ప **ఈశ్వర ఆరాధనకు పనికి రాని యోగం కూడా నిరుపయోగమే.** ఇది గ్రహించగలిగితే చాలు.

నువ్వు తినేది భగవంతునికి చూపించి తిను. **యదన్నావై మానవాః తదన్నావై దేవాః.** లేదండీ ఆయనకి నైవేద్యం పెట్టలేనిది నేను తింటున్నాను అంటే అలాంటిది తినకు. ఆయనకు వండాలంటే శుచిగా, శుభ్రంగా, సాత్త్వికంగా వండి పెట్టాలి.

అది తిను. **అందరూ అన్నం తింటారు. భక్తుడు ప్రసాదం తింటాడు. పదార్థానికీ, ప్రసాదానికీ తేడా ఏమిటంటే ప్రసాదం అంటే అనుగ్రహం.** భగవంతునికి చూపించిన వెంటనే ఆయన శక్తి అందులో ప్రవేశించి. అది తింటే ప్రసాదమౌతుంది. ప్రసాదం అంటే ప్రసన్నత. అప్పుడు హృదయంలో ప్రసన్న భావం, శరీరానికి ప్రశాంతత ఏర్పడతాయి.

భారతీయులనగా ప్రసాదం తిని బ్రతికేవారు, పదార్థం తిని కాదు. ఇది ఎప్పుడైతే తెలుసుకున్నారో తినే పదార్థమే కాకుండా సృష్టిలో అనుభవించేవన్నీ ప్రసాదములు అనే విషయం అర్థం అవుతుంది. అంతటా భగవంతుడు ఉన్నాడు అని మాట చెబుతున్నారే దానిని ఎలా తెలుసుకోవాలి అంటే– 'ప్రపంచాన్ని పదార్థదృష్టితో కాకుండా ప్రసాదదృష్టితో చూడాలి' అని రమణ మహర్షి చెప్పారు.

శ్రీకృష్ణుడు చెప్పాడు కదా – 'నీటిలో దాహాన్ని పోగొట్టే శక్తిని నేను' అని. మీకు దాహం వేసినప్పుడు గ్లాసెడు నీళ్ళు తీసుకుంటే, "ఇందులో దాహాన్ని తీర్చే శక్తిగా నువ్వు ఉన్నావుగా స్వామీ!" అని ఆనందంగా త్రాగాలి – అది ప్రసాదమౌతుంది. "సూర్యునిలో, చంద్రునిలో ఉన్న వెలుగును నేను – **రసోహమప్సు కౌన్తేయ! ప్రభాఽస్మి శశిసూర్యయోః**" – ఈ మాట విని బయటకు రాగానే 'పరమాత్మ నా కోసం సూర్యుడై వెలుగుని ఇస్తున్నాడు, చంద్రుడై వెన్నెలను ఇస్తున్నాడు, నీరై దాహం తీరుస్తున్నాడు, భూమియై అన్నం ఇస్తున్నాడు, వాయువై ఊపిరిని ఇస్తున్నాడు, నా కోసం పరమాత్మ ఇన్ని రూపాలు ధరించాడు' అనే భావం కలుగుతుంది. ఇది ప్రసాద దృష్టి. అది రావడం కోసం ముందు పూజరూపంలో అభ్యాసం చెయ్యాలి. ఇలా హిందూధర్మంలో ప్రధానమైన పూజ పునస్కారాల గురించి చెప్పుకున్నాం.

## ధర్మప్రాధాన్యం

పూజ పునస్కారాలు కాకుండా ధర్మంలో ప్రధానమైన అంశాలు – ఎక్కడికక్కడ ఇదీ ధర్మం... అని హిందూధర్మం స్పష్టంగా చెప్తోంది. ఏది పట్టుకున్నా సంపూర్ణంగా చెప్పవచ్చు. శివాలయానికి వెళ్ళినప్పుడు ముందుగా శివుని కంటే

నందినే చూస్తాం. ఆ నందికి పేరు వృషభం. **'వృషోహి భగవాన్ ధర్మః'** – వృషభము అనగా ధర్మం. ధర్మదేవత వృషభరూపంలో ఉంటుందని పురాణం, వేదం వర్ణిస్తున్నది. భాగవతంలో భూమాత గోమాతగా కనబడుతుంది, ధర్మదేవత వృషభరూపంలో కనబడుతుంది. ఇది అత్యద్భుతమైన మాట. పరీక్షిన్మహారాజుకు అలా దర్శనమిచ్చింది. ఇందులో ఋషి ఒక అద్భుతమైన ప్రతీకవాదం చూపిస్తున్నారు.

పరమ పూజ్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి వారు ఒక మాట అన్నారు –

**జననీ పృథివీ కామదుఘాస్తే జనకో దేవః సకల దయాళుః**
**దామ్యత దత్త దయధ్వం జగతాం శ్రేయో భూయాత్ సకలజనానాం**

ఈ భూమి కామధేనువు. ఎలా అయితే ఆవు పొదుగు నుంచి పాలు పిండుకుని బ్రతుకుతున్నామో, ఈ భూమి నుండి సంపద పిండుకుని బ్రతుకుతున్నాము. మనం ఏది అనుభవించినా భూమి ద్వారానే. భూమి ద్వారా సంపదలు, పంట అన్నీ పొందుతున్నాం కనుక భూమిని ఆవుతో పోల్చారు. ధర్మాన్ని వృషభంతో పోల్చారు. ఇదీ భాగవతంలో కనబడుతున్న అంశం. మీరు ఏ పురాణం వెతికినా అదే కనబడుతుంది.

భూదేవి వేంకటేశ్వరస్వామిని ప్రార్థించినప్పుడు గోమాతరూపంలో వెళ్ళిందని చెప్పారు. భూమి గోవుగాను, ధర్మం వృషభంగాను చూపించడంలో అంతరార్థం ఆవు నుంచి పాడి పొందినట్లు మనం ఏది పొందినా భూమి నుంచే పొందుతాం. ఇక ధర్మాన్ని వృషభంతో పోల్చడంలో ఉద్దేశం ఆవుకి పాలు ఇవ్వగలిగే శక్తి రావాలంటే వృషభంతో కలయిక కావాలి. వృషభంతో యోగం లేనిదే ఆవు పాలనివ్వలేదు. అందుకే ధర్మాన్ని వృషభంతో, భూమిని గోవుతో పోల్చారు అంటే అర్థం ధర్మంతో కలయిక లేనిదే భూమి సంపదలు, పంటలు ఇవ్వలేదు. భూమి ఏది ఇవ్వాలన్నా ధర్మంతో కలయిక ఉండాలి. కనుక ధర్మం వృషభంగా పోల్చబడింది.

విష్ణుసహస్రంలో పరిశీలిస్తే వృషా కపిః, వృషః అనే మాటలు కనిపిస్తాయి. ధర్మం విష్ణుస్వరూపం. అదే వృషస్వరూపం. భగవంతుడు ఉన్న రూపాలలో సత్పురుషులు ఒక రూపం. ధర్మం మరొక రూపం. గోవు మరొక రూపం. అదే విధంగా అగ్ని ఒక రూపం. సూర్యుడు ఒక రూపం. మనం ఉపాసించే నారాయణ శివాది రూపాలు మరొక రూపం. ఇన్ని రూపాలతో భగవంతుడు ఉన్నాడు.

**శుద్ధ సాధులందు సురలందు శ్రుతులందు**
**గోవులందు విప్రకోటి యందు**
**ధర్మ పదవి యందు తగిలి నా యందు**

అని పరమాత్మ తన శరీరాలు చెప్పాడు. **వృష** అంటే **వర్షించునది.** వేదం ఈ అర్థంలో చెప్పింది. వర్షించడం అంటే కురిపించడం. ఏది కావాలంటే అది అందించే దానికి వృషం అని పేరు. ధర్మబద్ధంగా బ్రతికితే కావలసింది ఆ ధర్మమే ఇస్తుంది, కురిపిస్తుంది. **వృష లక్షణం కలిగింది వృషభం.** ఆ వృషభాన్ని చూసి తరువాత శివుని చూస్తాం. ఆ వృషభాన్ని ధర్మం అన్నారు కదా! వృషభం ఎలా ఉంటుందో శాస్త్రం వర్ణిస్తోంది.

## వృషభస్వరూపం

వృషభం తెల్లగా ఉంటుంది అంటే ధర్మం శుద్ధ సత్త్వగుణంతో స్వచ్ఛంగా, స్పష్టంగా ఉంటుంది. హిందూసంస్కృతిలో ఒకొక్క రంగు ఒకొక్క భావానికి సంకేతం. తెలుపు స్వచ్ఛతకి, స్పష్టతకి సంకేతం. ధర్మం అలా ఉండాలి. వృషభానికి ఎన్ని పాదాలు? పరిశీలిస్తే ఈ నాలుగు పాదాలే ధర్మం స్వరూపం. నాలుగు పాదాల మీద నడిచింది అంటాం. అవీ ఈ నాలుగు పాదాలు. మామూలుగా చెప్పే విషయం- ప్రతి యుగానికీ నాలుగు పాదాలు. ఆ లెక్క వేరు. అలాగే మన కలియుగంలో ఒక పాదమంతా ధర్మం ఉంటుంది, మూడు పాదాలు అధర్మం ఉంటుంది అని చాలా మంది అంటూ ఉంటారు.

కానీ యుగానికి నాలుగు భాగాలు చెప్పినప్పుడు ఒక భాగమంతా ధర్మం, మిగిలిన మూడు భాగాలు అధర్మం అనే అర్థంలో తీసుకోరాదు. దీనికి అర్థం

కలియుగం మొత్తం మీద ముప్పాతిక భాగం అధర్మం, పావు భాగం ధర్మం ఉంటుంది. మనం పావుభాగం ధర్మాన్నైనా ఆశ్రయిద్దామని ప్రయత్నిస్తే ముప్పాతిక అధర్మం మనలను ఏం చెయ్యదు. ఆ ప్రయత్నం మనం చెయ్యవచ్చు.

'కలియుగమంతా అధర్మమే కనుక నేనూ అధర్మం చేస్తానండీ' అంటే 'ఊరంతా కలరా వచ్చింది కనుక నాకూ రానీయండి' అన్నట్లు ఉంటుంది. ఊరంతా కలరా వచ్చినా మన జాగ్రత్త మనం ఎలా తీసుకుంటామో అలాగే అంతా అధర్మం ఉన్నా మనం ధర్మంగా బ్రతకడానికి ప్రయత్నిస్తే, ఇంత అధర్మసమయంలో కూడా కాసింతైనా ధర్మంగా ఉండాలని ప్రయత్నించాం కనుక భగవంతుడు మనల్ని ఇంకా అనుగ్రహిస్తాడు.

దారంతా ముళ్ళ కంపలు ఉంటే దారంతా తివాచీ పరచుకోనక్కరలేదు. మన కాళ్ళకి చెప్పులు వేసుకుంటే చాలు. అదేవిధంగా అంతా అధర్మం ఉన్నా, మనం ధర్మాన్ని పట్టుకుంటే అది మనలను రక్షిస్తుంది. ఇది ఎప్పుడూ తెలుసుకోవాలి. ఏ యుగమైనా ధర్మం రక్షిస్తుంది.

ధర్మం నాలుగు భాగాలుగా ఉంటుంది. ఈ నాలుగు స్వరూపాలు తెలుసుకోవాలి. సత్యం, అహింస, శౌచం, అస్తేయం. ఈ నాలుగు పాదాల మీద వృషభం ఉంటుంది. ఈ నాలుగు తెలుసుకుని పిల్లలకు నేర్పగలిగితే ఒక అత్యద్భుతమైన సమాజం తయారవుతుంది. ధర్మం అంటే ఈ నాలుగే.

ఇంతవరకు చెప్పుకున్న దానితో ధర్మాన్ని కలిపితే పరిపూర్ణత వస్తుంది.

**మొదటిది సత్యం.** ధర్మానికి అన్నిటి కంటే గొప్పది సత్యం. ఇందాక జరిగిన ఒక కథలో సత్య ప్రభావం చెప్పుకున్నాం. సత్యం అంటే తెలుగులో అద్భుతమైన మాట ఉంది – కల్లా కపటం లేకుండా ఉండడం. కల్ల– మాటకి సంబంధించినది, కపటం– మనసుకి సంబంధించినది. కల్లా కపటం లేకుండా ఉండడమే సత్యం.

ఇంకొక అద్భుతమైన మాట **'భూతహిత యథార్థభాషణమేవ సత్యం'** – ఉపనిషత్ ఇచ్చిన నిర్వచనం ఇది. యథార్థం పలకడం సత్యమే. కాని భూతహితాన్ని కోరి, భూతహితాన్ని కలిగించే యథార్థం పలకాలి. **'యథార్థ భాషణమేవ సత్యం'**

అనలేదు, 'భూతహితయథార్థభాషణమేవ సత్యం'. ప్రపంచ హితాన్ని, సాటి మనిషి హితాన్ని కోరి పలికే యథార్థ భాషణం పేరు సత్యం. ఇది జీవితంలో ప్రధానంగా ఉండాలి. సత్యాన్ని ఆశ్రయించే అన్ని ధర్మాలు ఉంటాయి కనుక సత్యం ప్రధానం. అది చెప్పడానికే పరమాత్మ రామునిగా, కృష్ణునిగా అవతరించాడు. సత్యాన్ని ఆచరించి చూపించాడు. కనుక సత్యం మొదటిది.

**రెండవది అహింస.** అహింస అంటే మాటతో కానీ, చేతతో కానీ, మనస్సుతో కానీ ఇతరులని బాధించకుండా ఉండుట. మాటతో బాధించడం అంటే చాలామందికి తెలుసు. మనస్సుతో హింస అంటే అవతలి వారి కీడుని కోరడం. అది కూడా కూడదు. ఇలాంటి సంస్కారాలు ఇవ్వగలిగితే ఎంతో స్వచ్ఛమైన మానవ జాతి తయారవుతుంది.

**మూడవది అస్తేయం.** ఇది చాలా ప్రధానంగా చెప్పుకోవాలి. అస్తేయం అంటే దొంగతనం లేకుండా ఉండుట. దొంగతనం లేకుండా ఉండడం అంటే అర్థం 'ఎవరి జేబులూ కత్తిరించలేదండీ, బందిపోటులా ఎవరి మీద దాడి చెయ్యలేదండీ' అని కాదు అర్థం. **దొంగతనం లేకుండా ఉండుట అంటే అక్రమార్జన లేకుండా ఉండుట.** ఈ మాట ముందుగా నేతలకు, అధికారులకు నేర్పాలి. ప్రతి కార్యాలయంలో ఇది వ్రాసి పెట్టాలి.

అస్తేయం – అక్రమార్జన లేకుండా ఉండుట అని కూడా అర్థం. ఒకాయన "నాది అక్రమార్జనే కానీ నాకొచ్చే ఆదాయంలో ప్రతి సంవత్సరం పది శాతం హుండీలో వేసేస్తాను కనుక ఏం ఫరవాలేదండి" అన్నాడు. శాస్త్రం ఏమి చెప్తోందంటే ఏడాది పొడుగునా అక్రమార్జన సంపాదించడం ఒక దోషం, ఆ అక్రమార్జనలో కొంత భాగం హుండీలో వెయ్యడం రెండవ దోషం అని చెప్తోంది.

గురువుకి, దేవునికి, యజ్ఞానికి, ధర్మానికి ఇచ్చేది స్వార్జితమైన, సక్రమమైన సంపద అయ్యుండాలి అని శాస్త్రం నిర్దేశిస్తోంది. హిందూ సంస్కృతి – ఎంత సంపాదించావు అనేది చెప్పదు. ఎలా సంపాదించావు... అనేది చెప్తోంది. అక్రమంగా ఎంత సంపాదించినా అది చెయ్యాల్సిన దుష్ఫలితం చేస్తూనే

ఉంటుంది. అది ఇప్పుడు కాకపోతే వారి తరువాత తరాలలోనైనా కనబడుతుంది. ఎందుకంటే వేసిన విత్తనం పండక తప్పదు. ఇప్పుడు కాకపోతే ఎప్పటికైనా. ఈ విషయాన్ని చిన్నప్పటి నుంచి చెప్పగలిగితే మనకు అవినీతి నిరోధక చట్టాలు అవసరం లేదు. మన ధర్మమే మనలను నిరోధించగలదు. అక్రమార్జన లేకుండా ఉండడం అనేది చాలా ప్రధానమైన అంశం.

**కడుపెంత తా కుడుచు కుడుపెంత దీనికై పడని పాట్లనెల్ల పడి పొరలనేల**
**ఎదిరికెప్పుడు చేయు హితమెల్ల తనదనుచు చదివి చెప్పనియట్టి చదువేల**

అన్నాడు అన్నమయ్య. ఈ ధర్మాన్నే ఎంతో చక్కగా చెప్పాడు. సంపాదించేది శుద్ధంగా ఉంటే మన బ్రతుకు శుద్ధమవుతుంది. మన చిత్తం శుద్ధమవుతుంది. అప్పుడు ఈశ్వరుని అనుగ్రహానికి పాత్రులమవుతామని మన సంస్కృతి చెప్తోంది.

**నాలుగవది శౌచం.** శౌచం అంటే శుభ్రత. శుచి – శుభ్రత అనే మాటలు వింటుంటాము. అదృష్టవశాత్తు ప్రపంచంలో అన్ని దేశాలకు శుభ్రత ఉంది. హైందవధర్మంలో శుచి, శుభ్రత – రెండూ ఉన్నాయి. శుభ్రత అంటే పరిసరాలు శుభ్రం చేసుకోవడం, ఒళ్ళు శుభ్రం చేసుకోవడం. శుచి అంటే మంత్రం ద్వారా, ఆచరణ ద్వారా సంస్కరింపజేసుకోవడం. మనవారు స్నానం చేసిన తరువాత భగవంతుని దగ్గరకు శుచిగా వెళ్ళడం, తిలకధారణ చెయ్యడం, భస్మధారణ చెయ్యడం – వీటన్నిటి వల్ల శరీరం శుచి అవుతోంది. అలాగే మడి, తడి, అంటు, ముట్టు, మైల – ఈ ఆచారాలన్ని పాటించడం వల్ల శుచి ఏర్పడుతున్నది.

శుచి ఏర్పడినప్పుడు దివ్యమైన దేవతలకు దగ్గర కాగలము. శౌచం అనేది చాలా ప్రధానంగా చెప్పారు. ఈ శౌచం మన హిందూధర్మంలో ప్రధానమని చిన్నప్పటి నుంచి నేర్పగలిగితే ఇప్పుడు 'స్వచ్ఛ భారత్' అని కష్టపడవలసిన అవసరం ఏం ఉంటుందో ఆలోచించండి. భారతదేశంలో ఆసేతు శీతాచలం ఎన్నో పవిత్రమైన క్షేత్రాలు, అనేకమైన ఆలయాలు కల్మషభూయిష్టంగా కనబడుతూ ఉంటే గుండె తరుక్కుపోతోంది.

అలాగే పుష్కరాలు వచ్చాయని తీర్థస్నానాలకి వెళితే అక్కడ షాంపూలు, తలంటు

పోసుకోవడాలు, బట్టలు ఉతకడాలు ఇవన్నీ. పుణ్యనది అని ఒక వైపు 'అమ్మా!' అని దండం పెడుతూ, మరొక వైపు ఉమ్మారంటే వారి కంటే పాపాత్ములు ఇంకొకరు ఉంటారా? ఇదా మన సంస్కృతి? అలాంటప్పుడు అసలు తీర్థస్నానాలు చెయ్యకుండా ఉండడమే చాలా మంచిది. నదులను పాడు చెయ్యవద్దని వేదం చెబుతోంది. **'న నిష్ఠీవ న మూత్ర పురీషం కుర్యాత్'** అని వేదం చెప్తోంది. నదులలో కాని, నదీ సమీపాలలో కానీ ఉమ్మరాదు. మూత్ర పురీషాలు విడవరాదు. **భీష్ముడు భారతంలో ధర్మరాజుకు చెప్పాడు, "ఎవరైతే పదిమందీ నడిచే త్రోవలు, పది మందీ త్రాగే నీరు, పరిసరాలు కలుషితం చేస్తాడో వారిని ప్రభుత్వం కఠినంగా శిక్షించాలి."**

యుగాల క్రితమే శుచిని, శుభ్రతని శౌచం అనే మాటతో బోధించిన మన సంస్కృతికి ఇప్పుడు శుభ్రత, శుచి కరువయ్యిందని బాధ కలుగుతోంది...

నీతిని బోధించిన భారతదేశమే అవినీతిలో అగ్రస్థానంలో ఉందని బాధ కలుగుతోంది...

అహింసని బోధించిన భారతదేశంలోనే ఏడాదిలో గోమాంసం ప్రపంచ దేశాలకు ఎక్కువగా ఎగుమతి అవుతోంది అని బాధ కలుగుతోంది...

ఎందుకు వచ్చింది ఈ అసందిగ్ధత!? ధర్మానికి, మానవ జీవనానికి ఉన్న బంధం తెగిపోయింది. ధర్మం అనగా ప్రవచనాలలో చెప్పేదే కాని, ఆచరించేది పోయింది.

సత్యం, అహింస, అస్తేయం, శౌచం – ఈ నాలుగూ పట్టుకుంటే చాలు. మనం, మన పరిసరాల శుభ్రత అనేది చాలా అవసరం. మనం అందంగా పాలరాతి భవనం కడతాం. చుట్టూ బురద, పందులు, ప్లాస్టిక్ కవర్లు.. ఎలా ఉంటుంది! ఈ సమయంలో శ్రీ శ్రీ అన్న మాట గుర్తొస్తుంది.

**మనదీ ఒక బ్రతుకేనా కుక్కల వలె నక్కల వలె**
**మనదీ ఒక బ్రతుకేనా సందులలో పందుల వలె**

వినడానికి జుగుప్సగా ఉన్నా పరిస్థితి అలాగే ఉంది. సత్యం, అహింస,

శౌచం, అస్తేయం – ఈ నాలుగు పాదాల ధర్మమే వృషభం. ముందు వృషభానికి దండం పెట్టి తరువాత శివునికి దండం పెట్టు అంటే అర్థం... ముందు ధర్మాన్ని ఆచరించు, తరువాత దైవాన్ని చూడు అని చెప్తున్నారు. 'వృషభం కొమ్ములలో నుంచి శివుని చూడరా!' అంటే ఎడమ చెయ్యి పెట్టాలా, కుడి చెయ్యి పెట్టాలా అనే ప్రశ్నలే మిగిలాయి. దీపం ఎడమ వైపు పెట్టాలా, కుడి వైపు పెట్టాలా? రెండు ఒత్తులు పెట్టాలా, మూడు వత్తులు పెట్టాలా? ఇవే ధర్మాలు కాదు. జీవితంలో సత్యం, అహింస, శౌచము, అస్తేయములు రావాలి.

## ధర్మం యొక్క అయిదు స్వరూపాలు– పంచ యజ్ఞాలు

ధర్మం యొక్క నాలుగు స్వరూపాలతో పాటు ఇంకొక అయిదు స్వరూపాలు ఉన్నాయి. భారతీయసంస్కృతిలో యజ్ఞమే ధర్మం. మొత్తం హిందూసంస్కృతి అంతా ఇక్కడ కనబడుతోంది. ఇది విశ్వంలో ఎవరికైనా పనికి వస్తుంది. ఈ అయిదు యజ్ఞాలు పాటించడమే భారతీయసంస్కృతి. దేవయజ్ఞం, పితృయజ్ఞం, ఋషియజ్ఞం, మనుష్యయజ్ఞం, భూతయజ్ఞం. ఇవే పంచ యజ్ఞాలు. ఈ పంచయజ్ఞాలు చేస్తే భగవంతుడు సంతోషిస్తాడు. అందుకే **'పంచయజ్ఞప్రియా'** అని లలితానామం.

**దేవయజ్ఞం–** అంటే దేవతలను ఆరాధించాలి. ఎందుకు? ఏదో ఇస్తారని కాదు, ఎన్నో ఇచ్చారని దేవతలను ఆరాధించాలి. సూర్యుడు, చంద్రుడు, కాంతి, గాలి, నీరు – వీటిని మనం సృష్టించలేదు. ఆ నీటిని త్రాగే నోరు, రుచిని గ్రహించే నాలిక, అరిగించే అగ్ని, చూసే కన్ను మనం సృష్టించలేదు. వచ్చిన శరీరంతో తయారవుతున్నాం కానీ, శరీరాన్ని తయారు చేసుకుని తిరగడం లేదు.

బయట అనుభవించే ప్రపంచాన్ని సృష్టించాడు, అనుభవించడానికి ఇంద్రియశక్తులు ఇచ్చాడు కనుక ఎన్నో ఇచ్చినందుకు కృతజ్ఞతలు చెప్పడానికై దేవుని ఆరాధించాలి. లేకపోతే కృతఘ్నత అనే దోషం వస్తుంది. నమస్కరించడం

వల్ల దేవునికి ఏమీ ఒరగదు. మనం నమస్కరించడం వల్ల మనలో కృతఘ్నత అనే దోషం పోతుంది.

**పితృయజ్ఞం** – దేవతల తరువాత మళ్ళీ గొప్పవారు తల్లి, తండ్రి. ఇది చాలా ప్రధానమైనది. బ్రతికున్నప్పుడంతా వారిని గౌరవించడం, మరణించిన తరువాత ప్రతి ఏడాది వారిని గుర్తు పెట్టుకుని తీర్థాలలో, క్షేత్రాలలో, ఆబ్దికాలలో విధులు చేయడం. "పోయినవారు ఎక్కడ ఉన్నారో ఎవరికి తెలుసండీ!... ఇవన్నీ పెట్టాలా?" అన్నాడు ఒకాయన. ఎందుకు పెట్టాలో చెప్పాలంటే కనీసం వారం రోజులు పడుతుంది. అది ఒక విజ్ఞానం. వారు ఎక్కడ ఉన్నారో తెలియదు కాని, వారి వల్ల పుట్టిన వాళ్ళు ఇక్కడే ఉన్నారు. వారు ఇచ్చిన శరీరంతో బ్రతుకుతున్నారు కనుక బ్రతికినంతకాలం వారిని తలచుకోవాలి. పితృదేవతలు అని చెప్పబడే ముప్పది ముగ్గురు పితృదేవతా గణాలు ఉన్నారు. తండ్రిని, తాతని, ముత్తాతని, తల్లిని తలచుకుని కర్మలు చేసేవారిని పితృదేవతలు అనుగ్రహిస్తారు. అది పితృయజ్ఞం.

**ఋషియజ్ఞం** – పశువులలా బ్రతకకుండా ఒక సంస్కారం, తల్లి, తండ్రి, నాగరికత, ఉపనయన సంస్కారం, నామకరణ సంస్కారం, వివాహసంస్కారం, అంత్యేష్టి ఇత్యాది పదహారు సంస్కారాల ధర్మాన్ని బోధిస్తూ... అడుగడుగునా జ్ఞానాన్ని చెప్తూ... పశుత్వం నుంచి పరమాత్మతత్త్వం వైపుగా పరిణమింపజేయడానికై జ్ఞానాన్ని ఇచ్చిన ఋషుల ఋణం తీర్చుకోవాలంటే ఎన్ని జన్మలెత్తినా సరిపోదు. ఋషుల ఋణం మనం తీర్చుకోగలమా? ఒక రామాయణం, ఒక భారతం, వేదం, ఉపనిషత్తులు, కావ్యాలు, శాస్త్రాలు...

అన్ని ఋణాల కంటే గొప్పది ఇది. ఋషి ఋణం ఎలా తీర్చుకోవాలి అంటే ఋషుల జ్ఞానం చెప్పిన గురువులను దేవతలుగా భావిస్తూ, ఆ జ్ఞానాన్ని అనుసరిస్తూ ఋషులు చెప్పిన శాస్త్రాలను అధ్యయనం చేస్తూ బ్రతికితే ఋషి ఋణం తీరుతుంది.

**మనుష్యయజ్ఞం** – నాలుగవ ఋణం సాటి మనుషుల ఋణం. ఇవాళ మనం

బ్రతికామంటే సమాజంలో అనేక మంది మానవుల వల్ల బ్రతుకుతున్నాం. సాటి మనిషికి ఆపదలో సహాయపడడం, అతిథి, అభ్యాగతులను ఆదరించడం, దానం చెయ్యడం ఇలాంటి వాటి వల్ల మనుష్య ఋణం తీర్చుకోగలం.

**భూతయజ్ఞం** – భూతయజ్ఞం అంటే చెట్టు, చేమ, పురుగు, పుట్ర, పక్షి, జంతువు వీటిని కూడా దేవతాస్వరూపాలుగా భావించి ఆరాధించడం అనే పద్ధతి ఉంది. ఈవిధంగా అయిదింటి ఋణం తీర్చుకున్నప్పుడు మాత్రమే ఈశ్వరానుగ్రహానికి యోగ్యుడు అవుతాడని చెప్పింది భారతీయసంస్కృతి.

ముందు చెప్పిన ఆ నాలుగు పాదాలు, ఇప్పుడు చెప్పిన అయిదు యజ్ఞాలు గుర్తు పెట్టుకుంటూ ఈశ్వరుని ఆరాధిద్దాం.

## గోవులో దేవుడు!?

హిందువుకు అత్యంత ప్రధానమైనది గోపూజ. గోవు గురించి చెప్పినప్పుడు చాలామంది, "హిందువులు గోవుని దేవతగా నమ్ముతారు" అని అనుకుంటూ ఉంటారు. హిందువుకు ఒక లక్షణం ఉంది. దేనివల్ల మేలు పొందుతామో దానిని భగవంతుడు అనుకుంటాం. అలా భారతదేశంలో మనకు మేలు కలిగించే జంతువు గోవు. గోవుని దేవతగా అంటున్నారు. గోవుని దేవతగా అనడం మత విశ్వాసం కాదు...ఋషి విజ్ఞానం. గోపూజ ఎవరికైనా సహకరిస్తుంది. అయితే హిందువులకు మాత్రమే ఎందుకు ఉంది అంటే భారతదేశంలో పుట్టిన ధర్మం హిందూధర్మం కాబట్టి.

భారతదేశంలో ఉన్న గోజాతి ప్రపంచంలో ఎవరికీ లేదు. ఆసేతు శీతాచలం వివిధ గోజాతులు ఉన్నా అందులో ఒక సాధారణ విషయం ఉంది. ప్రతి గోవుకి భారతదేశంలో గంగడోలు, మూపురం అనేవి ఉంటాయి. అక్కడ స్వర్ణనాడి అనే ఒక నాడి ఉంటుంది. దాని ద్వారా ఆవు మాత్రమే సూర్యకిరణాలలో నుంచి వచ్చే ఒక దివ్యశక్తిని గ్రహించగలదు. సూర్యుని నుంచి వచ్చే గోరూప కిరణాలను మూడు గ్రహించగలవు. అవి ఆవు, రెండు భూమి, మూడవది

వేదమంత్రాలు. ఈ మూడింటికీ గోవులని పేరు. ఈ గోవులను రక్షించేవాడు, గోవుల ద్వారా తెలియబడేవాడు గోవిందుడు.

భూమిని కూడా గోవు అన్నారు. భూమాత గోమాతగా కనబడడంలో అర్థం అది. అలాంటి ఆవు ఉనికి, ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి... ఇవి బుద్ధిని వర్థిల్లజేసి చిత్తాన్ని శుద్ధి చేస్తాయి. పంచగవ్యప్రాశన అనేది ప్రధానంగా చెప్పారు. ప్రపంచం మొత్తం మీద ఆరోగ్యాన్ని ఇవ్వగలిగే మూత్రం గోమూత్రం మాత్రమే. అదీ భారత జాతి గోమూత్రం మాత్రమే అని విజ్ఞానశాస్త్రం చెప్తోంది. అలాగే గోమయం. ఇతర జంతువుల మలాలకి ఆ ఔషధశక్తి లేదు. భారతజాతి గోజాతికి మాత్రమే ఉన్నది. పాలిచ్చే జంతువులన్ని గోవులు కావు. దేశవాళీ ఆవులు మాత్రమే గోవులు.

ఆయుర్వేదంలో కొన్ని మందులకు అనుపానాలు చెప్తారు. అనుపానం తేడా చేస్తే మందు వికటిస్తుంది. పాలతో వేసుకోవలసిన మందును నీళ్ళతో వేసుకుంటే కొత్త రోగం వస్తుంది. కానీ ఆ పాలతో వేసుకోమని చెప్పిన ఆయుర్వేద ఔషధాన్ని జెర్సీ పాలతో వేసుకుంటే కొత్త రోగం వస్తోంది. జెర్సీ పాల నెయ్యితో వాడితే కొత్త రోగం వస్తోంది. **గోవు అనగా భారతీయ దేశవాళీ గోవు మాత్రమే.** గో ఆధారిత వ్యవసాయం, గో ఆధారితమైన క్షీర సంపద మన దేశానికి సంపద అని మన ఋషులు గుర్తించి ఏర్పాటు చేశారు. ఇదొక విజ్ఞానమని గౌరవించామే తప్ప మత విశ్వాసం కాదు.

భారతజాతికి మాత్రమే ప్రత్యేకమైన గోవును భారతదేశంలో పుట్టిన ప్రతివారు... ఏ మతం వారైనా కాపాడుకున్నప్పుడు భారతదేశమంతా క్షేమంగా ఉంటుంది. గోవుని 'అఘ్న్యా' అన్నారు. అంటే కొట్టకూడని జంతువు అని అర్థం. కొట్టకూడని జంతువు అని చెప్పారంటే ఇంకొక మాట వినడానికి కూడా భయంకరం. అలాంటి గోజాతికి కానీ హింస జరిగితే గోవుకి సంబంధించిన సర్వమూ కంపిస్తాయి, అంటే భూమి, సూర్య కిరణాలు, ధర్మం కూడా కంపిస్తాయి.

గోవుని వధిస్తే ప్రకృతి ఉత్పాతాలు ఏర్పడతాయి. క్షోభ ఏర్పడుతుంది. అసలు

అహింస సర్వజంతువుల పట్ల పాటించడం మంచిదే. కానీ మాంసాహారులైనా భారతీయ హిందువులకు కొన్ని నియమాలు ఉన్నాయి. మిగిలిన వారిలా ఏది పడితే అది తినరు. ఎప్పుడు పడితే అప్పుడు తినరు. దీని గురించి భారతం చెప్తూ... హిందూధర్మంలో మాంసం నిషేధించిన జాతులు ఏనాడూ పుచ్చుకోకూడదు. మాంసం పుచ్చుకునే జాతులు పుచ్చుకుంటే దోషం కాదు. కానీ ఆ పుచ్చుకునే వారికి కూడా ఏది తినాలో శాస్త్రం చెప్పింది. అవే తింటూ, ఏ రోజులలో పుచ్చుకోకూడదో చెప్పారు. పర్వదినాలలో, ఆదివారం మాంసం తినరాదు. ఆ రోజే సెలవు వచ్చిందని తింటూ ఉంటారు. కొత్త పాపాలు వస్తాయి జాగ్రత్త! శాస్త్రం చెప్తున్నది చెప్పడం జరుగుతోంది.

## స్త్రీ తైల మధు మాంసాని రవివారే విసర్జయేత్

కొన్ని తిథులలో తినరాదు. అంటే అసలు నిర్మూలించే కంటే ముందు నియంత్రణ చేశారు. భీష్ముడు ఇంకొక మాట అంటాడు. 'మాంసం తినే జాతులు తింటే దోషం లేదయ్యా! కానీ వారు కూడా బుద్ధి మార్చుకుని మాంసం మానేస్తే ఇంకా గొప్పవారవుతార'ని చెప్పారు. **భారతీయులు దేనిని నమ్మినా విజ్ఞానము ఉన్న దానినే విశ్వసిస్తారు తప్ప విశ్వాసాన్ని విజ్ఞానం అని దబాయించరు.**

## హైందవధర్మంలో ఈశ్వరారాధన అంటే ఏమిటి?

సత్య, అహింస, శౌచ, అస్తేయములు, పంచయజ్ఞ సిద్ధాంతము చెప్పుకున్నాం. ఈ పంచయజ్ఞ సిద్ధాంతం, సత్య, అహింసల గురించి చెప్తే ఈ ధర్మం కేవలం ఒక వర్గానికి మాత్రమే పరిమితమా? ప్రపంచంలో ఏ మానవునికైనా పనికి వచ్చే విశ్వజనీనమైన హిందూ ధర్మాన్ని నమస్కరిద్దాం.

## వేదోద్ధర తిరువేంకటనాయక నాద ప్రియ తే నమో నమో

కనుక హిందూధర్మాన్ని రక్షించడానికై ఆ పరమాత్మను ప్రార్థిద్దాం. ఎందుకంటే ధర్మం వల్ల దేశం బాగు పడుతుంది. ఆ ధర్మాన్ని, దేశాన్ని కాపాడడానికి స్వామీ! నువ్వే ఉన్నావు. మా చేత చేయించే శక్తివి కూడా నువ్వే. ధర్మం రక్షించడం

రెండు విధాలు– ఆచరించితే ధర్మం రక్షింపబడుతుంది. ధర్మానికి దెబ్బ తగులుతూ ఉంటే నీ చేతనైనంత శ్రమపడి ధర్మాన్ని రక్షించే ప్రయత్నం కూడా చెయ్యాలి. అంతేకానీ 'చిన్ని నా పొట్టకు శ్రీరామరక్ష' అని కూర్చుంటే సరిపోదు. భగవంతుడు ఇచ్చిన అవకాశాన్ని, అధికారాన్ని వినియోగించుకుంటూ ధర్మాన్ని రక్షించుకునే ప్రయత్నం చెయ్యాలి.

**ధర్మో రక్షతి రక్షితః**

